నామలింగానుశాసన మను

# అమరకోశము

(శ్రీ అమరసింహకవి ప్రణీతము.)

## త్రికాండము

తెలుగు టీకా, హిందీ - ఇంగ్లీషు పర్యాయపదసహితము.




## రాయలు అండ్ కో
ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,
కడప : మద్రాసు.


 1951 [వెల : రూ.

# AMARAKOSAM - TRIKANDAM

*by*

SRI AMARASIMHAKAVI

*with*

Telugu - English - Hindi meanings



THE JUPITER PRESS, LTD., 16, [illegible] STREET, MADRAS 1.

# ప్రకాశకుల విజ్ఞప్తి

భగవత్కృపవలనఁ జిరకాలవాంఛిత మీనాఁటి కీడేరినది. ఇదిగో అదిగో అనుచు వచ్చిన ఈ ప్రచురణ నేఁటికి ఆంధ్రపాఠకలోకమునకు అర్పింపఁగలుగుచున్నాము.

దీని ప్రచురణ విషయమున చాల జాగైనమాట ఒప్పుకొనక తీఱదు. కాని, అందుకుఁగల కారణములను విషయజ్ఞులైన పాఠకమహాశయులు గ్రహింపకపోరు. అయినను మావంతు మేము చెప్పుట మా ధర్మము.

దీని ముద్రణ మారంభించి రెండేండ్లు దాటినది. ముద్రాశాలవారిని ఎంత తొందఱపెట్టినను, మేమెంత తొందఱపడినను ఆలస్యమయియే తీఱినది. పెద్దగ్రంథమగుట ఒకటి; మూఁడు భాషాలిపులతో కూడియుండుట రెండు; కాగితములు, కాటుక మొదలైన ముద్రణాసామగ్రికి తలవని తలంపుగా వచ్చిన కటికి కాటకము మూఁడు; ఆఱు మూఁడైనను మూఁడు ఆఱైనను పుస్తకమును మఱెవరును తీర్చని అందచందములతోఁ దీర్చవలయునను పట్టుదల నాలుగు—ఇంకను ఇట్టివే మఱెన్నో కారణములు చేరి అనుకొనని విధముగా ఇంత జాగు అయినది.

దేశకాలపరిస్థితు లెఱిఁగిన ఆంధ్రమహాజనులు ఈ ఆలస్యమునకు మమ్ము మన్నించి, దీనిని దప్పక ఆదరింతురని ఆశించుచున్నాము. వారి ఆదరప్రోత్సాహములతో ఇట్టి ప్రచురణలు ఇంకను ఎన్నిటినో వెలువరింపవలెనను గాఢసంకల్పము మమ్ము నలముకొనియున్నది. ఆ సంకల్పమును సిద్ధింపఁజేయు బాధ్యత సర్వథా ఆంధ్రమహాజనులదే అని విన్నవించుచున్నాము.

ఈ ప్రచురణకు మా ఆదర్శమున కనుగుణముగా సంస్కృత మూలమును శుద్ధముగాఁ బరిష్కరించి, నలుగురికి నచ్చునట్లు తెలుఁగు టీకా వివరణములు సమకూర్చి పీఠిక వ్రాసి యిచ్చిన బ్రహ్మశ్రీ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారియొక్కయు, బహుళవ్యాసంగములు పెట్టుకొనియు, కార్యభారమును సరకుసేయక ఇందలి సంస్కృతాంధ్రాంగ్లపదములకు అనుగుణమైన హిందీపర్యాయపదములను సమకూర్చి పెట్టిన విద్వాన్ శ్రీ ఎ. సి. కామాక్షిరావు, B. A., B. O. L. గారియొక్కయు, గ్రంథమునందు తప్పులు పడకుండ ఆద్యంతము చక్కగ చూచిన శ్రీ టి. వి. రంగాచార్లుగారియొక్కయు అవ్యాజానురాగమును ఎంత కొనియాడినను తీఱదు. వారి కివే మా కృతజ్ఞతావందనము లర్పించుచున్నాము.

నాలుగుభాషలలో ఇంత నాణెముగాఁ దీరిన అమరము ఇదివఱకు లేని లోటును ఎంతో కష్టించి, ధనము వెచ్చపెట్టి యీ విధముగాఁ దీర్చి మావంతు విధి మేము నెఱవేర్చినారము. మిగిలిన భారము పాఠకులకే వదలినారము.

కడప,
1-2-1951.

ప్రకాశకులు.

# సంకేతముల వివరణము

| | |
|---|---|
| పర్యాయపదముల యర్థములను, లింగములను దెలుపువానికి రెండువైపుల | ( ) |
| అజంతశబ్దములకు ... | అ–ఆ మొదలైనవి |
| హలంతశబ్దములకు ... | చ్–జ్–త్–ష్–స్ మొదలైనవి |
| అవ్యయములకు ... | ‖అ‖ |
| పుంలింగములకు ... | ‖పు‖ |
| స్త్రీలింగములకు ... | ‖స్త్రీ‖ |
| నపుంసకలింగములకు ... | ‖న‖ |
| పుంస్త్రీలింగములకు ... | ‖ప్స‖ |
| పున్నపుంసకలింగములకు ... | ‖ప్న‖ |
| స్త్రీనపుంసకలింగములకు ... | ‖స్న‖ |
| త్రిలింగమునకు ... | ‖త్రి‖ |
| పాఠాంతరములకు ... | ‖పా‖ |
| పక్షాంతరములకు ... | ‖ప‖ |
| ఏకవచనములకు ... | ‖ఏ‖ |
| ద్వివచనములకు ... | ‖ద్వి‖ |
| బహువచనములకు ... | ‖బ‖ |
| ఉదాహరణములకు ... | ‖ఉదా‖ |

శ్రీరస్తు.

# ఉపోద్ఘాతము

సకల జీవకోటిలో మానవజన్మ యుత్తమము. సకల శ్రుతి స్మృతి పురా
కావ్యనాటకాదులయందలి సారమును గ్రహించి సమాజశిక్ష కనువగురీతి నితరు
నడిపించుచుఁ దాను నడచుచు నిహపరలోకసుఖంబుల ననుభవింప నర్హమై
దీ మానవజన్మమని యెల్లరకు సువిదితము. సర్వము శబ్దశక్త్యధీనము. శబ్ద
వివిధ పదార్థ బృంహితము. పదస్వరూపమును 'సుప్తిఙంతంపదమ్' అని వ్యాకర్త
వచించిరి. "ఏకః శబ్దః సుష్ఠు ప్రయుంజానో స్వర్గే లోకే కామధుగ్భవతి" అ
సూత్రమున సుశబ్దము సుప్రయోగమయినయెడ స్వర్గసుఖంబుల ననుభవిం
జేయునను భావ మిందు వ్యక్తము. సకలశాస్త్రములను, నిగమములను నవగత
చేసికొనవలయునన్నఁ దదర్థబోధ మత్యావశ్యకము. పదములయం దొక శ
యిమిడియుండును. అది మనస్సున కొకవిధమగు ప్రచోదనము గల్గించు
మానవుఁడు దానివలన సకలవిధములగు కార్యముల నిర్వహించుటకు సమర్థ
డగును. వివిధములగు శ్రుతిస్మృతుల యర్థమును గ్రహింపవలయునన్న వ్యాక
ణాదులు తోడ్పడఁగలవు. పెద్ద లిక్కారణముననే వ్యవహారమువలనను, ఆ
వాక్యమువలనను, కోశాదులవలనను, వ్యాకరణంబువలనను, ఉపమానమువలన
వాక్యముల సందర్భమువలనను పదములయొక్క భావమును సులభముగఁ దె
కొనుట కనువగునని వచించిరి. ఈ తోడ్పడువానిలో నొకదానికంటె నొక
యెంతయు వంతుగొని యుపకరించునందురు. ముఖ్యముగా నిఘంటు పర్యా
పదమగు కోశము మిక్కుటముగా నుపకరింపఁగలదని విజ్ఞుల మతము. తర్కిం
చూడఁగా నిదే సత్యమని తోఁచుచున్నది. ఒకే యర్థమును దెలుపు పదము
విరివిగ నుండినను, వాని నేకత్ర సమావేశపఱచి భాషాసేవకులకు సులభము
దోడ్పడి భాషాభివృద్ధిని గలిగించునవి నిఘంటువు లను మాట యథార్థవ
ఈ నిఘంటువులందలి పదములన్నియు వ్యుత్పత్తి సహితములై సార్థకముల
యుండును. వీని నభ్యసించుటవలన యథార్థ జ్ఞానము తప్పక యేర్పడఁగలదు.

ఈ యథార్థజ్ఞానము తాను తరించుటకును నితరులఁ దరింపఁజేయుటకును మూ
కారణముగా నుండును. శుద్ధమగు పద ప్రయోజనమును దెలిసి ప్రయోగించుటకు

ననుకూలత యేర్పడును. ఈ లోకమున భాషాసేవచే లోకసేవ చేయుట, తద్వారా కృతార్థత గలుగుట, సత్పదప్రయోగముచే సుకృత సంపాదన మగుటవలనఁ బుణ్యలోకానుభవమును గలుగుననుట నిర్వివాదాంశము. 'అర్థము తెలియని చదువు వ్యర్థము' అన్నట్లు చదువుట కెంతవచ్చినను, నిరాఘాటముగ సకల గ్రంథములను జదువఁ గల్గినను పదార్థజ్ఞానవిరహితమగు చదువు చూడ నడవియందుఁ గాసిన వెన్నెలవంటిది. భస్మహవ్యమువంటిది. కాఁబట్టియే పదార్థ విజ్ఞానము మనుష్య జన్మమెత్తినవానికి ముఖ్యమనవలయును. మనుష్యులే కాదు, పశువులుకూడ ధ్వనినిబట్టి సకల కార్యకలాపముల నిర్వహించుటకు సమర్థములయి యుండుట మనము లోకమునఁ గాంచుచునే యున్నాము. కనుక శబ్దబ్రహ్మోపాసన మత్యంత మావశ్యకమయిన విషయము. చదువుటకును, వ్రాయుటకును రానివారు కూడఁ బదము విన్నంతమాత్రముననే యర్థావబోధము నొంది ప్రపంచ ప్రవృత్తి యందుత్సాహవంతులై కార్యశూరులగుటకుఁ గారణమేమి? శాబ్దబోధయే. వారికీ జ్ఞాన మెట్లు కల్గినది? కోశములను బఠించియా యనవలదు. ఆప్తవాక్యము ముఖ్యమని యెఱుంగవలయు. తగినవారు నమ్మకముగలవారీ పదమున కిది యర్థ మని వస్తుజ్ఞానము నెఱుకపఱచి యలవాటుపడునట్లు చేయుటవలన నెవరేమి పల్కినను నందలి యర్థమును గనుగొని మనస్సు ప్రేరేపింపఁగాఁ గార్యవ్యగ్రు లగుచుండుట యని తెలియవచ్చును. ముఖ్యముగా నొక్క విషయ మాలోచింతము. పసిబాలురు క్రమక్రమముగా భాష నధిగమించి మనము చెప్పిన నడుచు చుండుటకు, మనము పల్కిన పల్కుల యర్థమును గమనించుచుండుటకు హేతు వేమందురు? ఆప్తవాక్యముయొక్క మహిమయే. ఈ విధముగ వృద్ధిపొందిన భాష మఱింత వివేకమును గల్గించి శ్రుతి స్మృతి పురాణాదులందుఁ గల యర్థావ బోధము నొనరింప నెపుడు సమర్థమగునా యనిన నేకార్థబోధకములగు పెక్కు పదములను దెలిసికొనఁ గల్గుటచేతనే యని యెఱుంగనగును. ఇట్టి యేకార్థబోధ కములగునవియే కోశములు, నిఘంటువులు అందురు. ఈ నిఘంటు జ్ఞానము బాల్య ముననే యలవడిన భాషాభివృద్ధికిఁ గడుంగడు తోడ్పడునని ముమ్మాటికిఁ జెప్ప వచ్చును.

ఇట్టి నిఘంటువు లన్నిభాషలకును లేవు. కొన్నిభాషలకు మాత్రమే కలవు. కొన్ని నిఘంటువులు నామములు మాత్రమే వివరించును. అవియును క్రమముగఁ గాక యేదో యొక పద్ధతి ననుసరించును. కొన్ని లింగములఁ దెల్పును, అవియును నస్తవ్యస్తముగనే యుండును. సంస్కృతభాషయందుఁ

బెక్కు నిఘంటువులు కలవు. ఒక్కొక్కటి యొక్కొక్క పంథయందున్నది. ఒక్కొక్క తెగకుఁ జేరిన పదముల నొక్కొక్క భాగమున నిమిడించి వానికిఁ దదనుగుణమగు లింగజ్ఞానమును దెల్పు నిఘంటువులలో మిన్న యనందగినది యమరసింహకృతమగు నామలింగానుశాసనమే యని చెప్పవలయును. మేదినీకోశము, విశ్వకోశము, ధనంజయ నిఘంటువు, హారావళి, నానార్థ రత్నమాల మున్నగునవి యెన్ని యుండినను సకలశాస్త్రవేత్తయగు అమరసింహుని నామలింగానుశాసనముతో సరిరావని చెప్పవలయును. మహాపండిత చక్రవర్తియగు అమరసింహుఁడు నామలింగానుశాసనము రచించుటచే నీ గ్రంథరత్నముయొక్క విలువను దేశమున వెలయింపఁదలఁచి పెక్కు వ్యాఖ్యానములు, వివరణములు పండిత ప్రకాండులు గావించిరి. ఇందువలన నీ నామలింగానుశాసన ప్రయోజనము సుస్పష్టమగును. గురుబాలప్రబోధిక (లింగాభట్టీయము), రామాశ్రమీయము, అమరసారము మున్నగునవి యెల్లరకుఁ దెలిసిన విషయమే. అమరసింహుఁడు గ్రంథములనెల్లఁ బఠించి, శోధించి, నిఘంటువులఁ దర్కించి యీ నామలింగానుశాసనమును రచించినాఁడు. దాననే "సమాహృత్యాన్యతంత్రాణి" అని ఘంటాపథముగఁ జెప్పియున్నాఁడు.

ఈ యమరసింహ మహాకవి కాలనిర్ణయాదికము పలువురు పలువిధములుగఁ జేసియున్నారు. చారిత్రకకారుల సిద్ధాంతము మాత్రము క్రీస్తుశకము ఏడవశతాబ్ది యారంభమున నుండవచ్చునని మాత్రము తేలుచున్నది.

"ధన్వంతరిక్షపణకామరసింహ శంఖ
భేతాళ భట్ట ఘటకర్పరకాళిదాసాః
ఖ్యాతోవరాహమిహిరో నృపతే స్సభాయాం
రత్నానివై వరరుచిర్నవ విక్రమస్య"

అను శ్లోకానుసారముగ విక్రమాదిత్యుని సభయందుండు నవరత్నములలోఁ జేర్కొనఁబడిన యమరుఁడు నామలింగానుశాసన కర్త యని తెలియుచున్నది. కొందఱ మతమున క్రీస్తుశకమునకుఁ బూర్వము విక్రమాదిత్యుఁ డుండుటచేఁ దత్సభారత్నముగ అమరసింహుఁడుకూడ నుండుటవలనఁ దత్కాలికుఁడని యెన్నుదురు. ఇదమిత్థమని యింతదనుకఁ గాలనిర్ణయము చేయఁబడలేదు. ఏ కాలమువాఁడైనను సరే యఖండ యశోవిరాజితుఁడగు నీ యమరసింహుఁడు సర్వదా సర్వథా స్మరింపఁదగినవాఁడు, పూజింపఁదగినవాఁడనుట నిర్వివాదాంశము.

అమరసింహుఁడు శబరస్వామి పుత్త్రుఁడు. శూద్రస్త్రీయందు జనించిన వాఁడు అని చెప్పుదురు. ఇం దెంత సత్యము గలదో? ఇట్టి ఆకాశపంచాంగముల వంటి కథలను విశ్వాసముంచి మహాకులసంభవుని నిష్టానుసారముగఁ జరిత్రలఁ గల్పించి దూషించుట మంచిదిగాదు. తన గ్రంథమున నించుకైనను దన కులగోత్రములను దెల్పుకొనకపోవుటచే నిట్టి కల్పనల నల్లుట విజ్ఞుల లక్షణముగాదు. ఇతఁడు గొప్ప పండిత వంశమునఁ బుట్టినవాఁడు. చక్కని విద్యాపరిశ్రమ చేసినవాఁడు. సంస్కృత వాఙ్మయాభ్యాసకులకు ఈ మహామహుని నిఘంటు భిక్షయే యాధారమనవలయు.

మతవిషయమునఁ జర్చించినచోఁ దన నిఘంటువగు నీ నామలింగానుశాసనమునందు మొదటనే

"యస్య జ్ఞానదయాసిన్ధో రగాధ స్యానఘా గుణాః
సేవ్యతా మక్షయో ధీరా స్స శ్రియే చామృతాయచ"

అని మంగళమును గావించుటలోఁ బాఠకులకై యెంతటి గొప్పవిషయమును బ్రతిపాదించినాఁడో చూడుఁడు. ఏ మతమునుగాని యే దైవమునుగాని పేర్కొనలేదు. గుణములను బేర్కొన్నాఁడు. 'యస్య' యను యచ్ఛబ్దముయొక్క షష్ఠ్యేకవచన మెంత నిగూఢముగా నుంచినాఁడో యోజించిన నెన్నియో భావములు గలవు. పాఠకుల కెట్టి వరములను గోరియున్నాఁడో యెంచిన కొలఁది నఖండముగ ననంతముగఁ గన్పడును. రెండవశ్లోకమునఁ దన గ్రంథమునకుఁ గల నామధేయమును, దత్ప్రయోజనమును సూచించియున్నాఁడే గాని మతమును నిష్టదైవమును బేర్కొనలేదు.

తాను రచింపఁబూనిన నామలింగానుశాసనమున లింగజ్ఞానోపాయము నే మూఁడవశ్లోకమున నుదాహరించినాఁడు గాని తన మతమునుగాని, తన యిష్టదైవమునుగాని తెలుపలేదు. ఇఁక నాలుగవ శ్లోకమునందును, నైదవ శ్లోకమునందును విశేషించి తన నిఘంటువునందలి ద్వంద్వసమాసములందు లింగజ్ఞానముకొఱకును, లింగముల విధించునపుడు లఘుత్వముకొఱకుఁ గొన్ని సంకేతములను వివరించియున్నాఁడు. ఇంతియేగాని తన కులదైవమునుగాని యభిమతమగు మతమునుగాని వివరింపలేదు. మొదటి శ్లోకమునం దుదాహరించిన గురుపాదపద్మస్మరణము సకలాభీష్టదమనుట మాత్రమే యెల్లరకు స్పష్టమగును.

ఇఁక నాలవ శ్లోకము మొదలు స్వర్గవర్గము ప్రారంభము. అందయిన వ యిష్టదైవమును మొదటఁ జెప్పఁబూనినాఁడా యన్నచో నట్లుగాక స్వర్గమున వతలను, రాక్షసులనుగూర్చి చెప్పినాఁడు. తర్వాతఁ ద్రిమూర్తులను జెప్ప ాలు శ్లోకములతో బుద్ధదేవుని, ననఁగా సౌగతమూర్తిని, బర్యాయపదముఁ లిపియున్నాఁడు. ఆ పిమ్మట నే త్రిమూర్తులను దెల్పెను. కాఁబట్టి యీ సంవి ముచే నమరసింహ పండితుఁడు బుద్ధమతావలంబి యనియు, జనవిష్ణు సమా ్యాయములుగల పదసన్నివేశముచే నూహింపవలసియున్నది. బౌద్ధ, జైన మతః ా కాలమున వ్యాపించియుండినట్లును, నమరసింహుఁ డా మతమునఁ బరిపూ ష్ఠగలవాఁడయినట్లును విజ్ఞులు తెల్పుదురు. ప్రథమశ్లోకమునఁ గల 'జ్ఞానదరి ంధోః', 'అక్షయః' మొదలగు పదసామరస్యముచేత హింసారహితుఁడి ర్వజ్ఞుఁడు, దయాళువు నగు బుద్ధదేవుఁ డీ యమరసింహున కుపాస్యదైవమ ుంచవచ్చును.

మొత్తముమీఁద నే మతమువాఁడైన నేమి, యే దైవము నుపాసించువాఁడై నేమి తాను భాషాసేవ చేయుటయే కాక లోకమునకు సుజ్ఞానభిక్ష పెట్టిన మహా ారుఁ డమరసింహుఁడే యని కేల్మోడ్పవలయును. కొందఱు బౌద్ధుఁ డందుః ొందఱు జైనుఁ డందురు. కొందఱు వైష్ణవుఁ డందురు. పలువురు పలువిధః ఁగా నీ మహామహుని బేర్కొందురు. ఆ చర్చ యిఁక ననవసరము.

కాలమును గూర్చియుఁ గ్రీస్తువునకంటె ముందు నేఁబదియాఱువత్సరమ ాఁటివాఁడని నిర్వచింతురు. కారణము విక్రమార్క మహీపాలుని యాస్థా ున నున్నట్లు తెల్పుదురు. చారిత్రకవిషయములు చక్కని యాధారములు దొ ు నే యిదమిత్థమని తేల్పవచ్చును గాని యూహాప్రపంచముతో నిర్ణయించ రిహాసజనకమే యనవలయును.

తాను వ్రాసిన గ్రంథమునకు "సంపూర్ణ ముచ్యతే వర్గై ర్నామలింగ శాసనమ్" అని పేరుపెట్టినను, లోకములో మాత్రము "అమరము", "అః ోశము" అను నామములచేతనే ప్రసిద్ధి నందినది. గ్రంథకర్త నామము తెలిం వా రీ లోకమున నుండరని విదితమగును. కొందఱు మహాకవులు తమరు గ్రంథములకుఁ బేళ్లు ప్రత్యేకముగ సార్థకముగ నుంచియున్నను, వారి మహి చేతను, గ్రంథమునందలి యసమాన ప్రతిభచేతను, వారి నామములచేతనే గ్రంథములు ప్రథితమగుచున్నవి. కిరాతార్జునీయమునకు భారవి యనిఁ

శిశుపాలవధమునకు మాఘమనియు, భట్టికృతరామాయణమునకు భట్టికావ్యమనియు, అనర్ఘరాఘవమునకు మురారి యనియు నిట్లే పెక్కు గ్రంథములకుఁ బ్రతిభనుబట్టి కవి నామములు ప్రసిద్ధములై యుండుట యెల్లరెఱింగిన విషయమే. ఇవ్విధముగనే నామలింగానుశాసనముకూడ అమర మను నామమునఁ బ్రఖ్యాతికెక్కినది.

"ఇత్యమరసింహకృతౌ నామలింగానుశాసనే" యని కాండాంతములందుఁ జెప్పుటవలన నమరసింహ పండితుని రచన యని తెలిసికొనవచ్చునే గాని సాధారణముగా అమరసింహుఁడు, అమరుఁడు, అమరము అను నామములే ప్రాచుర్యముగఁ గనఁబడును.

మొత్తముమీఁద అమరము పేరు తెలియనివారు లేరనియే చెప్పవచ్చును. ఈ గ్రంథము పర్యాయపదములను బెక్కింటిని లింగజ్ఞానముతోఁ గూడ నేర్పును గావున బాలురచే నభ్యసింపఁజేయనివా రింత దనుక లేరనవలయు. ప్రతి పల్లెటూరియందును నుదయకాలమున నీ యమరము బాలురకు బడులలోఁ జెప్పుచు నుండుట యలవాటు. ఇటీవలఁ గ్రొత్త విద్యావిధానము వచ్చిన తర్వాత నలవాటు తప్పియుండవచ్చును. అయినను విద్యాభిలాషగలవారెల్లరు నీ గ్రంథమును బఠించియే తీఱవలయును. బాలురచేఁ బఠింపించియే తీఱవలయును.

"అమరము రానివారికి నే నమరను" అని సరస్వతి చెప్పినట్లు పెద్దలు వాడుచుండుట యందఱెఱింగినమాటయే. దీనినిబట్టి భాషలోఁ బాండిత్యము సంపాదింపవలయునన్న నమరమే కంఠపాఠము చేయవలయును. అమరము చదివినవానికే తెలుఁగుబాసయందుఁగూడ భారత, భాగవత, రామాయణాది మహాగ్రంథములు, ప్రబంధములు నర్థమగును. సులభముగఁ జదువుటకును నోటికిఁ బరిపాటి కలుగును. ఉదయము ప్రతిదినము నమరము పఠించుచుండిన భాషావేత్తలగుదురని నా యుద్దేశము.

ఈ నామలింగానుశాసనము మూఁడు కాండములు గలది. మొదటికాండ స్వర్గాది. రెండవది భూవర్గాది. మూఁడవది సామాన్యకాండము. గ్రంథకర్త పాఠకుల శ్రేయమును గోరి మొట్టమొదట దేవతాసంబంధమయిన విషయములు గల స్వర్గాదికాండ రచియించినాఁడు. తర్వాతఁ బ్రాపంచికముగ భూవర్గాది కాండమున భూమి, పుర, పర్వత, కానన, సింహాది జంతు, మనుష్య బ్రాహ్మణాది వర్గములకుఁ దగిన కాండము రచించినాఁడు. ఇందలి విషయమును గాంచిన నీ మహామహుని కెంతటి ప్రాపంచికమగు ననుభవము గలదో యెఱుంగవచ్చును.

తృతీయకాండమున విశేష్యనిఘ్న, సంకీర్ణ, నానార్థ, నానార్థావ్యయాదులు కవికిఁ గల వ్యాకరణాది పాండిత్యకృషిని ప్రబలదృష్టాంతముగాఁ దెల్పుచున్నవి. ఇట్టి మహిమోపేతమగు నీ గ్రంథము సర్వకాలములందుఁ బఠింపఁదగినది; కంఠపాఠము చేయఁదగినది.

అర్థములేని చదువు వ్యర్థమని యింతకుముందే మనవిచేసియున్నాఁడను. ప్రతి పదమునకు వ్యుత్పత్తి సహితముగ నర్థమును దెలిసికొనుట యత్యుత్తమమగు మార్గము. అంత పరిశ్రమలేకయున్నను నీ పదమున కిన్ని పర్యాయపదములున్నవి గదా యని తెలిసికొని వాని యర్థము నాకళించుకొనుటయును ముఖ్యమయిన త్రోవ. అట్లుగాక యూరక గ్రంథమును బఠించి యిది యీ యర్థమునకు సరిపోవుననుకొనుట రసాభాసము. ఒకానొక కవి యమరమును జదివి నాకుఁ గూలంకషమగు పాండిత్యము గలదని యొక విద్యార్థికి "ఇత్యపులు గూయంగ కోనంగుఁ డేయంగ అప్యేకదంతుండు ఆడఁదొడఁగె" అని యొకటి యల్లి యర్థమును వివరించుచుండెనఁట. ఎట్లనఁగా: ఇత్యపులు - కోయిలలు : కోకిలః పిక ఇత్యపి అని అమరము. ఇత్యపి యేకవచనము. ఇత్యపులు - కోయిలలు అని యర్థము. కూయుచుండఁగా, కోనంగుఁడు - మన్మథుఁడు : కందర్పో దర్పకోఽనంగః అని అమరము. కావున కోనంగుఁ డనఁగా మన్మథుఁడు. (బాణములు) ఏయంగన్ - వేయుచుండఁగా, అప్యేకదంతుఁడు - విఘ్నేశ్వరుఁడు, అప్యేకదంత హేరంబ లంబోదర గజాననాః అని అమరము. అప్యేకదంతుఁ డనఁగా గణపతి. ఆడఁదొడఁగె, నాట్యమాడుట కారంభించెను అని యర్థము వివరించుచుండెనఁట. దానిని మార్గమున వెళ్లుచుండు నొక పండితుఁడు విని నవ్వుకొని "పాపము! ఈ యయ్యవారు అర్థము తెలియని నామలింగానుశాసనము పాఠము చేసెనే" యని చింతించి వెంటనే యటకుఁ జేరి విషయము వివరించెనఁట. కావున సార్థకమగు చదువు వన్నె నిచ్చును.

ఈ యమరమును రాయలు అండ్ కో వారు మొదట బజారునందుండు అమరము గతులను జూచి చక్కఁగఁ బరిశోధింపఁజేసి ప్రథమకాండము మూలము మాత్రము ముద్రించిరి. తర్వాత దానికే టీక వ్రాయించి ప్రకటింపఁజేసిరి. తర్వాత నామలింగానుశాసనమంతయు ముద్రించుట బాగని తలంచి మూఁడు కాండములను సంశోధింపఁజేసి లోకమున కర్పించిరి. ప్రకృతము మూఁడు కాండములను ప్రాచీన గ్రంథములతో సవరింపఁజేసి యర్థము (టీక) తోఁ బ్రకటించిరి. విశేషించి యిందుఁ దగిన యింగ్లీషు పదములు, వర్తమాన పరిస్థితి

కనుకూలముగ హిందీ పదములు చేర్చి ప్రకటించిరి. సర్వాంగసంశోభితవ ఈ గ్రంథము బాలురకు, బాలికలకు, గ్రంథకర్తలకుఁ, కవులకుఁ, బండితుల భాషాసేవ చేయఁగోరు వారెల్లరకును నవశ్యముగ గ్రహింపఁదగినది; పఠింపఁ దగినది; కంఠపాఠము చేయఁదగినది; చేయింపఁదగినది యని యెవ్వరైః ముమ్మాటికిఁ జెప్పఁగలరు.

భాషాసేవకులారా! భాషాపోషకులారా! ఈ కడప రాయలు అండ్ వారి భాషాసేవకుఁ జేదోడు వాదోడై కృతార్థత కల్పింతురని మనవి. ఇ ఈ రాయలు అండ్ కో వారు త్రికాండశేషమునుగూడ లోకమున కర్పించుట కాక ప్రాచీన గ్రంథములను బ్రజలకు ముఖ్యముగ నుపకరించువానిని సంస్క పించి, ప్రకటించి, లోకసేవ, భాషాసేవ చేయుదురని కోరుచున్నాను.

వీరికి సర్వశక్తియుక్తుఁడగు భగవంతుఁ డాయురారోగ్య భాగ్యము బ్రసాదించుఁ గాక!

శ్రీ లలితా విలాసము,
కడప,
వికృతి వైకుంఠైకాదశి,
బుధవారము.

ఇట్లు పండితవశంవదుఁడు,
కావ్యపురాణతీర్థ, విద్వాన్,
జనమంచి వేంకట సుబ్రహ్మణ్య శర
ప్రధానాంధ్రపండితుఁడు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# అమరకోశము, సటీకము



## ప్రథమకాండము.

శ్లో. జ్ఞానానంద మయం దేవం నిర్మల స్ఫటికాకృతిమ్,
ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవ ముపాస్మహే.

అవ. అమరసింహుఁ డను కవిసార్వభౌముఁడు రచింపఁ బూనిన నామలింగానుశాసన మను నిఘంటువు నిర్విఘ్న పరిసమాప్తి నొందుటకై మంగళమును శిష్యశిక్షార్థము రచించెను:—

శ్లో. యస్య జ్ఞానదయాసిన్ధో రగాధ స్యానఘా గుణాః,
సేవ్యతా మక్షయో ధీరాః సశ్రియే చామృతాయ చ. ౧

టీ. హే అనఘాః=ఓ పాపరహితులారా! అక్షయః=విష్ణువునందు నివాసము-లేక జ్ఞానము గల (బ్రహ్మనిష్ఠుఁడైన)-లేక హింస పెట్టుటలేని, ధీరాః=జ్ఞానము నొసఁగునట్టి, సః=ప్రసిద్ధుఁడైనగురువు, (భవద్భిః=మీచేత,) శ్రియేచ=భాగ్యముకొఱకును, అమృతాయచ=మోక్షముకొఱకును, సేవ్యతామ్ = సేవింపఁబడుఁగాక, జ్ఞానదయాసిన్ధోః=జ్ఞానమునకును, కారణము లేకయే పరులయాపదలను బోఁగొట్టనెంచుట యను దయకును, సిన్ధోః = సముద్రమువంటివాఁడయినట్టి, అగాధస్య = క్రిందఁబడుటలేని (జితేంద్రియుఁడైన), అస్య=ఈ గురువునకును, ఈ = లక్ష్మియు, గుణాః = సత్యము, శౌచము, జ్ఞానము, శాంతి, దాంతి మొదలగు గుణములును (సన్తి = ఉన్నవి).

### అర్థాంతరము.

జ్ఞానదయాసిన్ధోః = జ్ఞానమునకును దయకును సముద్రమువంటి వాఁడును, అగాధస్య = ఇంద్రియములకు లోఁబడని, యస్య = ఏ

గురువుయొక్క, గుణాః = దయాశౌచాది గుణములు, అనఘాః = పాపములను బోఁగొట్టునవో, సః = అట్టి, అక్షయః = విష్ణుభక్తుఁడైన (హింసారహితుఁడైన,) ధీరాః = జ్ఞానము నొసంగునట్టి గురువు, శ్రియేచ = సంపదకొఱకును, అమృతాయచ = మోక్షముకొఱకును, సేవ్యతామ్ = కొలువఁబడును గాక.

తా. ఓ పుణ్యాత్ములారా! మీరు ఐహికాముష్మిక సుఖంబులను బొందఁగోరిన, జ్ఞానమునకును, దయకును సముద్రునివంటివాఁడు, జితేంద్రియుఁడు, నైన గురువును సేవింపుఁడు. అతఁడు సంపదయు, దయాదాక్షిణ్యాదిగుణంబులును గలవాఁడు గాన మీకు సకలసంపదల నిచ్చును.

అనఁగా కవి తన గ్రంథమునకుఁ బేరును ప్రయోజనమును దెలుపుట :—

శ్లో. సమాహృత్యాన్యతన్త్రాణి సంక్షిప్తైః ప్రతిసంస్కృతైః,
సంపూర్ణ ముచ్యతే వర్గై ర్నామలిఙ్గానుశాసనమ్. ౨

టీ. అన్యతన్త్రాణి - అన్య = వ్యాడివరరుచి మొదలగువారియొక్క, తన్త్రాణి = నామలింగానుశాసనములను, సమాహృత్య = చక్కఁగాచూచి, సంక్షిప్తైః=సంగ్రహింపఁబడిన, ప్రతి సంస్కృతైః= వేర్వేఱుగాఁ గ్రమము గలిగింపఁబడిన, వర్గైః = వర్గములచేత, సమ్పూర్ణమ్ = కొఱఁత లేకుండునట్లు, నామలిఙ్గానుశాసనమ్ = నామలింగానుశాసన మను నిఘంటువు (నామములను, లింగములను విశదీకరించి చెప్పునది), మయా = నాచేత, ఉచ్యతే= చెప్పఁబడుచున్నది.

తా. వ్యాడివరరుచి మొదలగువారిచే రచియింపఁబడిన నిఘంటువులు మిగుల పెద్దవై కొన్ని నామములను మాత్రము బోధించునవియుఁ గొన్ని లింగములను మాత్రము బోధించునవియునుగా నున్నవి. ఆ నిఘంటువుల నెల్ల సంగ్రహించి నామలింగానుశాసన మనుపేర నొక నిఘంటువును వ్యర్థపదములు లేక చిన్నచిన్న

పదములచే విశదమగు నర్థము సూచితమగునట్లు సంపూర్ణముగాఁ జెప్పుచున్నాను.

అవ. లింగజ్ఞానోపాయ మే విధముగా ననఁగా :—

శ్లో. ప్రాయశో రూపభేదేన సాహచర్యా చ్చ కుత్రచిత్,
స్త్రీ పు న్నపుంసకం జ్ఞేయం తద్విశేషవిధేః క్వచిత్. 3

టీ. ప్రాయశః = తఱుచుగా, రూపభేదేన = రూపముయొక్క భేదముచేతను, కుత్రచిత్ = కొన్నితావులందు, సాహచర్యాత్ = ముందు వెనుకటి పదముల నుంచుటవలనను, స్త్రీ పుం నపుంసకం = స్త్రీలింగ పుంలింగ నపుంసక లింగములు, జ్ఞేయమ్ = తెలియఁదగినవి. క్వచిత్ = కొన్నిచోట్ల, విశేషవిధేః = ప్రత్యేకముగా ఈ పద మీ లింగ మని చెప్పుటచేతను, తత్ = ఆ స్త్రీలింగ పుల్లింగ నపుంసక లింగములు, జ్ఞేయమ్ = తెలిసికొనఁదగినవి.

తా. కొన్నిచోట్ల రూపభేదముచేతను, (విసర్గ మున్నయెడల పుల్లింగమనియు, దీర్ఘాంతముగ నున్నయెడల స్త్రీలింగమనియు, బిందువుతో నున్నయెడల నపుంసకలింగమనియు) కొన్ని చోట్ల ముందు వెనుకటి పదముల సంబంధమువలనను, కొన్ని చోట్ల ప్రత్యేకించి ఈ పద మీ లింగమని చెప్పుటచేతను లింగమును దెలిసికొనవలెను.

ఉదా :—1. రూపభేదము : పద్మాలయా పద్మా, పినాకో ఽజగవం ధనుః—ఇచ్చట 'పద్మా' అని ఆకారాంతమగుటచే స్త్రీ లింగమనియు, 'పినాకః' అని విసర్గముతో నుండుటచే పుంలింగ మనియు, 'అజగవం' అని బిందువుతోఁ గూడియుండుటచే నపుంసక లింగ మనియును దెలియవలయు.

2. విశేషణపదము :—"తత్పరో హనుః" అనుచోటఁ బుంలింగ మయిన తత్పరశబ్దముచేత హనుశబ్దము పుంలింగ మని తెలియవలయు.

3. సాహచర్యమున ననుటకు "భానుః కరః" "వియ ద్విష్ణు పదం" "అశ్వాయు గశ్వినీ" ఈ యుదాహరణములందు కరశబ్ద

సాహచర్యముచే భానుశబ్దము పుంలింగమనియు, విష్ణుశబ్ద సాహచర్యముచే వియత్పదము నపుంసక లింగమనియు, అశ్వినీపదసాహచర్యముచే అశ్వయుక్పదము స్త్రీలింగమనియుఁ దెలియవలయు. సాహచర్య మనఁగా స్పష్టమైన లింగము గల పదము ననుసరించుట.

4. విశేషవిధిచేఁ దెలియవలయు ననుటకు ఉదా:—"భేరీ స్త్రీ దున్దుభిః పుమాన్" ఇచ్చట భేరీదుందుభిశబ్దములు వేఱులింగములు గలవగుటచే "భేరీ స్త్రీ" యనియు, "దుందుభిః పుమాన్" అనియుఁ జెప్పఁబడినవి. "రోచిః శోచి రుభే క్లీబే" అనుచో "రోచిః" "శోచిః" అను పదములు రెండును నపుంసకము లని తెల్పుటకై "క్లీబే" = నపుంసకమునందు అని చెప్పఁబడినది.

అవ. పూర్వోక్తవిధులచేత ద్వంద్వసమాసాదులయందు లింగము నెఱుంగరా దనుశంక తొలఁగుటకై:—

శ్లో. భేదాఖ్యానాయ న ద్వన్ద్వో నైకశేషో న సఙ్కరః,
కృతోఽత్ర భిన్నలిఙ్గానా మనుక్తానాం క్రమాదృతే. ౪

టీ. అత్ర = ఈ గ్రంథమునందు, అనుక్తానామ్ = వానివాని పర్యాయములందుఁ జెప్పఁబడని, భిన్నలిఙ్గానామ్ = వేర్వేఱు లింగములు గలపదములయొక్క, భేదాఖ్యానాయ = లింగభేదమును దెలుపుటకు, ద్వన్ద్వః = ద్వంద్వసమాసము, న కృతః = చేయఁబడలేదు ఏకశేషః = ఏకశేషవృత్తియు, న కృతః = చేయఁబడలేదు. క్రమాదృతే = వరుసను దప్పించి, సఙ్కరః = వేఱువేఱు లింగములు గల పదములను గలుపుట, న కృతః = చేయఁబడలేదు.

ఈ నిఘంటువునందు నొక్కచోట లింగనిర్ణయము చేయబడనిపదములు వేఱువేఱులింగములు గలవిగా నుండునేని వాని ద్వంద్వసమాసము ఏకశేషవృత్తియుఁ జెప్పఁబడలేదు.

ఉదా:—'దేవతాదైవతామరాః' అని చెప్పఁబడలేదు ఏలయనిన, దేవతాశబ్దము స్త్రీలింగము. దైవతశబ్దము నపుంసక లింగము. అమరశబ్దము పుంలింగము. 'దేవతాదైవతామరాః' అ

చెప్పియున్నచో ద్వంద్వమునఁ గడపటిపదముయొక్క లింగమే యన్నిటికివచ్చును. కావున నట్లు ద్వంద్వము చెప్పలేదు. నభః ఖం శ్రావణో నభాః = నభశ్శబ్దమునకు ఆకాశమనియును శ్రావణమాసమనియును నర్థము గలదు. ఈ యర్థములలో మొదటి యర్థమున నపుంసకము. రెండవ యర్థమునందుఁ బుల్లింగము. ఏకశేషము చెప్పిన నేలింగమునఁ బదమున్నదో ఆ లింగమే వచ్చును. కాఁబట్టి యీ దోషము రాకుండుటకై 'ఖశ్రావణౌ తు నభసీ' యని చెప్పఁబడలేదు. సమానలింగములకును ఒక్కచోట లింగనిర్ణయము చేయఁబడినవానికిని ద్వంద్వైకశేషములు చెప్పఁబడినవి. 'స్వర్గనాకత్రిదివత్రిదశాలయాః' మఱియొకచోటఁ జెప్పఁబడనివైనను అన్నియు పుల్లింగములు కావున ద్వంద్వము చెప్పఁబడినది. 'అప్సరోయక్షరక్షోగంధర్వకిన్నరాః' ఇందు అప్సరస్-స్త్రీలింగము. యక్ష-పుల్లింగము. రక్షస్-నపుంసకలింగము. గంధర్వకిన్నరపదములు పుల్లింగములు. ఇవి యిట్లు వేర్వేఱు లింగములుగలవైనను, ఇతరస్థలములందు వీనికి లింగములు నిర్ణయింపఁబడియుండుటంజేసి ద్వంద్వము చెప్పఁబడినది. క్రమము విడిచి సంకరమును జెప్పఁబడలేదు. అనఁగా బర్యాయములు చెప్పునపు డొక్క పుల్లింగము, ఒక నపుంసకము, ఒక స్త్రీలింగము, ఒక పుల్లింగము - ఇట్లన్నియును గలిపి చెప్పక యే లింగము పదము లారంభింపఁబడునో, వానిని ముగించి పిమ్మట మఱియొక లింగము పదము లారంభింపఁబడును "స్తవః స్తోత్రం స్తుతిర్నుతిః" అనుచోట, స్తవః అను పుల్లింగము, స్తోత్రం అను నపుంసకము, స్తుతిః, నుతిః, అను రెండు స్త్రీలింగములు నొక్కటిగాఁ జెప్పఁబడినవి గాని "స్తుతిః స్తోత్రం స్తవో నుతిః" అని చెప్పఁబడలేదు.

౫వ. లింగములను విధించునపుడు లాఘవముకొఱకు కొన్ని సంకేతములు:—

శ్లో. త్రిలిఙ్గ్యాం త్రిష్వితి పదం మిథునేతు ద్వయో రితి,
నిషిద్ధలిఙ్గం శేషార్థం త్వన్తాథాది న పూర్వభాక్. ౫

టీ. త్రిలిఙ్గ్యాం = మూఁడులింగములందు, త్రిషు ఇతి పదం = త్రిషు అనుపదము, మిథునేతు = స్త్రీ పుల్లింగములందు, ద్వయోః ఇతి = ద్వయోః అనుపదము, ఉక్తమ్ = చెప్పఁబడినది, నిషిద్ధ లిఙ్గమ్ = నిషేధింపఁబడిన లింగము గలపదము, శేషార్థమ్ = తక్కిన లింగములుగలది, త్వన్తాథాది = "తు" అనుపదము కడపటఁగలది, "అథ" అనుపదము మొదటఁ గలది, పూర్వభాక్ = ముందు పదము లతో నన్వయించునది, న = కాదు.

తా. "త్రిషు" అనుటచే మూఁడు లింగములు గల పదమును, "ద్వయోః" అనుటచే స్త్రీలింగపుల్లింగములు గల పదమును దెలుపును. "త్రిషు స్ఫులిఙ్గోఽగ్నికణః" – ఇచట స్ఫులింగపదము మూఁడులింగములు గలదని తెలుపుటకు "త్రిషు" అని చెప్పఁబడినది. "ద్వయోః జ్వాలకీలౌ" – ఇచ్చట జ్వాలకీలశబ్దములు పుల్లింగ స్త్రీలింగములలో రెండింటియందువచ్చునని తెలుపుటకై "ద్వయోః" అని చేర్పఁబడినది. పెద్దభార్య పతివ్రతయనిన రెండవది చెడ్డది యని యర్థమగునట్లు ఏ పదము ఏ లింగమున రాదనఁబడునో, తక్కిన లింగములలో నది వచ్చునని యర్థము. "వ్రజమస్త్రీ" అనుచోట స్త్రీలింగమును నిషేధించుటచే వ్రజశబ్దము పుల్లింగ నపుంసకలింగ ములలో వచ్చును. 'తు' అను పద ము కడపట నున్నపదము ముందు పదముతో నన్వయింపదు. ఉదా:—"పులోమజా శచీంద్రాణీ నగరీ త్వమరావతీ" ఇట నగరీపదము ఇంద్రాణీపదముతో నన్వయింపక, ముందటి యమరావతీపదముతో నన్వయించును. అట్లే 'అథ' పదము మొదట గలది. ముందటిపదముతోఁ జేరదు. ఉదా:—జవో ఽథ శీఘ్రం త్వరితమ్–ఇట శీఘ్రపదము జవపదముతో నన్వయింపక త్వరితపదముతోఁ జేరును.

# అ మ ర కో శ ము



## ప్రథమకాండము - స్వర్గవర్గము.

స్వ(రవ్యయం) స్వర్గనా
కత్రిదివత్రిదశాలయాః।
సురలోకో ద్యో దివౌ
(ద్వే స్త్రియాం క్లీబే)
త్రివిష్టపమ్॥ ౬

స్వః॥ అవ్య॥ - స్వర్గః - నాకః-త్రిదివః-త్రిదశాలయః-సురలోకః॥పు॥-ద్యౌః॥ఓ,సీ॥ (ద్యౌః, ద్యావౌ, ద్యావః)-ద్యౌః॥వ్,సీ॥(ద్యౌః,దివౌ, దివః త్రివిష్టపమ్॥న॥౯-స్వర్గముపేళ్లు, Heaven, Paradise स्वर्ग.

అమరా నిర్జరా దేవా
స్త్రిదశా విబుధా స్సు
రాః। సుపర్వాణస్సుమ
నస స్త్రిదివేశా దివౌక
సః।ఆదితేయాదివిషదో
లేఖాఅదితినన్దనాః।ఆది
త్యా ఋభవోఽ స్వ
ప్నా అమర్త్యా అమృ
తాన్ధసః॥ బర్హిర్ముఖాః
క్రతుభుజో గీర్వాణా
దానవారయః। బృన్దా
రకా దైవతాని (పుంసి
వా) దేవతా స్త్రియాం॥

అమరాః - నిర్జరాః - దేవాః-త్రిదశాః-విబుధాః-సురాః - సుపర్వాణః॥న్॥ - సుమనసః॥స్॥ త్రిదివేశాః - దివౌకసః॥స్॥ - ఆదితేయాః-దివిషదః॥ద్॥-లేఖాః - అదితినన్దనాః - ఆదిత్యాః-ఋభవః॥ ఉ॥ - అస్వప్నాః - అమర్త్యాః-అమృతాన్ధసః॥స్॥ - బర్హిర్ముఖాః - క్రతుభుజః జ్॥ -గీర్వాణాః - దానవారయః॥ఇ॥-బృన్దారకాః॥పు॥ దైవతాని॥న్న॥ - దేవతాః॥సీ॥ ౨౬-దేవతలపేళ్లు-ఈదేవతావాచకశబ్దములు తఱచుగా బహువచనమునందే ప్రయోగింపఁబడుటవలన వానిని గ్రంథకర్త ప్రథమా బహువచనాంతములుగా నిర్దేశించెను గాని యివి నిత్యబహువచనాంతములు గావు. Deities, Heavenly Beings **देवता.**

ఆదిత్య విశ్వవసవ స్తు
షితాఽఽభాస్వరాఽ
నిలాః।మహారాజిక సా
ధ్యాశ్చ రుద్రాశ్చ (గణ
దేవతాః) ౧౦

ఆదిత్యాద్వాదశ ప్రోక్తావిశ్వేదేవాదశస్మృతాః। వసవశ్చాష్టసంఖ్యాతా షట్త్రింశత్తుషితా మతాః॥ ఆభాస్వరాశ్చతుష్షష్టిర్వాతాః పఞ్చాశదూనకాః। మహారాజికనామానోద్వేశతేవింశతిస్తథా। సాధ్యాద్వాదశవిఖ్యాతారుద్రా ఏకాదశ

స్మృతాః) ఆదిత్యాః-౧౨, విశ్వేః॥అ॥౧౦, వసవః॥ఉ॥౮, తుషితాః-౩౬, ఆభాస్వరాః॥-౬౪, అనిలాః-౪౯, మహారాజికాః-౨౨౦, సాధ్యాః-౧౨, రుద్రాః, ॥పు,బ॥-౧౧, ఈ నాగణదేవతా జాతులపేళ్లు Sets of Divinities देवता गण.

విద్యాధరోఽప్సరో యక్షరక్షోగన్ధర్వకిన్నరాః పిశాచో గుహ్యకస్సిద్ధోభూతో (ఽమీ దేవయోనయః)॥౧౧॥

విద్యాధరః॥పు॥ (మాలిక, అంజనము మొదలగు విద్యలధరించు జీమూతవాహనుఁడు మొదలగువారు)-అప్సరాః స్, స్త్రీ॥ (ఊర్వశి మొదలగు దేవాంగనలు)-యక్షః॥పు॥ (కుబేరాదులు)రక్షః ॥స్,న॥(లంకావాసులగుమాయావులు)-గన్ధర్వః (తుంబురు ప్రభృతులు)-కిన్నరః (అశ్వముఖులు) పిశాచః (కుబేరానుచరులగు మాంసాశనులు)-గుహ్యకః॥ (నిధిరక్షకులగు మాణిభద్రాదులు)-సిద్ధః॥ (విశ్వావసుప్రభృతులు) - భూతః॥ పు॥ (రుద్రానుచరులగుబాలగ్రహాదులు) ౧౦-అమీ =వీరు, దేవయోనయః= దేవతలకుజనించినవారు Demi - Gods and nymphs देवताओंकी संतति.

అసురా దైత్య దైతేయ దనుజేన్ద్రారి దానవాః। శుక్రశిష్యా దితిసుతాః పూర్వదేవా స్సురద్విషః॥ ౧౨॥

అసురాః - దైత్యాః-దైతేయాః-దనుజాః-ఇన్ద్రారయః॥ ఇ॥-దానవాః-శుక్రశిష్యాః - దితిసుతాః పూర్వదేవాః-సురద్విషః॥ ష్, పు, బ॥ ౧౦ - అసురులపేళ్లు, Giants or Titans Demons, राक्षस.

సర్వజ్ఞ స్సుగతో బుద్ధో ధర్మరాజ స్తథాగతః। సమన్తభద్రో భగవా న్మారజిల్లోకజిజ్జినః॥ షడభిజ్ఞో దశబలో ఽ

సర్వజ్ఞః-సుగతః-బుద్ధః-ధర్మరాజః - తథాగతః - సమన్తభద్రః - భగవాన్॥ త్॥ - మారజిత్ -లోకజిత్ -జినః-షడభిజ్ఞః-దశబలః - అద్వయవాదీ॥ న్॥-వినాయకః-మునీన్ద్రః-శ్రీఘనః-శాస్తా॥ ఋ॥ - మునిః॥ పు॥ ౧౮ - బుద్ధదేవుని

ద్వయవాదీ వినాయకః మునీన్ద్రః శ్రీఘనశ్శాస్తామునిః (శ్శాక్యముని స్తుయః)॥౧౪॥ సశాక్యసింహస్సర్వార్థసిద్ధశ్శౌద్ధోదనిశ్చ(సః)। గౌతమశ్చార్కబన్ధుశ్చ మాయాదేవీసుతశ్చ(సః)॥

పేళ్లు Buddha or a Jina, बुद्ध देव.

శాక్యసింహః - సర్వార్థసిద్ధః-శౌద్ధోదనిః - గౌతమః - అర్కబన్ధుః - మాయాదేవీసుతః॥ పు॥ ౬ యః = ఎవఁడు, శాక్యమునిః = "శాకవృక్ష ప్రతిచ్ఛన్నం వాసం యస్మాచ్చ చక్రిరే। తస్మా దిక్ష్వాకువంశాస్తే శాక్యా ఇతిభువిస్మృతాః" అని చెప్పఁబడిన శాక్యవంశమునఁ బుట్టిన బుద్ధావాంతర భేదముగల శాక్యముని కలఁడో; సః=ఆ బుద్ధదేవుని పేళ్లు, (Buddha the founder of the religion named from him.

బ్రహ్మాఽఽత్మభూస్సురజ్యేష్ఠః పరమేష్ఠీపితామహః। హిరణ్యగర్భో లోకేశ స్స్వయమ్భూశ్చతురాననః॥౧౬॥ ధాతాఽబ్జయోని ర్ద్రుహిణో విరిఞ్చిః కమలాసనః। స్రష్టా ప్రజాపతి ర్వేధా విధాతా విశ్వసృ డ్విధిః॥ [శతానన్దశ్శతధృతి ర్విరిఞ్చోఽజోవిరిఞ్చనః॥] ౧౭॥

బ్రహ్మా॥న్॥-ఆత్మభూః - సురజ్యేష్ఠః - పరమేష్ఠీ॥ న్॥ - పితామహః - హిరణ్యగర్భః - లోకేశః - స్వయంభూః-చతురాననః-ధాతా॥ ఋ॥ -అబ్జయోనిః - ద్రుహిణః-విరిఞ్చిః-కమలాసనః - స్రష్టా॥ ఋ॥ ప్రజాపతిః - వేధాః॥స్॥- విధాతా॥ ఋ॥ - విశ్వసృట్॥ జ్॥ - విధిః॥ పు॥ ౨౦॥ - బ్రహ్మదేవుని పేళ్లు [శతానన్దః - శతధృతిః - విరిఞ్చః - అజః - విరిఞ్చనః॥] అధిక పాఠము.

బొంబాయి ప్రతియం దుండు అధికపాఠము.

[నాభిజన్మాఽణ్డజః పూర్వోఽనిధనః కమలోద్భవః। సదానన్దో రజోమూర్తి స్సత్యకో హంసవాహనః] Brahma or the Creator, ब्रह्मा.

విష్ణు ర్నారాయణః కృష్ణో వైకుణ్ఠో విష్టరశ్రవాః। దామోదరో హృషీకేశః కేశవో

విష్ణుః-నారాయణః-కృష్ణః-వైకుణ్ఠః-విష్టరశ్రవాః॥ స్॥ - దామోదరః - హృషీకేశః - కేశవః - మాధవః- స్వభూః - దైత్యారిః-పుణ్డరీకాక్షః - గోవిన్దః - గరుడధ్వజః-పీతామ్బరః-

మాధవస్స్వభూః ౧౮॥ దైత్యారిః పుణ్డరీకాక్షో గోవిన్దో గరుడధ్వజః। పీతామ్బరోఽచ్యుత శ్శార్ఙ్గీ విష్వక్సేనో జనార్దనః॥ ఉపేన్ద్ర ఇన్ద్రావరజశ్చక్రపాణిశ్చతుర్భుజః। పద్మనాభో మధురిపు ర్వాసుదేవ స్త్రివిక్రమః॥ ౨౦॥ దేవకీనన్దన శ్శౌరి శ్శ్రీపతిః పురుషోత్తమః। వనమాలీ బలిధ్వంసీ కంసారాతి రధోక్షజః। విశ్వమ్భరః కైటభజి ద్విధుశ్శ్రీవత్సలాఞ్ఛనః। [గదాగ్రజో ముఞ్జకేశో దాశార్హోదశరూపభృత్]

అచ్యుతః - శార్ఙ్గీ ॥న్॥-విష్వక్సేనః-జనార్దనః-ఉపేన్ద్రః - ఇన్ద్రావరజః-చక్రపాణిః-చతుర్భుజః-పద్మనాభః-మధురిపుః-వాసుదేవః-త్రివిక్రమః-దేవకీనన్దనః-శౌరిః-(సా) సౌరిః-శ్రీపతిః-పురుషోత్తమః -వనమాలీ॥న్॥-బలిధ్వంసీ॥న్॥-కంసారాతిః - అధోక్షజః-విశ్వమ్భరః-కైటభజిత్ - విధుః-శ్రీవత్సలాఞ్ఛనః॥పు॥ ౩౯-విష్ణుదేవుని పేళ్లు. [గదాగ్రజః -ముఞ్జకేశః-దాశార్హః-దశరూపభృత్ ॥] అధికపాఠము.

బొంబాయి ప్రతియందుండు అధికపాఠము.

[పురాణపురుషో యజ్ఞపురుషో నరకాన్తకః। జలశాయీ విశ్వరూపో ముకున్దో మురమర్దనః॥]

టీ॥ పురాణపురుషః -యజ్ఞపురుషః-నరకాన్తకః-జలశాయీ విశ్వరూపః -ముకున్దః-మురమర్దనః] Sri Vishnu, the pervader and preserver, श्रीविष्णु.

వసుదేవో (ఽస్యజనక స్సఏవా)ఽనకదున్దుభిః

వసుదేవః - ఆనకదున్దుభిః ॥పు॥ ౨ -అస్యజనకః=శ్రీకృష్ణునితండ్రియగు వసుదేవుని పేళ్లు Vasudeva, father of Sri Krishna. वसुदेव.

బలభద్రః ప్రలమ్బఘ్నో బలదేవోఽచ్యుతాగ్రజః। రేవతీరమణో రామః కామపాలో హలాయుధః॥ ౨౩॥ నీలామ్బరో రౌహిణే

బలభద్రః - ప్రలమ్బఘ్నః-బలదేవః-అచ్యుతాగ్రజః - రేవతీరమణః-రామః-కామపాలః-హలాయుధః - నీలామ్బరః - రౌహిణేయః-తాలాఙ్కః- ముసలీ (సా) ముషలీ-హాలీ॥న్॥-సంకర్షణః - సీరపాణిః - కాలిన్దీభేదనః-బలః॥పు॥ ౧౭- బలరాముని పేళ్లు, Balarama, brother of Sri Krishna,

హలీ। సంకర్షణ స్సీర
పాణిః కాలిన్దీ భేదనో
బలః॥

మదనో మన్మథో
మారః ప్రద్యుమ్నో
మీనకేతనః। కన్దర్పో
దర్పకోఽనఙ్గః కామః
పఞ్చశరస్స్మరః॥ ౨౫॥
శమ్బరారి ర్మనసిజః కు
సుమేషు రనన్యజః॥ పు
ష్పధన్వా రతిపతి ర్మక
రధ్వజ ఆత్మభూః॥ ౨౬॥

మదనః - మన్మథః -మారః-ప్రద్యుమ్నః-మీనకేతనః -కన్దర్పః-దర్పకః-అనఙ్గః-కామః పఞ్చశరః-స్మరః-శమ్బరారిః-(పా)సమ్బరారిః-మనసిజః - కుసుమేషుః-అనన్యజః-పుష్పధన్వా ॥న్॥ రతిపతిః -మకరధ్వజః-ఆత్మభూః॥పు॥౧౯-మన్మథుని పేళ్లు. శృఙ్గారయోనిః శ్రీపుత్త్రోరుద్రారి, కన్తుకాయజౌ।ఇక్షుచాపోమధుసఖశ్శూర్పకారాతిహృచ్ఛయా టీ। శృఙ్గారయోనిః-శ్రీపుత్త్రః-రుద్రారిః-కన్తుః-కాయజః-ఇక్షుచాపః-మధుసఖః -శూర్పకారాతిః-హృచ్ఛయః] అ.పా॥ Cupid, the god of love. मन्मथ.

బ్రహ్మసూ ర్విశ్వకేతు
(స్సా) దనిరుద్ధ ఉషా
పతిః [అరవిన్దమశోకం
చ చూతంచ నవమల్లి
కా। నీలోత్పలంచ ప
ఞ్చైతే పఞ్చబాణస్య
సాయకాః]

బ్రహ్మసూః - విశ్వకేతుః - (పా) ఋశ్యకేతుః-అనిరుద్ధః - ఉషాపతిః ॥పు॥ ౪ -అనిరుద్ధుని పేళ్లు. Aniruddha, son of Pradyumna. अनिरुद्ध.

అరవిన్దమ్, అశోకమ్, చూతమ్॥న॥, నవమల్లికా॥సీ॥, నీలోత్పలం॥న॥ ౫ - మన్మథుని బాణములు. [ఉన్మాదన స్తాపనశ్చ శోషణ స్తమ్భన స్తథా। సమ్మోహనశ్చ కామస్య పఞ్చబాణాః ప్రకీర్తితాః॥]

లక్ష్మీః పద్మాలయా
పద్మా కమలా శ్రీ ర్హరి
ప్రియా। [ఇన్దిరా లో
కమాతా మా రమా

లక్ష్మీః - పద్మాలయా - పద్మా-కమలా-శ్రీః-హరిప్రియా॥సీ॥౯-లక్ష్మీదేవి పేళ్లు.

(ఇన్దిరా-లోకమాతా-మా-రమా-మఙ్గళ
దేవతా-భార్గవీ లోకజననీ - క్షీర[illegible]

మఙ్గళదేవతా। భార్గవీ లోకజననీ క్షీరసాగర కన్యకా]

(శఙ్ఖో లక్ష్మీపతేః) పాఞ్చజన్య (శ్చక్రం) సుదర్శనం। కౌమోదకీ (గదా) (ఖడ్గో) నన్దకః కౌస్తుభో(మణిః)॥ ౨౮॥ [(చాప) శ్శార్ఙ్గంమురా రేస్తు శ్రీవత్సో(లాఞ్ఛనం మతమ్)। (అశ్వాశ్చ) శైబ్యసుగ్రీవ మేఘపుష్ప వలాహకాః। (సారథి) ర్దారుకో (మన్త్రీ) హ్యుద్ధవ (శ్చానుజో) గదః॥]

కా ॥సీ॥ అధికపాఠము.] Lakshmi, Goddess of Prosperity, लक्ष्मी.

పాఞ్చజన్యః ॥పు॥ విష్ణుదేవునిశఙ్ఖము, his conch, సుదర్శనమ్ ॥న॥ (ప) సుదర్శనః ॥పు॥ విష్ణుదేవునిచక్రము his discus, सुदर्शन चक्र, కౌమోదకీ ॥సీ॥ విష్ణుదేవుని గద, his mace, गदा, నన్దకః ॥పు॥ విష్ణుదేవుని ఖడ్గము, his sword, तलवार, కౌస్తుభః॥పు॥విష్ణువుధరించుమణి, his jewel, विष्णुकी मणि.

[శార్ఙ్గమ్ ॥న॥ విష్ణుదేవుని ధనుస్సు, his bow, उनका धनुष. శ్రీవత్సః॥పు॥విష్ణుదేవుని యురస్థ్సలమునందలి మచ్చ, Mark on his breast, उनकीछाती पर चिह्न శైబ్యః-సుగ్రీవః-మేఘపుష్పః-వలాహకః॥పు॥౪-శ్రీకృష్ణుని తేరిగుఱ్ఱముల పేళ్లు - దారుకః ॥పు॥ ౧-సారథి పేరు. ఉద్ధవః ॥పు॥ ౧-మంత్రి పేరు గదః ॥పు॥ ౧-తోఁబుట్టువు పేరు॥ అ. పా॥]

గరుత్మాన్గరుడ స్తార్క్ష్యో వైనతేయః ఖగేశ్వరః। నాగాన్తకో విష్ణురథ స్సుపర్ణః పన్నగాశనః॥

గరుత్మాన్ ॥త్॥-గరుడః-తార్క్ష్యః-వైనతేయః - ఖగేశ్వరః॥-నాగాన్తకః-విష్ణురథః-సుపర్ణః-పన్నగాశనః ॥పు॥ ౯-విష్ణుదేవుని వాహనమగు గరుత్మంతుని పేళ్లు. Vehicle of Vishnu, विष्णु का वाहन, गरुड़.

శమ్భు రీశః పశుపతి శ్శివ శ్శూలీ మహేశ్వరః ఈశ్వరశ్శర్వ ఈశాన శ్శఙ్కర శ్చన్ద్రశేఖరః॥ ౩౦॥ భూతేశః

శమ్భుః-ఈశః-పశుపతిః-శివః-శూలీ॥న్॥-మహేశ్వరః-ఈశ్వరః-శర్వః - [పా] సర్వః-ఈశానః-శఙ్కరః-చన్ద్రశేఖరః - భూతేశః - ఖణ్డపరశుః-గిరీశః-గిరిశః - మృడః - మృత్యుఞ్జయః-కృత్తివాసాః ॥స్॥ పినాకీ॥న్॥-ప్రమథా

ఖణ్డపరశు ర్గిరిశో గిరిశో మృడః। మృత్యుంజయః కృత్తివాసాః పినాకీ ప్రమథాధిపః ॥ ౩౧॥ ఉగ్రః కపర్దీ శ్రీకణ్ఠ శ్శితికణ్ఠః కపాలభృత్। వామదేవో మహాదేవో విరూపాక్ష స్త్రిలోచనః ॥౩౨॥ కృశానురేతా స్సర్వజ్ఞో ధూర్జటిర్నీలలోహితః। హరస్స్మరహరో భర్గ స్త్ర్యమ్బక స్త్రిపురాన్తకః॥౩౩॥ గఙ్గాధరో ఽన్ధకరిపుః క్రతుధ్వంసీ వృషధ్వజః। వ్యోమకేశో భవో భీమః స్థాణూ రుద్ర ఉమాపతిః॥

ధిపః – ఉగ్రః – కపర్దీ ॥న్॥–శ్రీకణ్ఠః–శితికణ్ఠః–కపాలభృత్–వామదేవః–మహాదేవః – విరూపాక్షః–త్రిలోచనః–కృశానురేతాః ॥స్॥–సర్వజ్ఞః–ధూర్జటిః – నీలలోహితః – హరః – స్మరహరః–భర్గః–త్ర్యమ్బకః–త్రిపురాన్తకః – గఙ్గాధరః – అన్ధకరిపుః–క్రతుధ్వంసీ॥ న్॥–వృషధ్వజః –వ్యోమకేశః–భవః–భీమః–స్థాణుః–రుద్రః–ఉమాపతిః పు॥ ౪౮ – శివునిపేళ్లు. Siva, the destroyer, शिवजी.

[శ్లో॥ అష్టమూర్తి రహిర్బుధ్న్యో మహాకాలో మహానటః। భస్మాఙ్గరాగో ఽస్థిహారశ్చ గ్రాక్షో నాగకఙ్కణః। కణ్ఠే కాలో ఽర్ధనారీశః కాలకూటాశనో ఽనఘః। కురఙ్గపాణి ర్దిగ్వాసాః కాలకాలో ఽమ్బరామ్బరః। పశ్యల్లలాటః ఖట్వాఙ్గధరః పితృవనేచరః। గజాసురారిః కుహనావటుకో వట మూలగః॥ ఆదిభిక్షు ర్మహామృత్యు ర్భవన్యుర్వృషవాహనః। ఖణ్డేన్దుశిఖికో ఽనాది ర్జటిలో బ్రహ్మమూర్ధభృత్॥ నారాయణప్రియః పఞ్చవక్త్రో ద్రుహిణసారథిః। నిగమాశ్వో నదీజారో వేదకాలేయకో ఽగ్నిదృక్। క్రీడాకిరాతః కైలాస మన్దిరో క్షోబసంహరః। క్షోణీరథో హరిశరో మేరుధన్వామ్బుధీషుధిః]

కపర్దో(ఽస్యజటాజూటః) పినాకో ఽజగవం (ధనుః)। ప్రమథాః (స్స్యుః)పారిషదా బ్రాహ్మ్యాద్యాస్తు మాతరః॥

కపర్దః॥పు॥౧–అస్యజటాజూటః=శివునిజటాజూటము, Braided hair, शिव का जट. పినాకః ॥పు॥–అజగవమ్ ॥న॥ ౨–ఇతనిధనుస్సు Bow. ప్రమథాః॥ పారిషదాః ॥పు॥ బ॥ ౨–నంది మొదలైన ప్రమథగణముల పేళ్లు, Attendants, शिवके सेवक. మాతరః ॥బ్రు,

విభూతి ర్భూతి రైశ్వర్య (మణిమాదిక మష్టధా)

సీ, బ॥ ౧-బ్రాహ్మి మొదలయిన సప్తమాతృకల పేళ్లు [బ్రాహ్మీ మాహేశ్వరీ చైవ కౌమారీ వైష్ణవీ తథా। వారాహీ చైవ చేన్ద్రాణీ చాముణ్డా సప్తమాతరః॥] The divine mothers or Energies of the gods.

విభూతిః - భూతిః॥సీ॥ఐశ్వర్యమ్॥న॥ 3-అష్టధా(వర్తమానం) అణిమాదికమ్ = అణిమాద్యష్టసిద్ధుల పేళ్లు. [అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా। ప్రాప్తిః ప్రాకామ్య మీశిత్వం వశిత్వం చాష్టసిద్ధయః॥] Superhuman power. अलौकिक सिद्धियाँ

ఉమా కాత్యాయనీ గౌరీ కాళీ హైమవతీ శ్వరీ॥ 3౬॥ శివా భవానీ రుద్రాణీ శర్వాణీ సర్వమఙ్గలా। అపర్ణా పార్వతీ దుర్గా మృడానీ చణ్డికాఽమ్బికా॥ 3౭॥

ఉమా - కాత్యాయనీ - గౌరీ - కాళీ - హైమవతీ - ఈశ్వరీ - శివా - భవానీ - రుద్రాణీ - శర్వాణీ - సర్వమఙ్గలా - అపర్ణా - పార్వతీ - దుర్గా - మృడానీ - చణ్డికా - అమ్బికా॥సీ॥౧౭. శివుని భార్యయగు పార్వతీదేవి పేళ్లు. The wife of Siva and goddess of destruction. शिव की पत्नी पार्वती.

(ఆర్యా దాక్షాయణీ చైవ గిరిజా మేనకాత్మజా)

[ఆర్యా - దాక్షాయణీ - గిరిజా - మేనకాత్మజా - ॥సీ॥ అధికపాఠము.]

వినాయకో విఘ్నరాజ ద్వైమాతుర గణాధిపాః। (అ)ప్యేకదన్త హేరమ్బ లమ్బోదర గజాననాః॥

వినాయకః - విఘ్నరాజః - ద్వైమాతురః - గణాధిపః - ఏకదన్తః - హేరమ్బః - లమ్బోదరః - గజాననః - ॥పు॥౮-శివునికుమారుడైన వినాయకుని పేళ్లు. Ganesa, the obviator of difficulties, गणेशजी.

కార్తికేయో మహాసేన శ్శరజన్మా షడాననః। పార్వతీనన్దనః

కార్తికేయః - మహాసేనః - శరజన్మా॥౯॥ - షడాననః - పార్వతీనన్దనః - స్కన్దః - సేనానీః - అగ్నిభూః - గుహః - బాహులేయః - తారకజిత్ -

స్కన్దస్సేనానీ రగ్నిభూ ర్గుహః॥ బాహులేయ స్తారకజి ద్విశాఖ శ్శిఖి వాహనః। షాణ్మాతుర శ్శక్తిధరః కుమారః క్రౌఞ్చదారణః॥

విశాఖః-శిఖివాహనః-షాణ్మాతురః-శక్తిధరః-కుమారః - క్రౌఞ్చదారణః ॥పు॥ ౧౭- శివుని కుమారుఁడగు కుమారస్వామిపేళ్లు. God of war. कुमार-युद्धका अधिपति षण्मुख.

[శృఙ్గీ భృఙ్గీ రిటి స్తుణ్డీ నన్దినో నన్దికేశ్వరః॥ నన్దికేశ్వరుని పేళ్లు. కర్మమోటీతు చాముణ్డా చర్మముణ్డాతు చర్చికా॥ శివపరిచారకుల పేళ్లు.]

•

ఇన్ద్రో మరుత్వాన్మఘవా బిడౌజాః పాకశాసనః। వృద్ధశ్రవా శ్శునాసీరః పురుహూతః పురన్దరః॥౪౧॥ జిష్ణు ర్లేఖర్షభ శ్శక్ర శ్శతమన్యు ర్దివస్పతిః। సుత్రామా గోత్రభి ద్వజ్రీ వాసవో వృత్రహా వృషా॥ వాస్తోష్పతి స్సురపతి ర్బలారాతి శ్శచీపతిః। జమ్భభేదీ హరిహయ స్స్వారా ణ్ణముచి సూదనః॥ సంక్రన్దనో దుశ్చ్యవన స్తురాషా ణ్మేఘవాహనః॥ ఆఖణ్డల స్సహస్రాక్షు ఋభుక్షా

ఇన్ద్రః - మరుత్వాన్ ॥త్॥ -మఘవా॥న్॥ బిడౌజాః ॥స్॥-పాకశాసనః-వృద్ధశ్రవాః॥స్॥-సునాసీరః - పురుహూతః - పురన్దరః-జిష్ణుః-లేఖర్షభః-శక్రః-శతమన్యుః-దివస్పతిః-సుత్రామా॥న్॥ - గోత్రభిత్ ॥ద్॥-వజ్రీ॥న్॥వాసవః-వృత్రహా॥న్॥-వృషా॥న్॥-వాస్తోష్పతిః - సురపతిః - బలారాతిః - శచీపతిః - జమ్భభేదీ॥న్॥ హరిహయః - స్వారాట్ ॥జ్॥-నముచిసూదనః సంక్రన్దనః-దుశ్చ్యవనః-తురాషాట్ ॥హ్॥ మేఘవాహనః - ఆఖణ్డలః-సహస్రాక్షః - ఋభుక్షాః ॥న్॥పు॥౩౫ - దేవేంద్రుని పేళ్లు. శ్లో॥ ప్రాచీనబర్హి రహిహా పృతనాషా ట్పులోమజిత్॥ టీక. ప్రాచీనబర్హిః అహిహాన్॥పృతనాషాట్ ॥హ్॥ పులోమజిత్॥ అధికపాఠము] Indra, Regent of the Sky. इन्द्र.

(స్తస్యతు ప్రియా॥౪౨॥ పులోమజా శచీన్ద్రాణీ (నగరీ) త్వమరావతీ। (హయ)ఉచ్చైఃశ్రవా

పులోమజా - శచీ(పా)సచీ-ఇన్ద్రాణీ॥స్త్రీ॥౩- ఇంద్రుని భార్య పేళ్లు. Wife of Indra. इन्द्रकी स्त्री, शची.

(స్యాతో) మాతలిర్న
న్దనం (వనమ్)॥ (స్యా
త్ప్రాసాదో వైజయ
న్తో జయన్తః పాకశా
సనిః।

అమరావతీ సీ॥ ౧-ఇంద్రుని పట్టణము పేరు.
ఉచ్చైఃశ్రవాః ॥స॥ పు॥ అతని గుఱ్ఱము.
మాతలిః ॥పు॥ ౧-అతనిసారథి, his charioteer. इन्द्रका सारथी. నన్దనమ్॥న॥ ౧-అతని యుపవనము, his garden. इन्द्र का बाग. వైజయన్తః పు॥ ౧-అతని మేడ his palace इन्द्रका महल. జయన్తః - పాకశాసనిః॥పు॥ ౨-అతని కుమారుడు.

ఐరావతోఽభ్రమా
తఙ్గైరావణాభ్రము
వల్లభాః॥ ౪౬॥

ఐరావతః-అభ్రమాతఙ్గః-ఐరావణః - అభ్రమువల్లభః ॥పు॥ ౪ - ఇంద్రుని యేనుఁగుపేళ్లు Indra's elephant. इन्द्रका हाथी

హ్రాదినీ వజ్ర (మ
స్త్రీ)స్యాత్కులిశం
భిదురంపవిః। శతకోటి
స్స్వరుశ్శమ్బో దమ్భో
లిరశని (ర్ద్వయోః)॥
౪౭॥

హ్రాదినీ॥సీ॥ - వజ్రమ్॥ పున్న॥-కులిశమ్-భిదురమ్ ॥న॥ - పవిః - శతకోటి - స్వరుః(ప)స్వరుః॥స॥ శమ్బః - దమ్భోలిః॥ పు॥-అశనిః॥పున్న౧౦-వజ్రాయుధముపేళ్ళు. Thunder bolt. वज्र.

వ్యోమయానం వి
మానో(ఽస్త్రీ) (నార
దాద్యాః) స్సురర్షయః।
(స్యా) త్సుధర్మా దేవస
భా పీయూష మమృ
తం సుధా। మన్దాకినీ వి
యద్గఙ్గా స్వర్ణదీ సురదీ
ర్ఘికా। మేరు స్సుమేరు
ర్హేమాద్రీ రత్నసాను
స్సురాలయః॥ పఞ్చై
తే దేవతరవో మన్దారః
పారిజాతకః। సన్తానః

వ్యోమయానమ్॥న॥విమానః-॥పున్న॥ ౨-దేవరథముపేళ్ళు. Air-chariot. हवाईजहाज विमान. సురర్షయః॥ఇ,పు,బ॥ ౧ -నారదుఁడు దేవలుఁడు మొదలుగాఁగల దేవర్షుల పేళ్ళు Divine sages. సుధర్మా (పా)సుశర్మా॥న॥-దేవసభా॥సీ॥౨-దేవసభ, The council of the Gods देव सभा. పీయూషమ్-అమృతమ్ ॥న॥ సుధా ॥సీ॥౩- అమృతముపేళ్ళు, Nectar of Ambrosia अमृत. మన్దాకినీ వియద్గఙ్గా-స్వర్ణదీ సురదీర్ఘికా ॥సీ॥౪- ఆకాశగంగపేళ్లు, The Ganges of the Sky आकाश गंगा. మేరుః-సుమేరుః-హేమాద్రిః-రత్నసానుః-సు

కల్పవృక్షశ్చ(పుంసివా హరిచన్దనమ్॥౫౦॥

రాలయః ॥పు॥ ౫– మేరుపర్వతము పేళ్లు. The extremity of the world's axis, मेरु पर्वत. మన్దారః – పారిజాతకః – సన్తానః – కల్పవృక్షః ॥పు॥–హరిచన్దనమ్॥ప్న॥౫– దేవతల వృక్షముల పేళ్లు, Celestial trees, स्वर्ग के पेड़.

సనత్కుమారో వైధాత్రః స్స్వర్వైద్యా వశ్వినీసుతౌ। నాసత్యా వశ్వినౌ దస్రా వాశ్వినేయౌ చ (తౌపుభౌ) ౫౧॥

సనత్కుమారః–వైధాత్రః॥పు॥ ౨–బ్రహ్మపుత్త్రుఁడైన సనత్కుమారుని పేళ్లు, స్వర్వైద్యౌ–అశ్వినీసుతౌ–నాసత్యౌ–అశ్వినౌ–దస్రౌ–అశ్వినేయౌ ॥పు, ద్వి॥ ౬–దేవవైద్యు లయిన యశ్వినీదేవతల పేళ్లు, Physicians of Heaven, स्वर्ग के वैद्य.

(స్త్రియాం బహు) ష్వప్సరసస్స్వర్వేశ్యా (ఊర్వశీముఖాః)। ఊర్వశీ మేనకా రమ్భా ఘృతాచీచ తిలోత్తమా। సుకేశీ మఞ్జుఘోషా చ చిత్రరేఖా సురాంగనాః (హాహా హూహూశ్చైవమాద్యా) గన్ధర్వా (స్త్రి దివౌకసామ్॥ ౫౨

అప్సరసః ॥స్త్రీ॥ – స్వర్వేశ్యాః ॥స్త్రీ, బ॥ ౨॥ [ఊర్వశి, మేనక, రంభ, ఘృతాచి, తిలోత్తమ, సుకేశి, మంజుఘోష మొదలుగాఁగల] దేవవేశ్యలపేళ్లు. Celestial courtesans स्वर्ग की नाचनेवाली. గన్ధర్వాః॥ (పా) గాన్ధర్వాః ॥పు, బ॥ ౧ – దేవతలలో హాహా హూహూవులు తుంబురు విశ్వావసు చిత్రరథులు మొదలయిన దేవగాయకుల పేళ్లు, Celestial musicians, Quiristers of Heaven, स्वर्ग के गायक.

అగ్ని ర్వైశ్వానరో వహ్ని ర్వీతిహోత్రో ధనఞ్జయః। కృపీటయోని ర్జ్వలనో జాతవేదా స్తనూనపాత్॥ ౫౩

అగ్నిః–వైశ్వానరః–వహ్నిః – వీతిహోత్రః–ధనఞ్జయః – కృపీటయోనిః – జ్వలనః – జాతవేదాః ॥న్॥ తనూనపాత్ ॥ద్, ప్న॥ బర్హిః ॥స్॥ శుష్మాన్॥ (ప) బర్హిశ్శుష్మా॥ కృష్ణవర్త్మా॥న్॥ శోచిష్కేశః–ఉషర్బుధః–ఆశ్రయా

బర్హిశ్శుష్మాకృష్ణవర్త్మా శోచిష్కేశ ఉషర్బుధః ఆశ్రయాశో బృహద్భానుః కృశానుః పావకోఽనలః। రోహితాశ్వో వాయుసఖ శ్శిఖావానా శుశుక్షణిః। హిరణ్యరేతా హుతభుగ్దహనో హవ్యవాహనః॥ ౫౫॥ సప్తార్చి ర్దమునా శ్శుక్ర శ్చిత్రభాను ర్విభావసుః। శుచి రప్పిత్త

శః (పా) ఆశయాశః - బృహద్భానుః - కృశానుః - పావకః - అనలః - రోహితాశ్వః (పా) లోహితాశ్వః - వాయుసఖః - శిఖావాన్ ॥త్॥ ఆశుశుక్షణిః-హిరణ్యరేతాః ॥స్॥ హుతభుక్ ॥జ్॥ దహనః - హవ్యవాహనః - సప్తార్చిః ॥స్॥ దమునాః ॥స్॥ శుక్రః-చిత్రభానుః-విభావసుః- శుచిః ॥పు॥ - అప్పిత్తమ్ ॥న॥ 3౪ - అగ్నిహోత్రుని పేళ్లు, Fire. अग्नि. [ కాలీ, కరాలీ, మనోజవా, సులోహితా, సుధూమ్రవర్ణా, స్ఫులింగినీ, విశ్వదాసా, అనునవి యేడు వరుసగా అగ్నిజ్వాలలు.]

ఔర్వస్తు బాడబో బడబానలః ॥౫౬॥ (వహ్నేర్ద్వయో) ర్జ్వాల కీలావర్చి ర్హేతి శ్శిఖా (స్త్రియామ్॥) (త్రిషు) స్ఫులిఙ్గోఽగ్నికణ స్సంతాప స్సంజ్వర (స్సమౌ) (ఉల్కా స్యాన్ని ర్గత జ్వాలా భూతిర్భసిత భస్మనీ। క్షారో రక్షాచ దావ స్తుదవో వన హుతాశనః॥]

ఔర్వః-బాడబః-బడబానలః ॥పు॥ 3 బడబాగ్ని పేళ్లు, Submarine fire, वडवानल. జ్వాలః - కీలః ॥పు॥ అర్చిః ॥స్, స్న॥ - హేతిః ॥సీ॥ శిఖా ॥సీ॥ ౫ - అగ్నిజ్వాల పేళ్లు, Flame, ज्वाला. స్ఫులిఙ్గః ॥త్రి॥ - అగ్నికణః ॥పు॥ ౨- మిణుఁగురు పేళ్లు, Spark, चिनगारी. సన్తాపః-సంజ్వరః ॥పు॥ ౨ - వేఁడిమి పేళ్లు, Heat, गर्मी.

[ఉల్కా॥ ౧ - కొఱవి పేరు, A Fire-brand, लूका. భూతిః ॥సీ॥ - భసితమ్ - భస్మ ॥న్, న॥ క్షారః ॥పు॥-రక్షా ॥సీ॥ ౫-బూది పేళ్లు, Ashes, राख. దావః - దవః॥ పు॥ ౨-కారుచిచ్చు పేళ్లు, A forest conflagration, दावानल. అధికపాఠము.]

ధర్మరాజః పితృపతి స్సమవర్తీ పరేతరాట్।

ధర్మరాజః-పితృపతిః-సమవర్తీ॥న॥ - పరేతరాట్॥జ్॥-కృతాన్తః-యమునాభ్రాతా॥ఋ॥-

కృతాన్తో యమునా భ్రాతా శమనో యమ రాడ్యమః॥౫౮॥ కాలో దణ్డధర శ్శ్రాద్ధదేవో వైవస్వతోఽన్తకః।

శమనః – యమరాట్ ॥జ్॥–యమః–కాలః–దణ్డధరః–శ్రాద్ధదేవః–వైవస్వతః–అన్తకః ॥పు॥ ౧౪ యముని పేళ్లు, Yama, the Judge of departed souls, **यम**.

రాక్షసః కోణపః క్రవ్యాత్క్రవ్యాదోఽస్రప ఆశరః ॥౫౯॥ రాత్రిఞ్చరో రాత్రిచరః కర్బురో నికషాత్మజః। యాతుధానః పుణ్యజనో నైరృతో యాతు రక్షసీ॥

రాక్షసః–కోణపః–(పా) కౌణపః–క్రవ్యాత్ ॥ద్॥ క్రవ్యాదః–అస్రపః (పా) అశ్రపః–ఆశరః (పా) అసురః–రాత్రిఞ్చరః–రాత్రిచరః–కర్బురః (పా) కర్వరః – నికషాత్మజః – యాతుధానః–పుణ్యజనః–నైరృతః ॥పు॥ యాతు ॥న॥ రక్షః ॥స్, న॥ ౧౫ – నిరృతిపేళ్లు, (రాక్షసవాచకములు) A Giant, **राक्षस**.

ప్రచేతా వరుణః పాశీ యాదసాం పతిరప్పతిః॥

ప్రచేతాః ॥స్॥ వరుణః – పాశీ॥న్॥–యాదసాంపతిః – అప్పతిః ॥పు॥ ౫ – వరుణుని పేళ్లు, The Regent of water, **वरुण देव**.

శ్వసన స్స్పర్శనో వాయుర్మాతరిశ్వా సదాగతిః ॥౬౧॥ పృషదశ్వో గన్ధవహో గన్ధవాహాఽనిలాఽఽశుగాః।సమీర మారుత మరుజ్జగత్ప్రాణ సమీరణాః। నభస్వద్వాత పవన పవమాన ప్రభఞ్జనాః॥

శ్వసనః – స్పర్శనః – వాయుః–మాతరిశ్వా ॥న్॥ – సదాగతిః – పృషదశ్వః–గన్ధవహః–గన్ధవాహః–అనిలః–ఆశుగః–సమీరః–మారుతః – మరుత్ –జగత్ప్రాణః– సమీరణః–నభస్వాన్ ॥త్॥ – వాతః – పవనః–పవమానః–ప్రభఞ్జనః ॥పు॥ ౨౦–వాయుదేవుని పేళ్లు, Air or Wind, **वायुदेव**.

[ప్రకమ్పనో మహావాతో ఝంఝూవాత స్సవృష్టికః॥ టీక. ప్రకమ్పనః – మహావాతః – ఝంఝూవాతః – సవృష్టికః=గాలితో గూడిన వాన అధికపాఠము.] Violent wind, **झांझावात**.

| | |
|---|---|
| ప్రాణోఽపానస్సమాన శ్చోదాన వ్యానౌ చ **వాయవః** ॥౬౩॥ | ప్రాణః-అపానః-సమానః-ఉదానః-వ్యానః ౫. ఇమే=ఇవి, శరీరస్థా=శరీరమునందుండు, వాయవః = వాయువులపేళ్లు, Five vital airs, पंच वायु. |
| శరీరస్థా ఇమే | [(హృది) ప్రాణో (గుదే)ఽపాన స్సమానో (నాభిసంస్థితః)। ఉదానః (కణ్ఠదేశస్థో) వ్యాన (స్సర్వశరీరగః)॥ నాగశ్చకూర్మ కృకరో దేవ దత్తో ధనఞ్జయః। (వాగ్ద్వారే) నాగ (ఆఖ్యాతః) కూర్మ (ఉన్మీలనేస్మృతః)॥ కృకరా (చ్ఛుతం జ్ఞేయం) దేవదత్తా (ద్విజృమ్భణమ్)। (నజహాతి మృతం వాపి సర్వవాపీ) ధనఞ్జయః॥] అధికపాఠము. |
| రంహస్తరసీతు రయ స్స్యదః। జవోఽథ | రంహః-తరః ॥స, న॥-రయః-స్యదః-జవః ॥పు॥ ౫ - వేగముతోఁగూడిన గమనముపేళ్లు, Speed, चाल. |
| శీఘ్రం త్వరితం లఘు క్షిప్ర మరం ద్రుతమ్॥ సత్వరం చపలం తూర్ణ మవిలమ్బిత మాశు చ। | శీఘ్రమ్-త్వరితమ్-లఘు-క్షిప్రమ్-అరమ్-ద్రుతమ్ - సత్వరమ్ - చపలమ్ - తూర్ణమ్-అవిలమ్బితమ్-ఆశు ॥న॥ ౧౧-శీఘ్రముగా, (లేక) శీఘ్రమైనది, Quick or swiftly, जल्दी से. |
| సతతానారతాశ్రాన్త సన్తతావిరతానిశమ్॥ నిత్యానవరతాజస్ర(మ | సతతమ్-అనారతమ్-అశ్రాన్తమ్-సన్తతమ్-అవిరతమ్-అనిశమ్-నిత్యమ్-అనవరతమ్ - అజస్రమ్॥ ౯. ఎడతెగక (లేక) ఎడతెగనిది, Continuous or Continually, निरन्तर. |
| ప్య)థాతిశయోభరః। అతివేల భృశాత్యర్థా తిమాత్రోద్గాఢ నిర్భరమ్॥ ౬౬॥ తీవ్రైకాన్త నితాన్తాని గాఢ బాఢ | అతిశయః-భరః-అతివేలమ్-భృశమ్-అత్యర్థమ్-అతిమాత్రమ్ - ఉద్గాఢమ్ - నిర్భరమ్ - తీవ్రమ్ - ఏకాన్తమ్ - నితాన్తమ్-గాఢమ్ - బాఢమ్ - దృఢమ్ - ౧౪. అతిశయముపేళ్లు, Much or excessive, ज्यादा. |

దృఢానిచ। (క్లీబేశీఘ్రా ద్యసత్త్వేస్యా త్త్రిష్వే షాంభేద్యగామియత్)

శీఘ్ర)శబ్దము మొదలు దృఢశబ్దమువఱకుఁ గల శబ్దములలో అతిశయభరశబ్దములు రెండును నిత్య పుంలింగములు. తక్కిన శబ్దములు క్రియావిశేషణము లైనను, గుణవాచకము లైనను ।న। ఈ శబ్దములలో నేశబ్దము విశేష్యముతోఁ గూడునో యది ॥త్రి॥

కుబేర స్త్ర్యమ్బకసఖో యక్షరా డ్గుహ్యకేశ్వరః। మనుష్యధర్మా ధనదో రాజరాజో ధనాధిపః॥ కిన్నరేశో వైశ్రవణః పౌలస్త్యో నరవాహనః। యక్షైకపిఙ్గైలబిల శ్రీదపుణ్యజనేశ్వరాః॥

కుబేరః-త్ర్యమ్బకసఖః-యక్షరాట్ ॥జ్॥ గుహ్యకేశ్వరః-మనుష్యధర్మా ॥న్॥ - ధనదః-రాజరాజః - ధనాధిపః-కిన్నరేశః-వైశ్రవణః-పౌలస్త్యః-నరవాహనః-యక్షః-ఏకపిఙ్గః- ఐలబిలః-శ్రీదః-పుణ్యజనేశ్వరః-॥పు॥ ౧౭ - కుబేరుని పేళ్లు. Kubera, the God of riches, कुबेर.

(అస్యోద్యానం) చైత్రరథం (పుత్త్రస్తు) నలకూబరః। కైలాసః (స్థాన)మలకా(పూర్విమానంతు)పుష్పకమ్॥ ౭౦ (స్యా) త్కిన్నరః కింపురుష స్తురఙ్గవదనో మయుః। నిధి(ర్నా) శేవధి (ర్భేదాః) పద్మశఙ్ఖాదయో (నిధేః)॥ ౭౧॥ [మహాపద్మశ్చ పద్మశ్చ శఙ్ఖో మకర

చైత్రరథమ్ ॥న॥ ౧-కుబేరుని తోఁటపేరు. నలకూబరః ॥పు॥ ౧ - అతనికుమారుని పేరు. కైలాసః ॥పు॥ ౧ - అతని యునికిపట్టుపేరు. అలకా ॥స్త్రీ॥ ౧ - అతని పట్టణముపేరు. పుష్పకమ్ ॥న॥ ౧-అతని విమానము పేరు. కిన్నరః-కింపురుషః-తురఙ్గవదనః - మయుః ॥పు॥ ౪-కిన్నరులపేళ్లు. కొందఱీ నాలుగును నాలుగు జాతులందురు. నిధిః-శేవధిః॥ (పా) సేవధిః॥ పు॥ ౨-నిధిపేళ్లు, Treasure, निधि पद्मशङ्खादयः=పద్మము శఙ్ఖము మొదలైనవి, నిధేః= నిధియొక్క, భేదాః = భేదములు. పద్మము శఙ్ఖము మొదలయినవి తొమ్మిది నిధిభేదము

కచ్ఛపౌ। ముకున్దకున్ద నీలాశ్చ ఖర్వాశ్చ నిధయో నవ॥]

లనుట. Auriferous gems. [మహాపద్మః, పద్మః, శఙ్ఖః, మకరః, కచ్ఛపః, ముకున్దః, కున్దః,నీలః, ఖర్వః ॥పు॥] ఇవి నవనిధిభేదములు. सुवर्णपूर्ण रत्न.

ఇతి స్వర్గవర్గః.

స్వర్గముతోఁజేరిన పదసమూహము ముగిసెను.

---

ద్యోదివౌ (ద్వేస్త్రియౌ).మభ్రం వ్యోమ పుష్కర మమ్బరమ్॥ నభోఽన్తరిక్షం గగన మనన్తం సురవర్త్మ ఖమ్। వియద్విష్ణుపదం (వాతుపుం) స్యాకాశ విహాయసీ॥ [విహాయ సోఽపినాకోఽపి ద్యు రపి స్యాత్తదవ్యయమ్। తారాపథ శ్శబ్దగుణో మేఘద్వారం మహాబిలమ్॥]

ద్యౌః॥ఓ॥-ద్యౌః-॥వ్॥స్త్రీ॥-అభ్రమ్-వ్యోమన్॥ పుష్కరమ్-అమ్బరమ్-నభః ॥స్॥ - అన్తరిక్షమ్ - గగనమ్ - అనన్తమ్-సురవర్త్మ॥న్ ఖమ్-వియత్-విష్ణుపదం ॥న॥ - ఆకాశం-విహాయః ॥స్, న్న॥ ౧౬ - ఆకాశముపేళ్లు, The sky or atmosphere, आसमान.

[విహాయసః-నాకః ॥పు॥ - ద్యుః ॥అవ్య॥ తారాపథః-శబ్దగుణః ॥పు॥ - మేఘద్వారమ్-మహాబిలమ్॥న॥ అధికపాఠము.]

ఇతి వ్యోమవర్గః.

ఆకాశముతోఁజేరినపదసమూహముముగిసెను

---

దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చ (తాః)

దిశః॥శ్॥-కకుభః॥భ్॥-కాష్ఠాః-ఆశాః॥అ హరితః॥త్॥స్త్రీ॥బ॥ ౫-దిక్సామాన్యనామములు Quarters of the world, Region, Direction, दिशा.

ప్రాచ్యవాచీ ప్రతీచ్య (స్తాః పూర్వదక్షిణపశ్చిమాః)।

ప్రాచీ-అవాచీ (పా) అపాచీ-ప్రతీచీ॥స్త్రీ॥3 వరుసగాఁ బూర్వ East, पूर्व; దక్షిణ South दक्षिण; పశ్చిమ West, पश्चिम దిక్కులపేళ్లు

| | |
|---|---|
| (ఉత్తరాది) గుదీచీ | ఉదీచీ ‖స్త్రీ‖ ౧-ఉత్తరదిక్కుపేరు, North- उत्तर. |
| స్యా)ద్దిశ్యంతు (త్రిషు దిగ్భవే)‖[(అవాగ్భవ) మవాచీనా ముదీచీన ముదగ్భవమ్)। (ప్రత్యగ్భవం)• ప్రతీచీనం ప్రాచీనం. (ప్రాగ్భవం త్రిషు)‖] | దిశ్యమ్ ‖త్రి‖ ౧ - దిక్కులందుఁ బుట్టిన వస్తువుపేరు. What is produced in a direction, दिशा का. [అవాచీనమ్ = దక్షిణ దిక్కునఁ బుట్టినది, Southern, दक्षिणी. ఉదీచీన=ఉత్తరదిక్కునఁ బుట్టినది, Northern, उत्तरी. ప్రతీచీనమ్ = పడమటిదిక్కునఁ బుట్టినది, Western, पश्चिमी. ప్రాచీనమ్ = తూర్పు దిక్కునఁ బుట్టినది, Eastern, पूर्वी.] |
| ఇన్ద్రో వహ్నిః పితృపతి ర్నైరృతో వరుణో మరుత్। కుబేర ఈశః పతయః పూర్వాదీనాం దిశాం క్రమాత్)‖ ౭౫‖ | ఇన్ద్రః - వహ్నిః-పితృపతిః-నైరృతః-వరుణః-మరుత్ -కుబేరః- ఈశః‖పు‖ ౮ క్రమాత్ = వరుసగా, పూర్వాదీనామ్ = తూర్పు మొదలైన, దిశామ్ = (ఎనిమిది) దిక్కులకు, పతయః = అధిపతులపేళ్లు, Regents of quarters and points, दिक्पालक. |
| ఐరావతః పుణ్డరీకో వామనః కుముదో ఽఞ్జనః। పుష్పదన్త స్సార్వభౌమ స్సుప్రతీక (శ్చదిగ్గజాః)‖ (కరి)ణ్యో ఽభ్రముః కపిలా పిఙ్గలా ఽనుపమా (క్రమాత్)। తామ్రపర్ణీ శుభ్రదన్తీ చాఙ్గనాచాఞ్జనావతీ‖ ౭౭‖ | ఐరావతః - పుణ్డరీకః-వామనః-కుముదః - అఞ్జనః-పుష్పదన్తః-సార్వభౌమః - సుప్రతీకః ‖పు‖ ౮-దిగ్గజాః - (వరుసగా నెనిమిది) దిగ్గజములపేళ్లు. Elephants belonging to the Eight Regents, दिक्पाल कों के हाथी.<br>అభ్రముః-కపిలా-పిఙ్గలా-అనుపమా-తామ్రపర్ణీ-(పా) తామ్రకర్ణీ-శుభ్రదన్తీ, అఙ్గనా అఞ్జనావతీ ‖స్త్రీ‖ ౮ - క్రమాత్ = వరుసగా, కరిణ్యః = అష్టదిగ్గజముల భార్యలపేళ్లు, दिक्पालकों की स्त्रियाँ. |
| (క్లీబావ్యయ) న్త్వపదిశం (దిశోర్మధ్యే) | అపదిశమ్ ‖న, అవ్య‖-విదిక్ ‖స్త్రీ‖ ౨-దిశోర్మధ్యే = రెండుదిక్కులనడుమ నుండెడు మూల |

విదిక్ (స్త్రియామ్)। అభ్యన్తరం త్వన్తరాలం చక్రవాలం తు మణ్డలమ్॥ ౭౮॥

దిక్కు పేళ్లు, Intermediate point, बीचका प्रदेश. అభ్యన్తరమ్ - అన్తరాలమ్ ॥న॥ ౨-మధ్యప్రదేశము పేళ్లు, Included space, చక్రవాలమ్ - మణ్డలమ్ ॥న॥ ౨-మణ్డలాకారమైన వస్తువు పేళ్లు, The sensible horizon; or any arc and circumference, **गोलाकार जगह.**

అభ్రం మేఘో వారివాహః। స్తనయిత్నుర్బలాహకః। ధారాధరో జలధరస్తటిత్వాన్వారిదోఽమ్బుభృత్॥ ఘనజీమూతముదిరజలముగ్ధూమయోనయః। కాదమ్బినీ మేఘమాలా (త్రిషు మేఘభవే) ఽభ్రియమ్। స్తనితం గర్జితం (మేఘనిర్ఘోషే) రసితాది చ। శమ్పాశతహ్రదాహ్రాదినైరావత్యః క్షణప్రభా॥ తటిత్సౌదామనీవిద్యుచ్చఞ్చలా చపలాఽపి చ। స్ఫూర్జథుర్వజ్రనిర్ఘోషో మేఘజ్యోతిరిరమ్మదః॥ ౮౨॥ ఇన్ద్రాయుధం శక్రధను (స్తదేవ ఋజు) రోహితమ్॥ (వృష్టిర్వర్షం తద్విఘా

అభ్రమ్ ॥న॥-మేఘః-వారివాహః-స్తనయిత్నుః - బలాహకః - ధారాధరః-జలధరః-తటిత్వాన్ ॥త్॥ - వారిదః-అమ్బుభృత్-ఘనః-జీమూతః - ముదిర - జలముక్ ॥చ్॥ ధూమయోనిః ॥పు॥ ౧౫ మేఘము పేళ్లు, A cloud, **बादल.**

కాదమ్బినీ - మేఘమాలా ॥స్త్రీ॥ ౨ మేఘపఙ్క్తి, A line of clouds, **मेघोंकी पंक्ति.** అభ్రియమ్ ॥త్రి॥ ౧ - మేఘభవే = మేఘమునందుఁ బుట్టిన జలాదులు. స్తనితమ్-గర్జితమ్-రసితమ్ ॥న॥ 3 - మేఘములధ్వని - అనఁగా నుఱుము, The rattling of thunder, **मेघ का गर्जन.** ఆదిశబ్దముచేత స్వనిత ధ్వనితాదులగు పేళ్లును గలవు. శంపా(పా)సంపా-శతహ్రదా - హ్రాదినీ - ఐరావతీ-క్షణప్రభా-తటిత్ -సౌదామనీ-(సా)సౌదామినీ-విద్యుత్ -చఞ్చలా-చపలా ॥స్త్రీ॥ ౧౦-మెఱుపు, Lightning, **बिजली.** స్ఫూర్జథుః-వజ్రనిర్ఘోషః (పా) వజ్రనిష్పేషః ॥పు॥ ౨ - వజ్రఘట్టనమువలనఁ గలిగిన మ్రోఁత, A clap of thunder, **गर्जन.** మేఘజ్యోతిః ॥స్, న॥ - ఇరమ్మదః

తే) వగ్రహావగ్ర హౌ (సమౌ) ॥౭3॥ ధారాసమ్పాత ఆసా రః సీకరో౽మ్బుకణః (స్మృతః)। వర్షోపలస్తు కరకా (మేఘచ్ఛన్నే౽హ్ని) దుర్దినమ్॥ ౭౪॥

॥పు॥ ౧-మేఘమునందున్న తేజస్సు, A flash of lightning. ఇన్ద్రాయుధమ్ - శక్రధనుః ॥పు॥న॥ ౧ - ఇన్ద్రధనుస్సు, Rainbow, इन्द्र-धनुष. రోహితమ్ ॥న॥ ౧-ఋజు = చక్కఁగానున్న యాధనుస్సు, Indra's bow unbent. వృష్టిః ॥స్త్రీ॥-వర్షమ్ ॥న॥ ౧-వాన, Rain, वर्षा. వగ్రహః-అవగ్రహః ॥పు॥ ౧ - తద్విఘాతే= ఆవర్షము యొక్క విఘ్నమునందు వర్తించును. అనఁగా ననావృష్టి, Drought, अनावृष्टि. ధారాసమ్పాతః - ఆసారః ॥పు॥ ౧ - జడివాన, A hard shower, मूसलधार वर्षा శీకరః - అమ్బుకణః ॥పు॥ ౧-తుంపురులు, Thin rain. వర్షోపలః ॥పు॥-కరకా ॥స్త్రీ॥ (పా) కరకః ॥పు॥ ౧ - వడగండ్లు, Hail, ओला. దుర్దినమ్ ॥న॥ ౧ - మేఘచ్ఛన్నే = మేఘముచేతఁ గప్పఁబడిన, అహ్ని = దినము, A cloudy day, मेघाच्छादित दिन.

అన్తర్ధా వ్యవధా (పుంసి) త్వన్తర్ధి రపవారణమ్। అపిధాన తిరోధాన పిధానా౽చ్ఛాదనాని చ॥

అన్తర్ధా-వ్యవధా ॥స్త్రీ॥-అన్తర్ధిః ॥పు॥-అపవారణమ్-అపిధానమ్-తిరోధానమ్-పిధానమ్-ఆచ్ఛాదనమ్ ॥న॥ ౭-కప్పుటపేళ్లు, Covering disappearance, or concealment, ढकना.

హిమాంశు శ్చన్ద్రమా శ్చన్ద్ర ఇన్దుః కుముదబాన్ధవః। విధు స్సుధాంశు శ్శుభ్రాంశు రోషధీశో నిశాపతిః॥ ౭౬॥ అబ్జో జైవాతృక స్సోమో గ్లౌ ర్మృగా

హిమాంశుః - చన్ద్రమాః ॥పు॥ చన్ద్రః - ఇన్దుః - కుముదబాన్ధవః - విధుః-సుధాంశుః - శుభ్రాంశుః-ఓషధీశః-నిశాపతిః_అబ్జః - జైవాతృకః - సోమః - గ్లౌః-మృగాఙ్కః-కలానిధిః-ద్విజరాజః - శశధరః - నక్షత్రేశః-క్షపాకరః ॥పు॥ ౨౦-చంద్రునిపేళ్లు, The moon, चन्द्र.

జ్కః కలానిధిః । ద్విజ రాజ శ్శశధరో నక్ష త్రేశః క్షపాకరః॥౧౭॥

కలాతు (షోడశో భాగో) బిమ్బో (ఽస్త్రీ) మణ్డలం (త్రిషు)॥

కలా ॥స్త్రీ॥ ౧-చంద్రునియొక్క పదియాఱవ పాలి పేరు, A digit; a phase of the moon, **चन्द्रका सोलहवाँ भाग.** బిమ్బః ॥పు॥ మణ్డలమ్ ॥త్రి॥ ౨ - చంద్ర సూర్య మండలముల పేళ్లు, The disc of the sun or moon, **चन्द्र मण्डल.**

భిత్తం శకల ఖణ్డే (వాపుం) స్యర్ధో ఽర్ధం (సమేఽంశకే)॥ చన్ద్రికా కౌముదీ జ్యోత్స్నా ప్రసాద (స్తు) ప్రసన్నతా । కలఙ్కాఙ్కౌ లాఞ్ఛనంచ చిహ్నం లక్ష్మ చ లక్షణమ్॥౧౮॥ [పాఠః కేతు ర్ధ్వజో లిఙ్గం నిమిత్తం వ్యఞ్జనం పదమ్। ప్రజ్ఞానంచా ప్యభిజ్ఞానం లలామంచ లలామ చ]

భిత్తమ్ ॥న॥ - శకలమ్-ఖణ్డమ్ ॥పు॥-అర్ధః ॥పు॥ ౩-తునుక పేళ్లు, A part, **हिस्सा.** అర్ధ శబ్దము సమాంశమును జెప్పునపుడు ॥న॥, Half, आध. చన్ద్రికా-కౌముదీ-జ్యోత్స్నా ॥స్త్రీ॥ 3-వెన్నెల పేళ్లు, Moonlight, **चांदनी** ప్రసాదః ॥పు॥-ప్రసన్నతా ॥స్త్రీ॥ ౨-నిర్మలత్వము పేళ్లు, purity; clearness; brightness **निर्मलता.** కలఙ్కః-అఙ్కః ॥పు॥-లాఞ్ఛనమ్-చిహ్నమ్ - లక్ష్మ ॥న॥ - లక్షణమ్ ॥న॥ ౬-గుఱుతు పేళ్లు, A spot or mark; stigma **चिह्न.** [పాఠః ॥స్త్రీ॥-కేతుః-ధ్వజః-లిఙ్గమ్-నిమిత్తమ్ - వ్యఞ్జనమ్ - పదమ్-ప్రజ్ఞానమ్-అభిజ్ఞానమ్-లలామమ్-లలామ ॥న॥ అధిక పాఠము.

సుషమా (పరమా శోభా) శోభా కాన్తి ర్ద్యుతి శ్ఛవిః। అవశ్యాయస్తు నీహార స్తుషార స్తుహినం హిమం ॥౧౯॥ ప్రాలేయం మిహికాచాథ

సుషమా ॥స్త్రీ॥ ౧ - పరమా-ఎక్కువైన శోభ - కాంతి పేరు, Exquisite beauty **अलौकिक शोभा.** శోభా - కాన్తిః-ద్యుతిః ఛవిః ॥స్త్రీ॥ ౪-కాంతి పేళ్లు, Splendour, तेज. అవశ్యాయః-నీహారః-తుషారః ॥పు॥ - తుహినమ్-హిమమ్-ప్రాలేయమ్ ॥న॥ మిహికా(ప్రా

హిమానీ హిమసంహతిః। శీతం (గుణేతద్వద్వా) స్సుషిమశ్శిశిరో జడః ॥౧౮॥ తుషారశ్శీతల శ్శీతో హిమ (స్సప్తాన్య లిఙ్గకాః) ॥ ధ్రువ ఔత్తానపాది (స్స్యా) దగస్త్యః కుమ్భసమ్భవః। మైత్రావరుణి (రస్యైవ) లోపాముద్రా (సధర్మిణీ)। నక్షత్ర మృక్షంభం తారా తారకాప్యుడు (వాస్త్రియామ్) దాక్షాయ (ణ్యో ౽ శ్వినీ త్యాది తారా) అశ్వయుగశ్వినీ। రాధావిశాఖా పుష్యేతు సిధ్యతిష్యౌశ్రవిష్ఠయా॥౨౨॥(సమా) ధనిష్ఠా (స్యుః) ప్రోష్ఠపదా భాద్రపదా (స్త్రియః) మృగశీర్షం మృగశిర (స్తస్మిన్నే) వాఽగ్రహాయణీ ॥ ౨౩ ॥ ఇల్వలా (స్త చ్ఛిరో దేశే తారకా నివసన్తియాః)॥

మహికా ॥స్త్రీ॥ ౭-మంచుపేళ్లు, Frost, तुषार. హిమానీ - హిమసంహతిః ॥స్త్రీ॥ ౨ - మంచుయొక్క సమూహముపేళ్లు, A mass of snow, हिम. శీతమ్ ౧ గుణవాచకమైనపుడు ॥న॥ శైత్యగుణముపేరు, Chillness, शैत्य. సుషిమః [పా] సుశిమః-శిశిరః-జడః - తుషారః-శీతలః-శీతః-హిమః॥ పు॥ ౭-శైత్యగుణము గలదానిపేళ్లు, Frigid, शीत. ఇవి విశేష్యలింగములు. ధ్రువః - ఔత్తానపాదిః ॥పు॥ ౨ - ధ్రువుని పేళ్లు, The polar star, ध्रुव नक्षत्र. అగస్త్యః - కుమ్భసమ్భవః - మైత్రావరుణిః ॥పు॥ ౩ - అగస్త్యుని పేళ్లు, Star Canopus, अगस्त्य. లోపాముద్రా ॥స్త్రీ॥ ౧-అగస్త్యునిభార్యపేరు. నక్షత్రమ్-ఋక్షమ్-భమ్ ॥న॥ - తారా ॥స్త్రీ॥ తారకా-ఉడు ॥స్త్రీ॥ ౬-నక్షత్రముపేళ్లు, A star, नक्षत्र. అశ్వినీత్యాదితారాః-అశ్వినీనక్షత్రము మొదలయిన యిరువదియేడునక్షత్రములు, దాక్షాయణ్యః॥ ఈ, స్త్రీ, బ - దాక్షాయణు లనఁబడుచున్నవి. Asterisms. అశ్వయుక్ ॥జ్॥ అశ్వినీ ॥స్త్రీ॥ ౨-అశ్వినీనక్షత్రము పేళ్లు, The head of Aries, अश्विनी नक्षत्र. రాధా విశాఖా ॥స్త్రీ॥ ౨-విశాఖా నక్షత్రము పేళ్లు, Stars in the southern scale, विशाख नक्षत्र. పుష్యమ్ ॥న॥-సిధ్యః-తిష్యః ॥పు॥ ౩-పుష్యనక్షత్రము, Stars in Cancer, पुष्य. శ్రవిష్ఠా - ధనిష్ఠా ॥స్త్రీ॥ ౨-ధనిష్ఠపేళ్లు, The Dolphin, धनिष्ठा. ప్రోష్ఠపదాః ॥స్త్రీ॥ ౧-పూర్వాభాద్రపేరు, భాద్రపదాః ॥స్త్రీ॥ ౧-ఉత్తరాభాద్రపేరు, The wing

of pegasus, उत्तराभाद्र. మృగశీర్షమ్-మృగశిరః ॥స్॥న॥ ఆగ్రహాయణీ ॥స్త్రీ॥ 3 - మృగశీర్షము పేళ్లు, Orion, मृगशिरा. ఇల్వలాః॥ ౧ - తచ్ఛిరోదేశే - ఆ మృగశీర్ష నక్షత్రము మీఁద, యాః తారకాః నివసన్తి-ఏనక్షత్రము లున్నవో అవి, Stars in the head of Orion.

బృహస్పతిస్సురాచార్యో గీష్పతి ర్ధిషణో గురుః॥ జీవ ఆఙ్గిరసో వాచస్పతి శ్చిత్రశిఖణ్డిజః॥ శుక్రో దైత్య గురుః కావ్య ఉశనా భార్గవః కవిః॥ అఙ్గారకః కుజో భౌమో లోహితాఙ్గో మహీసుతః । రౌహిణేయో బుధ స్సౌమ్య (స్సమౌ) సౌరిశనైశ్చరౌ। [శనిమన్దౌ పఙ్గు కాలౌ ఛాయా పుత్రో౽సితో౽ర్కజః]

బృహస్పతిః - సురాచార్యః-గీష్పతిః-ధిషణః॥ గురుః - జీవః-ఆఙ్గిరసః-వాచస్పతిః-చిత్రశిఖణ్డిజః ॥పు॥ ౯-బృహస్పతి పేళ్లు. Jupiter बृहस्पति. శుక్రః-దైత్యగురుః-కావ్యః-ఉశనా ॥స్॥ భార్గవః - కవిః ॥పు॥ ౬ - శుక్రుని పేళ్లు, Venus, शुक्र. అఙ్గారకః-కుజః-భౌమః-లోహితాఙ్గః-మహీసుతః ॥పు॥ ౫-అంగారకుని పేళ్లు Mars, कुज. రౌహిణేయః - బుధః-సౌమ్యః ॥పు॥ 3-బుధుని పేళ్లు, Meıcury बुध. సౌరిః-శనైశ్చరః ॥పు॥ ౨-శని పేళ్లు, Saturn, शनि [శనిః, మన్దః, పఙ్గుః, కాలః, ఛాయాపుత్రః అసితః, అర్కజః] అధికపాఠము. తమ ॥స్, న॥ - రాహుః - స్వర్భానుః-సైంహికేయః-విధుంతుదః ॥పు॥ ౫ - రాహువు పేళ్లు The ascending node, राहु.

తమస్తు రాహుస్స్వర్భానుస్సైంహికేయో విధుంతుదః। (సప్తర్షయో మరీచ్యత్రిముఖా) శ్చిత్రశిఖండినః। (రాశీనాముద

మరీచ్యత్రిముఖాః=మరీచి, (అత్రి, అంగిరస్సు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు వసిష్ఠుఁడు) మొదలైన, సప్తర్షయః=సప్తర్షులు చిత్రశిఖణ్డినః ॥న్, పు, బ॥-చిత్రశిఖండులన బడుదురు. Ursa major, सप्त ऋषि के ता లగ్నమ్ ॥న॥ ౧ - రాసుల యుదయమ

యో) లగ్నం తేతు మేషవృషాదయః॥

సూర సూర్యార్యమా దిత్య ద్వాదశాత్మదివా కరాః ॥౧౦౦॥ భాస్క రాహస్కర బ్రధ్న ప్రభాకర విభాకరాః॥ భాస్వద్వివస్వత్సప్తాశ్వ హరిదశ్వోష్ణరశ్మయః॥

వికర్తనార్క మార్తణ్డ మిహిరారుణ పూష ణః। ద్యుమణి స్తరణి ర్మిత్ర శ్చిత్రభాను ర్విరోచనః॥ విభావసు ర్గ్రహ పతి స్త్విషాం పతి రహర్పతిః॥ భాను ర్హంస స్సహస్రాంశు స్తపన స్సవితా రవిః॥ [కర్మసాక్షీ జగచ్చక్షు రంశుమాలీ త్రయీత నుః। ప్రద్యోతనో దిన మణిః ఖద్యోతో లోక బాన్ధవః॥ ఇనో భగో ధామనిధిః పద్మినీవల్ల భో హరిః॥]

Ascension; the rising of the signs, तारों का उदय. ఆ రాసులు:-మేషము, Aries, मेख राशि. వృషభము, Taurus, वृषभ राशि. మిథునము, Gemini, मिथुन राशि. కర్కటకము, Cancer, कर्क राशि. సింహము, Leo, सिह राशि. కన్య, Virgo, कन्या राशि. తుల, Libra, तुला राशि. వృశ్చికము, Scorpio, वृश्चिक राशि. ధనుస్సు, Sagittarius, धनुष राशि. మకరము, Capricorn, मकर राशि. కుంభము, Aquarius, कुंभ राशि. మీనము, Pisces, मीन राशि అను పండ్రెండు signs of Zodiac, राशि चक्र.

సూరః (పా) శూరః - సూర్యః-అర్యమా ॥న్॥-ఆదిత్యః-ద్వాదశాత్మా ॥న్॥-దివాకరః-భాస్కరః - అహస్కరః-బ్రధ్నః-ప్రభాకరః-విభాకరః-భాస్వాన్ ॥త్॥ - వివస్వాన్ ॥త్॥ సప్తాశ్వః - హరిదశ్వః - ఉష్ణరశ్మిః-వికర్తనః-అర్కః-మార్తణ్డః (పా) మార్తాణ్డః-మిహిరః-అరుణః-పూషా ॥న్॥ - ద్యుమణిః - తరణిః-మిత్రః - చిత్రభానుః - విరోచనః-విభావసుః-గ్రహపతిః - త్విషాంపతిః-అహర్పతిః-భానుః-హంసః - సహస్రాంశుః-తపనః ॥సవితా॥ఋ॥-రవిః ॥పు॥ 3 2 - సూర్యునిపేళ్లు. The sun, सूर्य. [కర్మసాక్షీ ॥న్॥ - జగచ్చక్షుః ॥ష్॥ - అంశుమాలీ ॥న్॥ త్రయీతనుః-ప్రద్యోతనః-దినమణిః - ఖద్యోతః - లోకబాన్ధవః-ఇనః-భగః-ధామనిధిః-పద్మినీవల్లభః-హరిః]అ.పా. [పద్మాక్షస్తేజసాంరాశి శ్ఛాయానాథస్తమి

మాఠరః పిఙ్గలో దణ్డ (శ్చణ్డాంశోః పారిపార్శ్వకాః)॥ సూరసూతో౽రుణో౽నూరుః కాశ్యపి గ్గరుడాగ్రజః॥ ౧౦౪॥ పరివేషస్తు పరిధి రుపసూర్యకమణ్డలే కిరణో౽స్రమయూఖాంశు గభస్తిఘృణి ఘృష్ణయః॥ భానుః కరో మరీచిః (స్త్రీపుంసయో) ర్దీధితిః (స్త్రియామ్)। (స్యుః) ప్రభారు గ్రుచి స్త్విడ్భా భాశ్ఛవి ద్యుతిదీప్తయః॥ ౧౦౫॥ రోచి శ్శోచి (రుభేక్లీబే) ప్రకాశో ద్యోత ఆతపః॥ కోష్ణం కవోష్ణం మన్దోష్ణం కదుష్ణం (త్రిషుతద్వతి)॥ ౧౦౬॥ తిగ్మం తీక్ష్ణఖరం (తద్వ) న్మృగతృష్ణా మరీచికా॥

ఇతి దిగ్వర్గః.

స్రహా] [పద్మాక్షః - తేజసాంరాశిః-ఛాయానాథః-తమిస్రహా॥ అధికపాఠము.]

మాఠరః-పిఙ్గలః-దణ్డః ॥పు॥ 3-చణ్డాంశోః = సూర్యునియొక్క, పారిపార్శ్వకాః=పార్శ్వమునందుండు నంగదేవతల పేళ్లు, Attendants of the Sun, सूर्य के पार्श्ववर्ती.

సూరసూతః-అరుణః-అనూరుః-కాశ్యపిః-గరుడాగ్రజః ॥పు॥ ౫ - సూర్యసారథి పేళ్లు, The dawn, the charioteer of the Sun, सूर्य का सारथि. పరివేషః (షా) పరివేశః - పరిధిః ॥పు॥ ఉపసూర్యకమ్, మణ్డలం ॥న॥ ౪-ఒకానొకప్పుడు సూర్యునిచుట్టును జూడఁబడు కుండలాకారమైన తేజోవిశేషము పేళ్లు, Halo. కిరణః - ఉస్రః-మయూఖః-అంశుః-గభస్తిః-ఘృణిః-ఘృష్ణిః-(ప) వృష్ణిః-భానుః-కరః ॥పు॥ మరీచిః ॥ప్స॥ దీధితిః ॥స్త్రీ॥ ౧౧-సూర్యకిరణము పేళ్లు, A ray, किरण. ప్రభా-రుక్ ॥ చ్ - రుచిః - త్విట్ ॥ష్॥ - భా-భాః ॥స్॥-ఛవిః-ద్యుతిః-దీప్తిః ॥స్త్రీ॥ రోచిః ॥స్॥ శోచిః ॥స్॥ ॥న॥ ౧౧-సూర్యకాంతిపేళ్లు, Light, सूर्य की कान्ति. ప్రకాశః - ద్యోతః-ఆతపః ॥పు॥ 3-ఎండపేళ్లు, Sunshine, धूप. కోష్ణమ్-కవోష్ణమ్-మన్దోష్ణమ్-కదుష్ణమ్ ॥న॥ ౪-ఇంచుక, వేఁడిమిపేళ్లు, Warmth, गर्मी. ఇంచుక వేఁడిమిగలవస్తువుఁ జెప్పునపుడు ॥త్రి॥ తిగ్మమ్-తీక్ష్ణమ్-ఖరమ్ ॥న॥ 3-వేఁడిమిపేళ్లు, Heat, गर्मी. కోష్ణాదిశబ్దములవలె వేడిమిగలవస్తువును జెప్పునపుడు ॥త్రి॥ మృగతృష్ణా-మరీచికా ॥స్త్రీ॥ ఎండమావులపేళ్లు, Mirage, मृगतृष्णा దిక్కులతోఁ జేరిన పదసమూహము ముగిసెను

కాలోదిష్టో ఽప్యనేహాఽపి సమయోఽ(ప్యథ) పక్షతిః॥౧౦౮॥ ప్రతిప(ద్ద్వే ఇమేస్త్రీత్వే) తదాద్యా (స్తిథయో) (ద్వయోః) (ఘస్రో దినాహనీ) (వాతుక్లీబే) దివసవాసరౌ ॥౧౦౯॥ ప్రత్యూషోఽహర్ముఖం కల్య ముషః పత్యూష సీఅపి॥ ప్రభాతంచ దినాన్తేతు స్సాయస్సన్ధ్యా పితృ ప్రసూః ॥౧౧౦॥

కాలః-దిష్టః-అనేహా ॥స॥-సమయః ॥పు॥ ౪ - కాలముపేళ్లు, Time, **समय.** పక్షతిః - ప్రతిపత్ ॥ద॥సీ॥ ౨ - పాడ్యమి (ప్రథమ) First lunar day, **शुक्लपक्ष की प्रथमतिथि** తిథయః ॥స్త్ర,ఇ,బ॥ ౧-పాడ్యమి మొదలయిన తిథులు, A lunar day **शुक्लपक्ष की तिथि.** ఘస్రః ॥పు॥ దినమ్-అహః ॥న॥న॥ - దివసః-వాసరః ॥పు॥ ౫-దినముపేళ్లు, A day, **दिन.** ప్రత్యూషః ॥పు॥ అహర్ముఖం-కల్యమ్-ఉషః-ప్రత్యుష ॥స॥ - ప్రభాతమ్ ॥న॥ ౬ - ప్రాతః కాలము పేళ్లు, The dawn, **अरुणोदय.** దినాన్తః-సాయః ॥పు॥ (పా) సాయమ్-అవ్య॥ ౨-సాయంకాలము పేళ్లు, Evening, **सायंकाल.** సంధ్యా-పితృప్రసూః ॥ఊ, సీ॥ ౨-సంధ్యాకాలముపేళ్లు, Twilight, **गोधूलि समय.** [వ్యుష్టంవిభాతం ద్వే క్లీబే పుంసి గో సర్గ ఇష్యతే॥] అధికపాఠము.

(ప్రాహ్ణాఽపరాహ్ణమధ్యాహ్నా) స్త్రిసన్ధ్య

త్రిసన్ధ్యమ్ ॥న॥ ౧-ప్రాహ్ణాపరాహ్ణ మధ్యాహ్నము లనఁబడు దినాద్యన్తమధ్యభాగముల సమూహము, Forenoon, afternoon, and mid-day, **सुबह, दुपहर, शाम.**

(మథ) శర్వరీ॥ నిశానిశీథినీరాత్రిస్త్రియామా క్షణదా క్షపా ॥౧౧౧॥ విభావరీ తమస్విన్యౌరజనీయామినీ తమీ। తమిస్రా(తామసీరాత్రి॥)

శర్వరీ-నిశా-నిశీథినీ-రాత్రిః-త్రియామా-క్షణదా-క్షపా-విభావరీ-తమస్వినీ-రజనీ (ప) రజనిః-యామినీ-తమీ (పా) తమా ॥సీ॥ ౧౨ రాత్రిపేళ్లు, Night, **रात.**

తమిస్రా ॥సీ॥ ౧-తామసీరాత్రిః-గాఢాంధకారపురాత్రి పేరు, A dark night, **अंधेरी रात.**

| | |
|---|---|
| జ్యోత్స్నీ (చంద్రికయాఽన్వితా) ౧౧౨॥ | జ్యోత్స్నీ ॥స్త్రీ॥ ౧ - చన్ద్రికయా=వెన్నెలతోడ, అన్వితా = కూడిన రాత్రి పేరు, A moon-light night, चांदनी रात. |
| (ఆగామివర్తమానాహర్యుక్తాయాంనిశి)పక్షిణీ | పక్షిణీ ॥స్త్రీ॥ ౧-ఆగామివర్తమానాహర్యుక్తాయాం నిశి=వచ్చునట్టి పగటితోను నడచెడు పగటితోనుగూడిన రాత్రి, A night and two days, एक रात और दो दिन. |
| గణరాత్రం నిశా బహ్వ్యః ప్రదోషో రజనీముఖమ్॥ ౧౧౩॥ | గణరాత్రమ్ ॥న॥ ౧ - నిశాః-బహ్వ్యః-పెక్కు రాత్రుల పేరు, A multitude of Nights, कई रातें. ప్రదోషః ॥పు॥ - రజనీముఖమ్ ॥న॥ ౨-ప్రదోషకాలముపేళ్లు, The beginning of night, रात्री का आरंभ. |
| అర్ధరాత్రనిశీథౌ (ద్వౌ | అర్ధరాత్రః-నిశీథః ॥పు॥ ౨-అర్ధరాత్రముపేళ్లు, Midnight. अर्ध रात्री. |
| (ద్వౌ)యామప్రహరౌ | యామః-ప్రహరః ॥పు॥ ౨-జాము పేళ్లు, A period of three hours, पहर. |
| (సమౌ)॥ (స)పర్వసన్ధిః (ప్రతిపత్పఞ్చదశ్యో ర్యదన్తరమ్॥ ౧౧౪॥ | పర్వసన్ధిః ॥పు॥ (ప) పర్వ ॥న్, న॥ సన్ధిః ॥పు॥ ౧-పున్నమకును పాడ్యమికిని అమావాస్యకును పాడ్యమికిని నడుమనున్న కాలము పేరు, The junction of the fifteenth and first of a lunar fortnight. पक्ष. |
| పక్షాన్తౌ పఞ్చదశ్యౌ (ద్వే) | పక్షాన్తః ॥పు॥ - పఞ్చదశీ ॥ఈ, స్త్రీ॥ ౨ - పున్నమకును అమావాస్యకును పేళ్లు, पूर्णिमा और अमावास्या. |
| పౌర్ణమాసీ తు పూర్ణిమా॥ (కలాహీనేసా) ఽనుమతిః (పూర్ణే) రాకా (నిశాకరే)॥ ౧౧౫॥ | పౌర్ణమాసీ-పూర్ణిమా ॥స్త్రీ॥ ౨ - పున్నమపేళ్లు, Day of full moon, पूर्णिमा. నిశాకరే=చంద్రుడు, కలాహీనే (సతి)=ఒకకళచేతక్కువైనవాడుగా నున్నప్పుడు, సా॥ ఆపున్నమ, అనుమతిః ॥స్త్రీ॥ ౧ - అనుమతియనం |

బడును, Moon one digit less than full. పూర్ణే(సతి)=(పదాఱుకళలతోఁ గూడియున్నప్పుడు) రాకా॥సీ॥-రాకయనంబడును, Moon quite full, पूर्ण चन्द्र.

అమావాస్యా త్వమావస్యా దర్శ స్సూర్యేన్దుసఙ్గమః॥ (సాదృష్టేన్దు) స్సినీవాలీ (సా నష్టేన్దుకలా)కుహూః॥

అమావాస్యా-అమావస్యా ॥సీ॥దర్శః-సూర్యేన్దు సఙ్గమః ॥పు॥ ౪ - అమావాస్య పేళ్లు, Day of new moon, अमावास्या. సినీవాలీ ॥సీ॥ ౧-దృష్టేన్దుః సా=చంద్రకళ కనఁబడిన యమావాస్య పేరు. కుహూః ॥సీ॥ ౧-నష్టేన్దుకలా సా=చంద్రకళ కనఁబడని యమావాస్య పేరు.

ఉపరాగో గ్రహో (రాహుగ్రస్తే త్విందౌ చ పూష్ణిచ) । సోపప్లవోపరక్తౌ(ద్వౌ)

ఉపరాగః - గ్రహః ॥పు॥ ౨-గ్రహణము పేళ్లు, An eclipse, ग्रहण. సోపప్లవః - ఉపరక్తః ॥పు॥ ౨-రాహుగ్రస్తే=రాహువుచేత గ్రసింపఁబడిన, ఇన్దౌ - చంద్రునికిని, పూష్ణిచ - సూర్యునికిని పేళ్లు. Eclipsed sun or moon, राहु ग्रसित चन्द्र व सूर्य.

వగ్న్యుత్పాతఉపాహితః॥ ౧౧౭॥

అగ్న్యుత్పాతః-ఉపాహితః ॥పు॥ ౨-ధూమకేతువుపేళ్లు, A meteor or comet, केतु.

(ఏకయోక్త్యా) పుష్పవన్తౌ (దివాకరనిశాకరౌ)

పుష్పవన్తౌ ॥త్॥ (ప) పుష్పదన్తౌ ॥అ,పు॥ ద్వి॥ ౧-ఏకయా ఉక్త్యా=ఒకమాటచేత, దివాకరనిశాకరౌ = సూర్యచంద్రులపేరు, Sun and Moon, सूर्य, चन्द्र.

(అష్టాదశనిమేషాస్తు) కాష్ఠా

కాష్ఠా ॥సీ॥ ౧ - అష్టాదశనిమేషాః=పదునెనిమిది ఱెప్పపాట్లకాలముపేరు, Time measured by 18 twinklings, (१८ पल).

(త్రింశత్తు తాః) కలా॥ ౧౧౮॥

కలా ॥సీ॥ ౧-తాః త్రింశత్ =అట్టికాష్ఠలు ముప్పదిగూడిన కాలము పేరు, Eight Seconds, आठ सेकेंड.

(తాస్తు త్రింశ)త్క్షణ

క్షణః ॥పు॥ ౧-తాః త్రింశత్ =అట్టికళలు ముప్పదిగూడిన కాలముపేరు, Four minutes, **चार मिनिट.**

(స్తేతు) ముహూర్తో (ద్వాదశాఽ స్త్రీయామ్)। (త్రేతు త్రింశ) దహోరాత్రః

ముహూర్తః ॥పు॥ ౧ - తే ద్వాదశ=అట్టి క్షణములు పండ్రెండుగూడిన కాలముపేరు, 48 minutes, **४८ मिनिट.** అహోరాత్రః ॥పు॥ ౧-తేత్రింశత్ =అట్టి **ముహూర్తములు** ముప్పదిగూడిన కాలము, A day and night, **एक रात और दिन.**

పక్ష (స్తేదశ) పఞ్చ చ॥ ౧౧౯॥

పక్షః ॥పు॥ ౧-తేదశపఞ్చచ=అట్టియహోరాత్రములు పదునేను గూడిన కాలము, A fortnight, **एक पक्ष.**

(పక్షౌ పూర్వాపరౌ) శుక్లకృష్ణౌ

శుక్లః ॥పు॥ ౧-కృష్ణః ॥పు॥ ౧-వరుసగాఁ బూర్వపక్షము (Light fortnight) (**शुक्ल पक्ष**) నకును, అపరపక్షము (dark fortnight) (**कृष्ण पक्ष**) నకును పేళ్లు.

**మాసస్తు** (తావుభౌ)

మాసః ॥పు॥ ౧-తావుభౌ=ఆ శుక్ల కృష్ణ పక్షములు రెండుగూడిన కాలముపేరు, A month, **महीना.**

(ద్వౌద్వౌ మాఘాది మాసౌస్యా) దృతు

ఋతుః ॥పు॥ ౧-మాఘమాసము మొదలు రెండేసి నెలలు గూడిన కాలము పేరు, A season, **ऋतु.**

(స్తైః) రయనం (త్రిభిః)॥ ౧౨౦॥

అయనమ్ ॥న॥ ౧-తైః త్రిభిః=అట్టిఋతువులు మూఁడు గూడినకాలముపేరు, A half-year, **अर्ध संवत्सर.**

(అయనే ద్వేగతిరుదగ్దక్షిణాఽర్కస్య) వత్సరః।

వత్సరః ॥పు॥ ౧ - సూర్యుని యుత్తరపు దిక్కున సంచారముగాను దక్షిణపుదిక్కున సంచారముగాను నుండు దక్షిణోత్తరాయణములు రెండును సంవత్సరమనఁబడును. ఇదియే

యొక యేఁడు, A year, एक वर्ष. మాఘాది శ్రావణపర్యంతము సూర్యుని యుత్తరగతి, యుత్తరాయణము, Sun's progress to the north of the equator, उत्तरायन. శ్రావణాదిమాఘపర్యంతము దక్షిణగతి, దక్షిణాయనము, Sun's progress to the south of the equator, दक्षिणायन. అట్టి అయనములు రెండు గూడిన కాలము సంవత్సరమనుట, A year, एक वर्ष.

(సమరాత్రిన్దివే కాలే) విషువ ద్విషువం (చ తత్)॥ ౧౨౧॥

విషువత్ - విషువమ్ ॥న॥ ౨ - సమమైన రేయుంబగలు గల కాలము అనఁగా రాత్రియును బగలును సమమైన కాలముపేళ్లు, Equinox, विषुवीय ; समान रात और दिन.

(పుష్యయుక్తా పౌర్ణమాసీ పౌషీ

పౌషీ ॥సీ॥ ౧-పుష్యయుక్తా = పుష్యనక్షత్రముతోఁ గూడిన, పౌర్ణమాసీ = పున్నమ పేరు, पुष्य नक्षत्र युक्त पूर्णिमा.

(మాసేతుయత్ర సా నామ్నాస) పౌషో (మాఘాద్యాశ్చ వ మేకాదశాఽపరే)॥ ౧౨౨॥

పౌషః ॥పు॥ ౧-ఏ మాసమున నా పున్నమ వచ్చునో, ఆ మాసము పౌష మనంబడును. తక్కిన మాఘమాసము - మొదలగు పదునొకండును నిట్లు తెలియఁదగినవి.

మార్గశీర్షేసహామార్గ ఆగ్రహాయణిక(శ్చసః)

మార్గశీర్షః-సహః ॥స॥-మార్గః-ఆగ్రహాయణికః ॥పు॥ ౪ - మార్గశీర్షము పేళ్లు, December, January, मार्गशीर्ष.

పౌషేతైష సహస్యౌ (ద్వౌ)

పౌషః-తైష-సహస్యః ॥పు॥ 3-పుష్యమాసముపేళ్లు, January-February, पौष.

తపామా (ఘేఽ

తపాః ॥స॥-మాఘః ॥పు॥ ౨-మాఘమాసముపేళ్లు, February-March, माघ.

| | |
|---|---|
| థ) ఫాల్గునే (స్యా)_త్త పస్యః ఫాల్గునిక | ఫాల్గునః - తపస్యః - ఫాల్గునికః ॥పు॥ ౩ ఫాల్గునమాసము పేళ్లు, March-April, फागुन. |
| (స్యా)చ్చైత్రే చైత్రికో మధుః॥ | చైత్ర-చైత్రికః-మధుః ॥పు॥ ౩ - చైత్రమాసముపేళ్లు, April-May, चैत. |
| వైశాఖే మాధవో రాధో | వైశాఖః-మాధవః-రాధః ॥పు॥ ౩-వైశాఖమాసముపేళ్లు, May-June, वैशाख. |
| జ్యేష్ఠే శుక్ర | జ్యేష్ఠః-శుక్రః ॥పు॥ ౨ - జ్యేష్ఠమాసము పేళ్లు, June-July, ज्येष्ठ, जेठ. |
| శ్శుచి(_స్త్వయమ్)॥ ౧౨౮॥ ఆషాఢే | శుచిః-ఆషాఢః (పా) ఆశాఢః ॥పు॥ ౨- ఆషాఢమాసముపేళ్లు, July-August, आषाढ़. |
| శ్రావణే తు(స్యా)న్న భాశ్శ్రావణిక (శ్చసః) | శ్రావణః-నభాః ॥స॥-శ్రావణికః ॥పు॥ ౩ - శ్రావణమాసముపేళ్లు. August-September, श्रावण. |
| (స్యు) ర్నభస్యః ప్రౌ) ష్ఠపద భాద్ర భాద్ర పదా (స్సమాః)॥ ౧౨౯॥ | నభస్యః-ప్రౌష్ఠపదః - భాద్రః - భాద్రపదః ॥పు॥ ౪ - భాద్రపదమాసముపేళ్లు, Sixth lunar month, September - October, भाद्र. |
| (స్యా)దాశ్వినఇషోఽ ప్యాశ్వయుజోఽపి | ఆశ్వినః-ఇషః-ఆశ్వయుజః ॥పు॥ ౩-ఆశ్వయుజమాసముపేళ్లు, October-November, आसोज. |
| (స్యాత్తు)కార్తికే। బాహు లోర్జః కార్తికికో, | కార్తికః-బాహులః-ఊర్జః - కార్తికికః ॥పు॥ ౪ - కార్తికమాసముపేళ్లు, November-December, कातींक. |
| హేమన్త | హేమన్తః ॥పు॥ ౧-హేమన్తఋతువుపేరు, Winter, हेमन्त. |

| | |
|---|---|
| శిశిరోఽస్త్రియామ్। | శిశిరః ॥పు॥ ౧ - శిశిరఋతువు, Cold season, शिशिर. |
| వసన్తే పుష్పసమయస్సురభి | వసన్తః-పుష్పసమయః-సురభిః ॥పు॥ 3-వసంతఋతువుపేళ్లు, Spring, वसन्त. |
| గ్రీష్మ ఊష్మకః। నిదాఘఉష్ణోపగమ ఉష్ణఊష్మాగమ స్తపః॥ ౧౨౭॥ | గ్రీష్మః-ఊష్మకః-నిదాఘః-ఉష్ణోపగమః-ఉష్ణః-ఊష్మాగమః-తపః ॥పు॥ ౭-గ్రీష్మఋతువుపేళ్లు, Hot season, ग्रीष्म ऋतु. |
| (స్త్రియాం) ప్రావృట్ స్త్రియాం భూమ్ని) వర్షా | ప్రావృట్ ॥ష్,సీ॥-వర్షాః ॥ఆ,సీ,బ॥ ౨-వర్షఋతువుపేళ్లు, Rainy Season (Autumn or sultry season), वार्षा ऋतु. |
| (అథ) శరత్ స్త్రియామ్। | శరత్ ॥ద్॥ (ప) శరదా ॥సీ॥ ౧ - శరదృతువుపేరు, शारत. |
| (షడమీ) ఋతవః (పుంసి మార్గాదీనాం యుగ్మైః క్రమాత్)॥ ౧౨౮॥ | ఋతుః ॥పు॥ ౧ - షడమీ=ఈ యాఱు ఋతువులు, మార్గాదీనాంయుగ్మైః క్రమాత్ = మార్గశీర్షము మొదలైన పండ్రెండు నెలలలో వరుసగా రెండేసినెలలచేత నేర్పడుచున్నవి, Seasons, ऋतुएँ. |
| సంవత్సరో వత్సరోఽబ్దో హాయనో (ఽస్త్రీ)శరత్సమాః। | సంవత్సరః-వత్సరః-అబ్దః ॥పు॥-హాయనః ॥పు॥ శరత్ ॥ద్॥-సమాః ॥ఆ, బ॥ (ప) సమా ॥సీ॥ ౬-సంవత్సరముపేళ్లు, A year, एक वर्ष. |
| (మాసేన స్యాదహోరాత్రః పైత్రో వర్షేణ దైవతః)॥ | మనుష్యుల యొకమాసముచేత పితృదేవతలకు నొక యహోరాత్రము, A patriarchal day, पितरों का एक दिन. |
| [దివ్యైర్వర్షసహస్రైర్ద్వాదశభి ర్దైవతం యుగమ్॥] | అందు శుక్లపక్షము పగలు, కృష్ణపక్షము రాత్రి. మనుష్యుల యొకసంవత్సరము దేవతలకు నొక యహోరాత్రము. అందు నుత |

రాయణము పగలు, దక్షిణాయనము రాత్రి; అట్టి మున్నూటఱువది యహోరాత్రములు దేవతల కొకసంవత్సరము. అట్టి పండ్రెండు వేలసంవత్సరములు దేవతలకు నొకయుగము.

దై వేయుగ సహస్రే ద్వే బ్రాహ్మః కల్పౌతు (తౌ నృణామ్॥)

దేవసంబంధమైన రెండువేల యుగములు బ్రహ్మకు నొక యహోరాత్రము. తౌ = ఆ యహోరాత్రములు, నృణామ్ = మనుష్యులకు, కల్పౌ = రెండుకల్పములు, అందుఁ బగలుదయ కల్పము, రాత్రి క్షయకల్పము, कल्प.

మన్వన్తరం (తు దివ్యానాం యుగానా మేకసప్తతిః)॥ ౧౩౦॥

మన్వన్తరమ్ ॥న॥ ౧ - దివ్యానాం యుగానామ్ = దేవయుగములయొక్క, ఏకసప్తతిః = డెబ్బదియొకటి గూడిన కాలముపేరు, मन्वन्तर.

సంవర్తః ప్రలయః కల్పః క్షయః కల్పాన్త (ఇత్యపి। అస్త్రీ) పఙ్కం (పుమాన్) పాప్మాపాప కిల్బిషకల్మషమ్॥ ౧౩౧॥ కలుషం వృజినైనోఽఘ మంహో దురితదుష్కృతమ్। (స్యా) ద్ధర్మ (మస్త్రియాం) పుణ్య శ్రేయసీ సుకృతం వృషః॥

సంవర్తః-ప్రలయః-కల్పః-క్షయః - కల్పాన్తః ॥పు॥ ౫-ప్రళయకాలముపేళ్లు, Destruction of the world, प्रलय.

పఙ్కమ్ ॥పు॥-పాప్మా ॥న్, పు॥-పాపమ్ కిల్బిషమ్-కల్మషమ్-కలుషమ్-వృజినమ్- ఏనః ॥స్॥-అఘమ్-అంహః ॥స్॥-దురితమ్-దుష్కృతమ్ ॥న॥ ౧౧-పాపముపేళ్లు, Sin, पाप.

ధర్మమ్ ॥పు॥ పుణ్యమ్ - శ్రేయః ॥స్॥ - సుకృతమ్ ॥న॥-వృషః ॥పు॥-౫-పుణ్యముపేళ్లు, Virtue or moral merit, पुण्य.

ముత్ప్రీతిః ప్రమదోహర్షః ప్రమోదామోదసమ్మదాః। (స్యా) దానన్దథురానన్దశ్శర్మ శాతసుఖానిచ॥ ౧౩౨॥

ముత్ ॥ద్॥-ప్రీతిః ॥స్త్రీ॥ ప్రమదః-హర్షః-ప్రమోదః - ఆమోదః - సమ్మదః-ఆనన్దథుః-ఆనన్దః ॥పు॥-శర్మ ॥న్॥ శాతమ్ (సా) సాతమ్-సుఖమ్ ॥న॥ ౧౨ - సంతోషముపేళ్లు, Joy, or pleasure, सुख.

శ్వశ్శ్రేయసం శివం భద్రం కల్యాణం మఙ్గళం శుభమ్। భావుకం భవికం భవ్యం కుశలం క్షేమ(మస్త్రియామ్॥) ౧౩౪॥ శస్తం చా

(ధత్రిషు ద్రవ్యే పాపపుణ్య సుఖాది)

మతల్లికా మచర్చికా ప్రకాణ్డ ముద్ఘ తల్లజౌ॥

(ప్రశస్త వాచకా న్యమూ)న్యయ (శ్శుభావహోవిధిః। దైవం దిష్టం భాగధేయం భాగ్యం (స్త్రీ) నియతి ర్విధిః॥

హేతు(ర్నా) కారణం బీజం నిదానం త్వాది కారణమ్। క్షేత్రజ్ఞ ఆత్మాపురుషః ప్రధానం ప్రకృతిః (స్త్రియామ్)॥ ౧౩౫॥

(విశేషఃకాలి) కో ఽవస్థా (గుణా) స్స

శ్వశ్శ్రేయసమ్-శివమ్-భద్రమ్-కల్యాణమ్-మఙ్గళమ్-శుభమ్-భావుకమ్ - భవికమ్ - భవ్యమ్-కుశలమ్ ॥న॥ క్షేమమ్ ॥పు॥-శస్తమ్ ॥న॥ ౧౨-శుభముపేళ్లు, Happiness, happy or right, कल्याण.

ఈ శబ్దములలో పాప పుణ్య శబ్దములు రెండును సుఖశబ్దము మొదలయిన పదుమూఁడుశబ్దములును ద్రవ్యవాచకములైన పుడు మూఁడులింగములయందు వర్తించును.

మతల్లికా - మచర్చికా ॥స్త్రీ॥ - ప్రకాణ్డమ్ ॥న॥ ఉద్ఘః-తల్లజః ॥పు॥ ౫-శ్రేష్ఠవాచకములు, Excellent ones, श्रेष्ठ वाचक. అయః ॥పు॥ ౧-శుభమును జేయు సత్కర్మము పేరు, Good fortune.

దైవమ్-దిష్టమ్-భాగధేయమ్ - భాగ్యమ్ ॥న॥ నియతిః ॥స్త్రీ॥ విధిః ॥పు॥ ౬-పూర్వకృతమైన శుభాశుభకర్మము పేళ్లు, Destiny or luck, भाग्य.

హేతు ॥పు॥ కారణమ్ - బీజమ్ ॥న॥ ౩-కారణము పేళ్లు, A cause, कारण. నిదానమ్-ఆదికారణమ్ ॥న॥ ౨-మొదటికారణము పేళ్లు, A primary cause, मूल कारण. క్షేత్రజ్ఞః - ఆత్మా ॥న్॥ పురుషః ॥పు॥ ౩ - జీవుఁడు, The soul, आत्मा. ప్రధానమ్ ॥న॥ ప్రకృతిః ॥స్త్రీ॥ ౨-ప్రకృతి పేళ్లు, The cause of the material world, प्रकृति.

అవస్థా ॥స్త్రీ॥ ౧-కాలముచేతఁ జేయఁబడిన యౌవనాదిరూపమైన విశేషముపేరు, State

త్త్వంరజస్తమః। జనుర్జనన జన్మాని జని రుత్పత్తి రుద్భవః॥౧౩౮॥

or condition, अवस्था. సత్త్వమ్ - రజః - తమః ॥న్॥న॥ 3-ప్రకృతిగుణములు, Attributes and essential qualities of matter, प्रकृति के गुण. జనుః ॥న్॥ జననమ్ - జన్మ ॥న్॥న॥ జనిః--॥సీ॥ (ప) ॥పు॥ ఉత్పత్తిః ॥సీ॥ ఉద్భవః ॥పు॥ ౬-పుట్టుకపేళ్లు, Birth or production, जन्म.

ప్రాణీతు చేతనో జన్మీ జన్తు జన్యు శరీరిణః। జాతి ర్జాతంచ సామాన్యం వ్యక్తి స్తు (పృథగాత్మికా)౧౩౯॥ చిత్తన్తు చేతో హృదయం స్వాన్తం హృన్మానసం మనః॥

ప్రాణీ ॥న్॥ చేతనః - జన్మీ ॥న్॥ జన్తుః - జన్యుః-శరీరీ ॥న్॥పు॥ ౬-మనుష్యులు మొదలుగాఁగల ప్రాణులపేళ్లు, An animal or sentient being, प्राणी. జాతిః ॥సీ॥ జాతమ్-సామాన్యమ్ ॥న॥ 3 - ఘటత్వాదిజాతిపేళ్లు, Kind or sort, जाति. వ్యక్తిః ॥సీ॥ ౧-పృథగాత్మికా = జాతికాశ్రయమైన ఘటాదివ్యక్తిపేరు, Individuality, व्यक्ति. చిత్తమ్ - చేతః ॥స్॥ హృదయమ్-స్వాన్తమ్-హృత్ ॥ద్॥ మానసంమనః ॥స్॥న॥ ౭ - మనస్సుపేళ్లు, The mind or faculty of reason, मन.

ఇతి కాలవర్గః.

కాలముతోఁజేరిన పదసమూహము ముగిసెను.

---

బుద్ధి ర్మనీషా ధిషణా ధీః ప్రజ్ఞా శేముషీ మతిః॥ ప్రేక్షోపలబ్ధి శ్చిత్సంవి త్ప్రతిపజ్జ్ఞప్తిచేతనాః। ధీ (ర్ధారణావతీ మేధా) సంకల్పః (కర్మమానసమ్॥) ౧౪౧॥

బుద్ధిః-మనీషా-ధిషణా-ధీః-ప్రజ్ఞా - శేముషీ-మతిః-ప్రేక్షా - ఉపలబ్ధిః-చిత్ - సంవిత్ - ప్రతిపత్ ॥ట్॥ జ్ఞప్తిః-చేతనా ॥సీ॥ ౧౪-బుద్ధిపేళ్లు, Understanding or intellect, बुद्धि. మేధా ॥సీ॥ ౧-ధారణావతీ = ధారణాశక్తిగల, ధీః=బుద్ధి, Retentive intellect, A comprehensive mind, धारणा शक्ति. సంకల్పః ॥ పు ॥ మానసంకర్మ = మనోవ్యాపారము,

A resolve, निश्चय. [అవధానం సమాధానం, ప్రణిధానం (తథైవచ) సమాధానం]

చిత్తాభోగో మనస్కార శ్చర్చా సఙ్ఖ్యా విచారణా। అధ్యాహార స్తర్క ఊహో విచికిత్సా తు సంశయః॥ ౧౮౨॥ సన్దేహ ద్వాపరౌ (చాథ)

చిత్తాభోగః - మనస్కారః ॥పు॥ ౨-మనస్సు నిండుకొనియుండుట పేళ్లు, Attention of the mind to its own dealings. చర్చా-సంఖ్యా-విచారణా ॥స్త్రీ॥ 3 - ప్రమాణముచేత నర్థము పరీక్షించుటపేళ్లు, Consideration exercise of judgment, चर्चा. అధ్యాహారః-తర్కః-ఊహః ॥పు॥ 3-తక్కువను పూరించుటకై యెక్కువపదమును దెచ్చుకొనుటకు పేళ్లు, Supplying an ellipsis, कल्पना. అపూర్వముగా నుత్ప్రేక్షించుటకు పేళ్లని కొందఱు, Inferring. విచికిత్సా ॥స్త్రీ॥ సంశయః-సందేహః-ద్వాపరః ॥పు॥ ౪-సందేహము పేళ్లు, Doubt or uncertainty, संशय. [విమర్శో భావనా చైవ వాసనా చ నిగద్యతే]

(సమా) నిర్ణయ నిశ్చయౌ। మిథ్యా దృష్టిర్నాస్తికతా

నిర్ణయః - నిశ్చయః ॥పు॥ ౨-నిశ్చయము పేళ్లు, Certainty, or ascertainment, निश्चय. మిథ్యాదృష్టిః-నాస్తికతా ॥స్త్రీ॥ ౨-పరలోకము లేదను బుద్ధిపేళ్లు, Heresy, or heterodoxy, नास्तिकता.

వ్యాపాదో ద్రోహచిన్తనమ్॥ ౧౮౩॥

వ్యాపాదః ॥పు॥ ద్రోహచిన్తనమ్ ॥న॥ ౨-ద్రోహము తలంచుటపేళ్లు, An injurious design, द्रोहचिंता.

(సమా) సిద్ధాన్తో రాద్ధాన్తో

సిద్ధాన్తః - రాద్ధాన్తః ॥పు॥ ౨-సిద్ధాంతము పేళ్లు, A demonstrated truth, सिद्धान्त.

భ్రాన్తిర్మిథ్యామతిర్భ్రమః॥

భ్రాన్తిః-మిథ్యామతిః ॥స్త్రీ॥ భ్రమః ॥పు॥ ౩-భ్రాంతిపేళ్లు, Error or mistake, गलती. Illusion.

సంవిదాగూః ప్రతిజ్ఞానం నియమాశ్రవసంశ్రవాః॥ ౧౪౪॥ అఙ్గీకారాభ్యుపగమప్రతిశ్రవసమాధయః॥

సంవిత్ ॥ద్॥ అగూః ॥ఊ॥ (ప) ఆగూః ॥ర్, స్త్రీ॥ ప్రతిజ్ఞానమ్ ॥న॥ నియమః-ఆశ్రవః-సంశ్రవః-అఙ్గీకారః-అభ్యుపగమః-ప్రతిశ్రవః-సమాధిః ॥పు॥ ౧౦-అంగీకారముపేళ్లు, An agreement, promise, assent, अंगीकार.

(మోక్షే ధీ) ర్జ్ఞాన

జ్ఞానమ్॥న॥ ౧-మోక్షమునందలి బుద్ధిపేరు. Knowledge which tends to the emancipation of the souls. True knowledge, ज्ञान.

(మన్యత్ర)విజ్ఞానంశిల్పశాస్త్రయోః॥ ౧౪౫॥

విజ్ఞానమ్ ॥న॥ ౧-మోక్షముకంటె వేఱైన శిల్పచిత్రాదిశాస్త్రమునందున్న బుద్ధిపేరు. Knowledge of arts, विज्ञान.

ముక్తిః కైవల్యనిర్వాణశ్రేయోనిశ్శ్రేయసామృతమ్ । మోక్షోఽపవర్గోఽ

ముక్తిః ॥స్త్రీ॥ కైవల్యమ్ - నిర్వాణమ్ - శ్రేయః ॥స్॥ నిశ్శ్రేయసమ్ - అమృతమ్ ॥న॥ మోక్షః-అపవర్గః ॥పు॥ ౮ - మోక్షముపేళ్లు, Beatitude, Absolution or that which tends to exempt the souls from further transmigration, मुक्ति.

థాజ్ఞానమవిద్యాఽహంమతిః స్త్రియామ్॥

అజ్ఞానమ్ ॥న॥ అవిద్యా-అహంమతిః ॥స్త్రీ॥ ౩-అజ్ఞానముపేళ్లు, Spiritual ignorance, अज्ञान.

రూపం శబ్దో గన్ధరసస్పర్శాశ్చ విషయా(అమీ) । గోచరా ఇన్ద్రియార్థాశ్చ హృషీకం వి

విషయాః-గోచరాః - ఇన్ద్రియార్థాః ॥పు, బ॥ ౩ - రూపము-శబ్దము-గంధము-రసము స్పర్శమునను నీ యయిదు విషయములపేళ్లు;

పయాన్ద్రియమ్॥కర్మే న్ద్రియంతు(పాయ్వాది (మనో నేత్రాది) ధీన్ద్రి యమ్॥

Five objects of sense, **विषय.** హృషీకమ్- విషయి ॥న్॥ ఇన్ద్రియమ్ ॥న॥ 3-ఇంద్రియము పేళ్లు, An organ of sense. కర్మేన్ద్రియమ్ ॥న॥ ౧-పాయ్వాదిపాయూపస్థవాక్పాణిపాదముల పేళ్లు. An organ of action, **कर्मेन्द्रिय.** ధీన్ద్రియమ్॥ ౧-మనోనేత్రాది = మనోనేత్రజిహ్వాఘ్రాణత్వక్ శ్రోత్రములపేరు, An intellectual organ, **ज्ञानेन्द्रिय.**

తువరస్తు కషాయో (ఽస్త్రీ) మధురో లవణః కటుః॥ ౧౮౯॥ తిక్తోఽమ్లశ్చ (రసాః పుంసి) (తద్వత్సు షడమీ త్రిషు)

తువరః (పా) తూవరః - కషాయః ॥ప్న॥ ౨ - ఒగరుపేళ్లు, Astringency, **कसैली.** మధురః॥ ౧-తియ్యదనముపేరు, Sweetness, **मीठापन.** లవణః ॥పు॥ ౧-ఉప్పన, Salt taste, **नमकीन.** కటుః ॥పు॥ ౧ - కారము, Pungency, **तीखापन.** తిక్తః ॥పు॥ ౧ - చేఁదు పేరు, Bitterness, **कड्वा.** అమ్లః (ప) అంబ్లః ॥పు॥ ౧ - పుల్లనపేరు, Sourness, **खट्टापन.** ఈ యాఱుశబ్దములును రసవాచకములైనపుడు పుల్లింగములు. ఆ రసముతోఁ గూడిన వస్తువులను జెప్పునపుడు త్రిలింగకములు.

(విమర్దోత్థే) పరిమలో (గన్ధే జనమనోహరే)॥ ౧౯౦॥ ఆమోద (స్సోఽతినిర్హారీ)

పరిమలః ॥పు॥ ౧ - నానాద్రవ్యములను మెదుపుటవలనఁ బుట్టినదై జనులకు మనోహరమైయుండు గన్ధముపేరు, A pleasing scent, **खुशबू.** ఆమోదః ॥పు॥ ౧ - మిక్కిలి దూరముగా వ్యాపించునట్టి యా పరిమళము పేరు, A delightful and strong smell, **गंध.**

(వాచ్యలిఙ్గత్వ) (మాగుణాత్)॥

ఇది మొదలు 'గుణేశుక్లాదయః' అనుచో గల శుక్ల శుభ్రాది శబ్దములవఱకుఁ గల శ మలు విశేష్యముయొక్క లింగమును బొంద నవి.

సమాకర్షీ తు నిర్హారీ సురభి ర్ఘ్రాణతర్పణః॥ ఇష్టగన్ధ స్సుగన్ధి స్స్యా దామోదీముఖవాసనః పూతిగన్ధిస్తు దుర్గన్ధో విస్రం (స్యా) దామగన్ధి(యత్)॥ ౧౫౧॥

సమాకర్షి ॥న్॥ నిర్హారీ ॥న్॥ ౨ - దూ ముగా వ్యాపించు గంధముగల వస్తువు పేరు A scent spreading far, सुरभि. సురభిః ఘ్రాణతర్పణః-ఇష్టగన్ధః-సుగన్ధిః॥ ౪ - మం గంధముగల వస్తువుపేళ్లు, A fragrant sub stance, सुगंध. ఆమోదీ ॥న్॥-ముఖవాసన ౨ - కర్పూరము మొదలయిన ముఖవాసన ద్రవ్యము పేళ్లు, A perfume for th mouth. పూతిగన్ధిః-దుర్గన్ధః॥ ౨-దుర్గంధవ గల వస్తువుపేళ్లు, An ill-smelling sub stance, दुर्गंध. విస్రమ్ - ఆమగన్ధి ॥న్॥ ౨ అపక్వమైన మాంసాదులవంటి గంధముగ వస్తువుపేళ్లు, Smell of raw meat, मां की गंध.

శుక్ల శుభ్ర శుచి శ్వేత విశద శ్యేతపాణ్డరాః। అవదాత స్సితో గౌరో వలక్షో ధవలోఽర్జునః॥

శుక్లః-శుభ్రః-శుచిః-శ్వేతః-విశదః-శ్యేత పాణ్డరః-అవదాతః-సితః-గౌరః-వలక్షః (వ అవలక్షః-ధవలః-అర్జునః॥ ౧౩-తెలుపువర్ణ పేళ్లు, White, सफेद.

హరిణః పాణ్డురః పాణ్డు (రీషత్పాణ్డుస్తు) ధూసరః॥

హరిణః - పాణ్డురః - పాణ్డుః॥ ౩ - తెల పచ్చన కలిసిన వర్ణముపేళ్లు, Yellowi white, पीला. పేరు, Grey, धूसर. ధూ రః ౧-ఈషత్పాణ్డుః=ఇంచుక తెలుపువ

| | |
|---|---|
| కృష్ణే నీలాసిత శ్యామ కాల శ్యామల మేచకాః॥ ౧౫౩॥ | కృష్ణః–నీలః–అసితః–శ్యామః–కాలః– శ్యామలః – మేచకః॥ ౭ – నలుపువర్ణముపేళ్లు, Black, or dark blue, **काला या नील.** |
| పీతో గౌరో హరిద్రాభః పాలాశో హరితో హరిత్। | పీతః–గౌరః–హరిద్రాభః॥ ౩ – పసుపువన్నెపేళ్లు, Yellow, **पीला.** పాలాశః (పా) పలాశః – హరితః – హరిత్॥ ౩–ఆకుపచ్చవర్ణముపేళ్లు, Green, **हरा.** |
| లోహితో రోహితో రక్తశ్శోణః (కోకనదచ్ఛవిః)॥ ౧౫౪॥ (అవ్యక్తరాగ) స్త్వరుణ శ్శ్వేతరక్తస్తు | లోహితః–రోహితః–రక్తః॥ ౩ – ఎఱుపువన్నెపేళ్లు, Red, **लाल.** శోణః ౧–కోకనదచ్ఛవిః = ఎఱ్ఱకలువవంటి కాంతిగల యెఱుపువర్ణము పేరు, Crimson, **लोहित वर्ण.** అరుణః॥ ౧–వ్యక్తముగాని యెఱుపుపేరు, Dark red, **गहरा लाल.** |
| పాటలః। [తామ్రోవిపీతరక్తస్తు పిఞ్జరః పరికీర్తితః] | పాటలః॥ ౧ – తెలుపు నెఱుపుంగూడిన వర్ణముపేరు, Pale red, **पटल.** [తామ్రః–విపీతరక్తః–పిఞ్జరః॥ ౩–పసుపు నెఱుపు కలిసిన వర్ణముపేళ్లు] |
| శ్యావ (స్యా) త్కపిశో | శ్యావః – కపిశః॥ ౨–మర్కటవర్ణమువంటి వర్ణముపేళ్లు, Brown, **भूरा.** |
| ధూమ్ర ధూమలౌ కృష్ణలోహితే॥ ౧౫౫॥ | ధూమ్రః–ధూమలః – కృష్ణలోహితః॥ ౩ – నలుపును నెఱుపును గలిసిన వర్ణముపేళ్లు, Purple, **बैंगनी.** |
| కడారః కపిలః పిఙ్గ పిశఙ్గౌ కద్రుపిఙ్గలౌ॥ | కడారః–కపిలః–పిఙ్గః–పిశఙ్గః–కద్రుః– పిఙ్గలః॥ ౬ – గోరోచనవర్ణమువంటి వర్ణముపేళ్లు, Tawny, **भूरा.** |
| చిత్రకిర్మీరకల్మాష | చిత్రః – కిర్మీరః – కల్మాషః–శబలః–ఏతః– |

శబలైతాశ్చ కర్బురే॥

కర్బురః॥ ౬ - నానావర్ణములపేళ్లు, Vari-gated, रंगो के नाम.

(గుణే శుక్లాదయః పుంసి)

శుక్లశబ్దము మొదలుకొని కర్బురశబ్ద- వఱకు గల ౨౮ శబ్దములును వర్ణవాచక- లైనప్పుడు పుల్లింగములు. వర్ణముగల వ- వును జెప్పునపుడు విశేష్యముయొక్క లింగ- గలవి.

(గుణిలిఙ్గాస్తుతద్వతి)।

ఇతి ధీవర్గః.

బుద్ధితోఁజేరిన పదసమూహము ముగిసెను

---

బ్రాహ్మీతు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ॥ ౧౪౭॥ వ్యాహార ఉక్తిర్లపితం భాషితం వచనం వచః।

బ్రాహ్మీ భారతీ భాషా గీః ॥ర్॥ – వా- చ్॥–వాణీ సరస్వతీ ॥సీ॥ – వ్యాహారః ॥పు- ఉక్తిః ॥సీ॥–లపితమ్–భాషితమ్–వచనమ్–వ- ॥స్॥న॥ ౧౩–వాక్కుపేళ్లు. ఇందులో మొ- యేడు సరస్వతీదేవికిని పేళ్లు, Speec- Goddess of speech, सरस्वती.

అపభ్రంశోఽపశబ్ద (స్స్యాత్)

అపభ్రంశః – అపశబ్దః ॥పు॥ ౨–అపశబ్ద- పేళ్లు. Ungrammatical word or lang- age, अपशब्द.

(చ్ఛాస్త్రే) శబ్దస్తు (వాచికః)॥ ౧౪౮॥

శబ్దః ॥పు॥ ౧ – వ్యాకరణాదిశాస్త్రము- దర్థవాచకముగా వ్యవహరింపఁబడు సుశబ్ద- పేరు, A word, शब्द.

(తిఙ్సుబన్తచయో) వాక్యం (క్రియావాకారకాన్వితా)।

వాక్యమ్ ॥న॥ ౧–తిఙన్తమనఁగా క్రి- సుబన్తమనఁగా శబ్దము కాన నివి సంబం- చిన యర్థముగల పదసమూహము వా- మనంబడును. Sentence, वाक्य. ద్వితీయ

| | |
|---|---|
| | కారకములతోఁ గూడియున్న క్రియయైనను వాక్యమనఁబడును. ॥ఉదా॥ ఘట మానయ. |
| శ్రుతిః (స్త్రీ) వేద ఆ మ్నాయ స్త్రయీ ధర్మస్తు (తద్విధిః)॥ ౧౫౯॥ | శ్రుతిః ॥స్త్రీ॥ - వేదః-అమ్నాయః ॥పు॥ 3-వేదముపేళ్లు, Holy writ, वेद. త్రయీధర్మః ॥పు॥ ౧-తద్విధిః=ఆ వేదమునందుఁ జెప్పఁబడియున్న యజ్ఞాదివిధులపేరు, Duty enjoined by Vedas, वेदविधि. |
| (స్త్రియా) మృక్సాను యజుషీ (ఇతి వేదా | ఋక్ ॥చ్॥స్త్రీ॥-సామ ॥న్॥ యజుః ॥స్॥న॥ 3-వరుసగా ఋక్సామయజుర్వేదములపేళ్లు. |
| స్త్రయ) స్త్రయీ। (శిక్షేత్యాదిశ్రుతే రఙ్గ) | త్రయీ ॥స్త్రీ॥ - మూఁడు వేదముల సమూహము, [శిక్షావ్యాకరణంఛన్దో నిరుక్తం జ్యోతిషం తథా। కల్పశ్చేతి షడఙ్గాని వేదస్యాహుర్మనీషిణః॥] శిక్షా, Pronunciation, उच्चारण. వ్యాకరణమ్, Grammar, व्याकरण. ఛన్దః ॥స్॥న॥ Prosody, छंद. నిరుక్తమ్, Explanation of obscure terms, वेद शब्दों की व्याख्या. జ్యోతిషమ్, Astronomy, ज्योतिष. కల్పః, Religious rites, कर्मकांड. ఈయాఱును వేదాంగములు. |
| మోఙ్కార ప్రణవౌ (సమౌ)॥ ౧౬౦॥ ఇతిహాసః పురావృత్త | ఓంకారః - ప్రణవః ॥పు॥ ౨- ప్రణవము పేళ్లు. ఇతిహాసః ॥పు॥ - పురావృత్తమ్ ॥న॥ ౨-భారతము మొదలైన యితిహాసములు. Heroic history, इतिहास. |
| (ముదాత్తాద్యా స్త్ర యః) స్వరాః। | స్వరాః ॥పు, బ॥ ౧-ఉదాత్తాద్యాః=ఉదాత్తానుదాత్త స్వరితములు పేరు. Acute, |

grave or circumflex accents, उच्चारण भेद.

ఆన్వీక్షికీ దణ్డనీతి (స్తర్క విద్యార్థ శాస్త్రయోః)॥ ౧౬౧॥

ఆన్వీక్షికీ ॥సీ॥ ౧ - గౌతమాది ప్రణీతమైన తర్కశాస్త్రమునకు Logic, तर्क दణ్డనీతిః ॥సీ॥ ౧ - చాణక్యాది ప్రణీతమైన నీతిశాస్త్రమునకును Politics, राजनीति, పేరు.

ఆఖ్యాయికోపలబ్ధార్థా

ఆఖ్యాయికా-ఉపలబ్ధార్థా ॥సీ॥ ౨-ఎఱుఁగఁబడిన యర్థము-అనఁగా సత్యమైన విషయము గలిగిన హర్షచరితమువంటి కృతి, A true or probable story, कहानी.

పురాణం పఞ్చలక్షణమ్ [సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వన్తరాణి చ । వంశానుచరితం చేతి లక్షణానాం తు పఞ్చకమ్]

పురాణమ్-పఞ్చలక్షణమ్ ॥న॥ ౨ సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము అనెడి పంచలక్షణములతోఁ గూడిన మాత్స్యాది పురాణముల పేళ్లు, Theogony under five heads; the creation; the destruction and renovation of worlds; genealogy of gods and heroes; the reigns of Manus; and the transactions of their descendants, पुराण.

ప్రబన్ధకల్పనా కథా

ప్రబన్ధకల్పనా-కథా ॥సీ॥ ౨-ఇంచుక సత్యమైన యర్థముగల కాదంబర్యాది రచనలపేళ్లు, A feigned story, प्रबन्ध.

ప్రవహ్లికా ప్రహేలికా॥ ౧౬౨॥

ప్రవహ్లికా - ప్రహేలికా ॥సీ॥ ౨-గూఢార్థముగల ప్రబన్ధము పేళ్లు, A riddle, गूढार्थ प्रबन्ध.

| | |
|---|---|
| స్మృతిస్తు ధర్మసంహితా. | స్మృతిః - ధర్మసంహితా ॥స్త్రీ॥ ౨ - మానవాది ధర్మశాస్త్రములపేళ్లు, A code of laws, धर्म शास्त्र. |
| సమాహృతిస్తు సఙ్గ్రహః। | సమాహృతిః ॥స్త్రీ॥ - సంగ్రహః ॥పు॥ ౨ - అనేకస్థలములయందుండు నర్థముల నొకటిగాఁ గూర్చిన గ్రంథము. A compilation and abridgment, संग्रह. |
| సమస్యాతు సమాసార్థా | సమస్యా-సమాసార్థా ॥స్త్రీ॥ ౨ - కవిశక్తిపరిజ్ఞానార్థమై యియ్యంబడు పద్యాంశముపేళ్లు, A part of a stanza, समस्या. |
| కింవదన్తీ జనశ్రుతిః॥ | కింవదన్తీ - జనశ్రుతిః ॥స్త్రీ॥ ౨ - లోకప్రవాదముపేళ్లు, rumour, किंवदन्ती. |
| వార్తాప్రవృత్తిర్వృత్తాన్త ఉదన్తస్స్యా దథాహ్వయః। ఆఖ్యాహ్వే అభిధానంచ నామధేయంచ నామచ॥ | వార్తా ప్రవృత్తిః ॥స్త్రీ॥-వృత్తాన్తః-ఉదన్తః॥పు॥ ౪-వృత్తాంతముపేళ్లు, Tidings (News,) समाचार.<br><br>ఆహ్వయః ॥పు॥-ఆఖ్యా-ఆహ్వా ॥స్త్రీ॥ - అభిధానమ్-నామధేయమ్-నామ ॥న్॥న॥ ౭-నామధేయముపేళ్లు, A name or appellation, नाम. |
| హూతి రాకారణాఽహ్వానం | హూతిః-ఆకారణా ॥స్త్రీ॥ - ఆహ్వానమ్ ॥న॥ 3 - పిలుచుటపేళ్లు, A call or summons, आह्वान. |
| సంహూతి (ర్బహుభిః కృతా) | సంహూతిః ॥స్త్రీ॥ ౧ - బహుభిఃకృతా = పెక్కండ్రుచేరి పిలుచుటపేరు, Clamour of Citation by many at once, बहुत लोगों |

| | |
|---|---|
| వివాదో వ్యవహార (స్స్యా) | వివాదః-వ్యవహారః ॥పు॥ ౨-తగవు పే A contest or law suit, विवाद ; मुकद्द |
| దుపన్యాస స్తు వా ఙ్ముఖమ్॥ ౧౬౫॥ | ఉపన్యాసః ॥పు॥ - వాఙ్ముఖమ్ ॥న॥ ౨ వాక్యారంభము పేళ్లు, The exordiu प्रस्तावना. |
| ఉపోద్ఘాత ఉదాహారః | ఉపోద్ఘాతః - ఉదాహారః ॥పు॥ (ప) ఉ హరణమ్॥ ౨ - ఉదాహరించుట పే An example, Introduction, Prefa उदाहरण. |
| శపనంశపథఃపుమాన్। | శపనమ్ ॥న॥ శపథః ॥పు॥ ౨ - ఒట్టుపె కొనుట, An oath, प्रण. |
| ప్రశ్నోఽనుయోగః పృచ్ఛాచ | ప్రశ్నః - అనుయోగః ॥పు॥ పృచ్ఛా ॥ 3-అడుగుటపేళ్లు, A question, प्रश्न. |
| ప్రతివాక్యోత్తరే (సమే)॥ ౧౬౬॥ | ప్రతివాక్యమ్ - ఉత్తరమ్ ॥న॥ ౨-ఉత్త మిచ్చుట పేళ్లు, An answer, उत्तर. |
| మిథ్యాభియోగోఽ భ్యాఖ్యాన | మిథ్యాభియోగః ॥పు॥ - అభ్యాఖ్యాన ॥న॥ ౨-లేనిదాని నాక్షేపించుట, A groun less demand, मिथ्यारोप. |
| (మథ) మిథ్యాభి శంసనమ్। అభిశాపః | మిథ్యాభిశంసనమ్ ॥న॥ అభిశాపః ॥ ౨-లేనిదోషమును పైఁబెట్టుట పేళ్లు, A fal accusation, मिथ्याभियोग. |
| ప్రణాదస్తు (శబ్ద స్స్యాదనురాగజః)॥ ౧౬౭॥ | ప్రణాదః ॥పు॥ ౧ - అనురాగజః = అ రాగమువలనఁ బుట్టిన, శబ్దః = శబ్దముపేర A sound indicating affection, प्रेमोत्पाद शब्द. |
| యశః కీర్తి స్సమ | యశః ॥స॥-కీర్తిః-సమజ్ఞా (పా) సమాఖ్యా |

| | |
|---|---|
| ...ష్టాచ | ॥స్త్రీ॥ 3 - కీర్తిపేళ్లు, Fame, reputation, कीर्ति. |
| స్తవః స్తోత్రం స్తు ...ర్నుతిః। | స్తవః ॥పు॥ - స్తోత్రమ్ ॥న॥ - స్తుతిః-నుతిః ॥స్త్రీ॥ ర-స్తోత్రముపేళ్లు, Praise, प्रशंसा. |
| ఆమ్రేడితం (ద్వి స్త్రిరుక్తం) | ఆమ్రేడితమ్ ॥న॥ ౧ - ద్విః త్రిః ఉక్తమ్ = (హర్షాదులచేత) రెండుమూఁడు మాఱులు పలుకఁబడిన శబ్దముపేరు, Repetition, दोहराव. |
| ...ముచ్చైర్ఘుష్టం తు ...ఘోషణా॥ ౧౬౮॥ | ఉచ్చైర్ఘుష్టమ్ ॥న॥ - ఘోషణా ॥స్త్రీ॥ ౨- గట్టిగాఁబలుకుట పేళ్లు, Making a loud noise, चिल्लाहट, घोषणा. |
| కాకుః (స్త్రియాం ...కారో య శ్శోకభీ ...త్యాదిభి ర్ధ్వనేః)। | కాకుః ॥స్త్రీ॥ ౧ - శోకభీత్యాదిభిః ధ్వనేః వికారః = శోకభయాదులచేత నయిన ధ్వని యొక్క వికారముపేరు, Change of voice in grief, fear, &c. ध्वनि भेद. |
| అవర్ణాక్షేప నిర్వా... పరీవా దాపవాద ...వత్)॥ ౧౬౯॥ ఉప ...క్రోశో జుగుప్సాచ కు...త్సా నిన్దాచ గర్హణే। | అవర్ణః-ఆక్షేపః-నిర్వాదః-పరీవాదః-(పా) పరివాదః-అపవాదఃఉపక్రోశః ॥పు॥-జుగుప్సా- కుత్సా-నిన్దా ॥స్త్రీ॥-గర్హణమ్ ॥న॥ ౧౦-నిందపేళ్లు, Censure, blame, or contempt, घृणा. |
| పారుష్య మతివాద... ...ప్స్యాత్) | పారుష్యమ్ ॥న॥-అతివాదః ॥పు॥ ౨-అప్రియముగాఁ బలుకుట పేళ్లు, Opprobrious speech, कटुवचन. |
| భర్త్సనం (త్వపకా... ...గీః)॥ ౧౭౦॥ | భర్త్సనమ్ ॥న॥ ౧ - అపకారగీః=పరునికి భయమును బుట్టించు నపకారవాక్యముపేరు, Menace, फटकार. |



| | |
|---|---|
| (యస్సనిన్ద ఉపాలమ్భ స్తత్ర)స్యా)త్పరిభాషణమ్। | పరిభాషణమ్ ॥న॥ ౧ - నిందతోఁగూడిన యుపాలంభముపేరు. ఉపాలంభమనిన ఎత్తిపొడుచుట, మర్మము దూఱనాడుట, Reproof attended with insult or discouragement, ताना. |
| (తత్ర) త్వాహారణా (యస్స్యా ద్దాక్రోశో మైథునం ప్రతి)॥ ౧౭౧॥ | ఆహారణా ॥స్త్రీ॥ (ప) ఆహారణమ్ ॥న॥ ౧- మైథునం ప్రతియః ఆక్రోశః తత్రస్యాత్ =పరస్త్రీపురుషసంయోగనిమిత్తమువలనఁ గలుగు నిందపేరు, A calumnious accusation of adultery, व्यभिचार—निन्दा. |
| (స్యా) దాభాషణమాలాపః | ఆభాషణం ॥న॥ ఆలాపః ॥పు॥ ౨-గమనాగమనాది సమయమునందలి మంచిమాటపేళ్లు, Speaking of addressing, आलाप. |
| ప్రలాపో౽(నర్థకం వచః)। | ప్రలాపః ॥పు॥ ౧ - అనర్థకంవచః = అప్రయోజకమైన మాటపేరు, Incoherent speech, बकवाद प्रलाप. |
| అనులాపో (ముహుర్భాషా) | అనులాపః ॥పు॥ ౧ - ముహుర్భాషా=పలుమాఱు పలుకుటపేరు, Repetition, tautology, दोहराना. |
| విలాపః పరిదేవనమ్॥ ౧౭౨॥ | విలాపః ॥పు॥-పరిదేవనమ్ ॥న॥ ౨-దుఃఖముతోడిమాటపేళ్లు, Lamentation, विलाप. |
| విప్రలాపో (విరోధోక్తి) | విప్రలాపః ॥పు॥ ౧-విరోధముగఁ బలుకుటపేరు, Quarrel or mutual contradiction, विरोध करना. |
| స్సంలాపో (భాషణం మిథః)। | సంలాపః (పా) సల్లాపః ॥పు॥ ౧-ప్రీతిచేతఁ బరస్పరము సంభాషించుట పేరు, Conversation, वार्तालाप. |

సుప్రలాప స్సువచన
అపలాపస్తు నిహ్నవః॥

సందేశవా గ్వాచి
ం (స్యాత్)

(వాగ్భేదాస్తు త్రి
సూత్తరే)।

రుశతీ (వాగకళ్యా
ణీస్యా) త్కల్యాతు శు
ాత్మికా॥ ౧౭౪॥ (అ
్యర్థమధురం) సాన్త్వం
ంగతం హృదయంగ
మమ్। నిష్ఠురం పరుషం
గ్రామ్య మశ్లీలం సూ
ృతం (ప్రియే॥౧౭౫॥
త్యేఽథ) సఙ్కులక్లి
ష్టే (పరస్పరపరాహ
తే। లుప్తవర్ణపదం గ్ర
స్తం నిరస్తం (త్వరి
తోదితమ్)॥ ౧౭౬॥

సుప్రలాపః ॥పు॥ - సువచనమ్ ॥న॥ ౨-పరిశుద్ధమైన మాటపేరు, Elegant discourse, शुद्ध वार्तालाप.

అపలాపః-నిహ్నవః ॥పు॥ ౨-మోసపుచ్చుమాట, Denial or concealment of knowledge, अपलाप.

సందేశవాక్ ॥చ్, స్త్రీ॥ - వాచికమ్ ॥న॥ చెప్పిపంపుమాట పేళ్లు, A verbal message, संदेश.

రుశతీశబ్దము మొదలు సఙ్కులశబ్దమువఱకు వాగ్విశేషములు ॥త్రి॥

రుశతీ-(పా) ఉశతీ ॥స్త్రీ॥ ౧ - అకల్యాణీ= అశుభమైనవాక్కు, Unauspicious discourse, अशुभ संवाद. కల్యా॥ ౧ - శుభాత్మికా = శుభమైన వాక్కు, Auspicious discourse, शुभ संवाद. సాన్త్వమ్॥౧-అత్యర్థమధురమ్ = మిక్కిలి ప్రియమైనవాక్యము, Sweet and conciliating, मधुर संवाद. సంగతమ్-హృదయంగమమ్ ॥న॥ ౨ - మనస్సునకు సరిపోయిన వాక్యము, Apposite and proper, संगत वात. నిష్ఠురమ్ - పరుషమ్ ॥న॥ ౨-కఠినమైనమాట, Harsh, परुष वचन. గ్రామ్యమ్-అశ్లీలమ్॥ ౨ - పామరజనవాక్యము, Vulgar coarse, अश्लील वार्ता. సూనృతమ్॥ ౧ - ప్రియేసత్యే = ప్రియమును సత్యమునైన వాక్యము, Pleasing and true, सत्य व प्रिय वचन. సఙ్కులమ్-క్లిష్టమ్॥ ౨ - పరస్పరపరా

హాతే = పూర్వోత్తరవిరుద్ధమైన వాక్యము, Inconsistent, असंबद्ध. గ్రస్తమ్॥ ౧-లుప్త వర్ణపదమ్ = అశక్త్యాదులచేత వర్ణముగాని పదముగాని లోపించినవాక్యము, Imperfectly pronounced, अस्पष्ट उच्चरित वाक्य. నిరస్తమ్॥ ౧ - త్వరితోదితమ్ = త్వరచేతఁ బుట్టిన వాక్కు, Spoken fast, शीघ्र कही वार्ता.

అబ్యాకృతం (సనిష్ఠీవ) మబద్ధం స్యాదనర్థకమ్। అనక్షర మవాచ్యం స్యా దాహతంతు మృషార్థకమ్॥ ౧౭౭॥ (అథ) మ్లిష్టమవిస్పష్టం వితథం (త్వనృతంవచః)। (సోల్లుణ్ఠనంతు సోత్ప్రాసం ఘుణితం రతికూజితమ్।) సత్యం తథ్యమృతం సమ్యగ్ (అమూని త్రిషుతద్వతి) ॥౧౭౮॥

ఇతి వాగ్వర్గః

అమ్యాకృతమ్॥ ౧-సనిష్ఠీవమ్=తుంపురులతోఁ గూడినవాక్యము, Sputtered, क्रोध से कही वार्ता. అబద్ధమ్-అనర్థకమ్॥ ౨-పొసఁగని మాట, Unmeaning discourse, असंगत वार्ता. అనక్షరమ్-అవాచ్యమ్॥ ౨-ఉచ్చరింపరాని తిట్టు, Unfit to be uttered, अनुचित वार्ता. ఆహతమ్ - మృషార్థకమ్॥ ౨ - మిక్కిలియు నసంభావితమైన యర్థముగలమాట, An assertion of impossibility, असंभव वार्ता. మ్లిష్టమ్-అవిస్పష్టమ్॥ ౨-అర్థము తెలియరానిమాట, An indistinct speech, अस्पष्ट वार्ता. వితథమ్॥ ౧-అనృతమ్ వచః= అసత్యవాక్కు, Falsehood, झूठ. సత్యమ్-తథ్యమ్ - ఋతమ్ - సమ్యక్ ॥చ్॥ ౪ - సత్యవాక్కు, Truth, सत्य. ఈ సత్యాది శబ్దములు నాలుగును సత్యవాక్కుగల వస్తువును జెప్పునపుడు ॥త్రి॥

వాక్కుతోఁ జేరిన పదసమూహము ముగిసెను.

శబ్దేనినాద నినదధ్వని ధ్వానరవస్వనాః। స్వాననిర్ఘోష నిర్హ్రాద నాదనిస్వాననిస్వనాః॥ ఆరవారావ సంరావ విరావా

శబ్దః-నినాదః-నినదః-ధ్వనిః-ధ్వానః-రవః-స్వనః - స్వానః - నిర్ఘోషః - నిర్హ్రాదః-నాదః-నిస్వానః-నిస్వనః-ఆగవః-ఆరావః - సంరావః-విరావః - ॥పు॥ ౧౭ - మ్రోఁతపేళ్లు, Sound, ध्वनि.

(అథ) మర్మరః। (స్వనితే వస్త్రపర్ణానాం) (భూషణానాం తు) శిఞ్జితమ్

మర్మరః ॥పు॥ ౧-వస్త్రపర్ణానామ్ - స్వనితే = కోకలు ఆకులు వీనిమ్రోఁత, Rustling, खडखडाहट. శిఞ్జితమ్ ॥న॥ (పా) శింజా ॥స్త్రీ॥ ౧ - భూషణములధ్వని, The tinkling of ornaments, नूपर ध्वनि.

నిక్వాణో నిక్వణః క్వాణః కణః క్వణన (మిత్యపి)।

నిక్వాణః - నిక్వణః - క్వాణః-క్వణః ॥పు॥- క్వణనమ్ ॥న॥ ౫ - వీణాదిసకలవాద్య ధ్వనులపేళ్లు, A tone or musical sound, मधुर ध्वनि.

వీణాయాః క్వణతేః ప్రాదేః ప్రక్వాణ ప్రక్వణాదయః॥ ౧౮౧॥

ప్రాదేః క్వణతేః (నిష్పన్నాః) = ప్ర అను నది మొదలయిన యుపసర్గలకుం బరమైన క్వణధాతువుమీఁదఁ బుట్టిన, ప్రక్వాణ ప్రక్వణాదయః = ప్రక్వాణ ప్రక్వణాది శబ్దములు, వీణాయాః=వీణయొక్క, స్వనితే = ధ్వనియందు వర్తించును. The sound of lute, वीणा की ध्वनि.

కోలాహలః కలకల

కోలాహలః - కలకలః ॥పు॥ ౨-గుంపులోఁ బుట్టిన గొప్పరొదపేళ్లు, A confused sound, कोलाहल.

(స్త్రిరశ్చాం) వాశితం రుతమ్।

వాశితమ్ - రుతమ్ ॥న॥ ౨ - తిరశ్చామ్ = మృగపక్ష్యాదులయొక్క ధ్వనిపేళ్లు, The cry of birds &c. पक्षियों की बोली.

(స్త్రీ) ప్రతిశ్రుత్ప్రతిధ్వానే

ప్రతిశ్రుత్ ॥స్త్రీ॥-ప్రతిధ్వానః ॥పు॥ ౨-ప్రతిధ్వని పేర్లు, An echo, प्रतिध्वनि.

గీతం గాన(మిమే సమే)॥ ౧౮౧

గీతమ్-గానమ్॥న॥౨-పాటపేర్లు, Singing, गाना.

ఇమే = ఈరెండును, సమే=సమార్థకములు.

ఇతి శబ్దాదివర్గః

శ్రోత్ర మొదలైన పదసమూహము ముగిసెను.

---

నిషాదర్షభ గాన్ధార షడ్జమధ్యమ ధైవతాః। పఞ్చమ (శ్చేత్యమీసప్త తన్త్రీ) కణ్ఠోత్థితా స్స్వరాః)॥ ౧౮౩॥

నిషాదః - ఋషభః-గాన్ధారః-షడ్జః-మధ్యమః-ధైవతః-పఞ్చమః ॥పు॥ ౭-అమీసప్త = ఈయేడును, తన్త్రీకణ్ఠోత్థితాః=వీణయందును కంఠమునందును బుట్టు, స్వరాః = స్వరముల పేర్లు. The seven musical notes, संगीत के सात स्वर.

[షడ్జం మయూరో వదతి గావస్త్వృషభభాషిణః। అజావికంతు గాన్ధారం క్రౌఞ్చః క్వణతి మధ్యమమ్॥ పుష్పసాధారణే కాలే పికః కూజతి పఞ్చమమ్। ధైవతం హేషతే వాజీ నిషాదం బృంహతే గజః॥ మయూరాదయ ఏతే హి మత్తా గాయన్తి పఞ్చమమ్॥] అధికపాఠము.

కాకలీ (తుకలేసూక్ష్మే)

కాకలీ ॥స్త్రీ॥ ౧-సూక్ష్మేకలే=సూక్ష్మమైన కలధ్వని పేరు, Minute tone, धीमी आवाज़.

(ధ్వనౌతు మధురాస్ఫుటే)।కలోమన్ద్రస్తు (గమ్భీరే) తారోఽ(త్యుచ్చై) స్త్రయ

కల.॥ ౧ - మధురాస్ఫుటే ధ్వనౌ=శ్రోత్ర సుఖమును అస్పష్టవర్ణమునైన ధ్వని పేరు, An inarticulate but sweet tone, अस्पष्ट पर मधुर ध्वनि. మన్ద్రః॥ ౧-గమ్భీరే=గంభీ

స్త్రీషు॥ ౧౮౪॥

రధ్వని పేరు, A low tone, धीमी आवाज़.
తారః॥ ౧-అత్యుచ్చైః = మిక్కిలియు నధిక మైన ధ్వని పేరు, A high tone, ऊँची ध्वनी.

ఈ మూఁడు శబ్దములును త్రిలింగకములు.

[నృణామురసి మధ్యస్థో ద్వావింశతివిధో ధ్వనిః। సమన్ద్రః కణ్ఠమధ్యస్థ స్తార శ్శిరసి గీయతే॥]

సమన్వితలయస్త్వేక తాలో

సమన్వితలయః-ఏకతాలః ॥పు॥ ౧-నృత్త గీతవాద్యములను సరిగా ముగించుట పేళ్లు, Harmony, अनुरूपता.

వీణాతువల్లకీ। విపఞ్చీ

వీణా-వల్లకీ-విపఞ్చీ ॥స్త్రీ॥ 3 - వీణపేళ్లు, A lute, वीणा.

(సాతుతన్త్రీభి స్సప్త భిః) పరివాదినీ॥ ౧౮౫॥

పరివాదినీ ॥స్త్రీ॥ ౧-సప్తభిః తన్త్రీభిః యుక్తా సా=ఏడుతంతులతోఁ గూడిన యా వీణపేళ్లు, A lute with seven strings, सात तारों की वीणा.

తతం (వీణాదికం వాద్య) మానద్ధం (మురజాదికమ్)। (వంశాదికంతు) సుషిరం (కాంస్య తాలాదికం ఘనమ్॥ ౧౮౬॥
(చతుర్విధ మిదం) వాద్యం వాదిత్రాతోద్య నామకమ్।

తతమ్ ॥న॥ ౧-వీణ మొదలైన తంత్రీవాద్యము, Any stringed instrument, एक बाजा. ఆనద్ధమ్ ॥న॥ ౧-మద్దెల మొదలయిన చర్మవాద్యము, A drum or tympan, मृदंग आदि चर्म से बने वाद्य. సుషిరమ్ ॥న॥ ౧-పిల్లనగ్రోవి మొదలైన ముఖవాద్యము, A wind instrument, मुरली. ఘనమ్ ॥న॥ ౧ - తాళము మొదలయిన కంచువాద్యముల పేరు, A cymbal bell &c. वाद्यविशेष.

వాద్యమ్ - వాదిత్రమ్ - ఆతోద్యమ్ ॥న॥ 3- పూర్వోక్త చతుర్విధవాద్యముల పేళ్లు, A musical instrument, एक वाद्य.

| | |
|---|---|
| మృదఙ్గా మురజా | మృదఙ్గాః-మురజాః ॥పు॥ ౨-మద్దెలపేళ్లు, Drums and tabours, मृदंग. |
| (భేదా) స్త్వఙ్క్యాలి ఙ్గోర్ధ్వకా(స్త్రయః) | అఙ్క్యః-ఆలిఙ్గ్యః-ఊర్ధ్వకః (పా) ఊర్ధ్కః ॥పు॥ ౩ - మద్దెలయొక్క భేదములు, Three sorts of drums, मृदंग के तीन भेद |
| (స్యా) ద్యశఃపట హో ఢక్కా భేరీ(స్త్రీ) దున్దుభిః (పుమాన్) । ఆనకః పటహో (౽స్త్రీ) స్యా | యశః - పటహః ॥పు॥ - ఢక్కా ॥స్త్రీ॥ ౨-డవిణపేళ్లు, A double drum, मृदंग विशेष. భేరీ ॥స్త్రీ॥ - దున్దుభిః ॥పు॥ ౨ - భేరిపేళ్లు, A kettle-drum, भेरी. ఆనకః-పటహః ॥పు॥ ౨ - తమ్మటపేళ్లు, A large kettle-drum, नगारा. |
| త్కోణో (వీణాది వాదనమ్)॥ ౧౮౦॥ | కోణః ॥పు॥ ౧ - వీణాదివాదనమ్ = వీణ మొదలయినవానిని వాయించు కోడుపుపేరు, Bow, कमान. |
| (వీణాదణ్డః) ప్రవాల (స్స్యాత్) | ప్రవాలః ॥పు॥ ౧-వీణయొక్క యొళపుపేరు, The neck of lute, सितार की लकड़ी. |
| కకుభస్తు ప్రసేవకః । | కకుభః - ప్రసేవకః ॥పు॥ ౨ - వీణయొక్క కరివెపేళ్లు, The belly below the neck of a lute, सितार का बड़ा भाग. |
| కోలమ్బక (స్తుకాయో౽స్యా) ఉపనాహో నిబన్ధనమ్॥ ౧౮౧॥ | కోలమ్బకః ॥పు॥ ౧ - వీణతంత్రి ఒళగు మొదలయిన శరీరముపేరు, A body of the lute, वीणा का भाग. ఉపనాహః ॥పు॥-నిబన్ధనమ్ ॥న॥ ౨-వీణ తంత్రి కట్టుచోటికిని బిరడలకును పేళ్లు, The tie. |
| (వాద్యప్రభేదా) డమరు మడ్డుడిణ్డిమ ఝర్ఝరాః।మర్దలఃపణ | డమరుః-మడ్డుః-డిణ్డిమః-ఝర్ఝరః - మర్దలః-పణవః ॥పు॥ ౬ - వరుసగా డమరుగము-గుమ్మెట - రాయగిడిగిళ్లు - కైమళ్లు-మద్దెల- |

గౌ౭(న్యేచ)

ఉడుక అను వాద్యభేదముల పేళ్లు, అన్యేచ అనుటచే గోముఖాదివాద్యభేదములుం గలవని భావము.

నర్తకీ లాసికే (సమే)॥ ౧౯౦॥

నర్తకీ-లాసికా ॥స్త్రీ॥ ౨-ఆడునట్టి స్త్రీ పేళ్లు, A female dancer, नर्तकी.

(విలమ్బితం ద్రుతం మధ్యం) తత్త్వ మోఘో ఘనం (క్రమాత్)॥

తత్త్వం ॥న॥-ఓఘః ॥పు॥-ఘనమ్ ॥న॥ ఈ 3 ను వరుసగా నృత్తగీత వాద్యములయొక్క-విలంబ ద్రుత మధ్యమానముల పేళ్లు, Slow, quick and mean time, संगीत, नृत्य, वाद्य के समय का परिमाण.

తాలః (కాలక్రియామానమ్)

తాలః ॥పు॥ ౧-కాలమునకును హస్తకుంచనప్రసరణాదిక్రియకును గలిగిన ప్రమాణము, Beating time, ताल.

లయ (స్సామ్య) (మథా స్త్రియామ్)॥ ౧౯౧॥

లయః ॥పు॥ ౧-సామ్యమ్=నృత్తగీతవాద్యములు సమముగానుండుట పేరు, Equal time in music and dance, लय.

తాణ్డవం నటనం నాట్యం లాస్యం నృత్యంచ నర్తనమ్।

తాణ్డవమ్ ॥పు॥ - నటనమ్-నాట్యమ్-లాస్యమ్-నృత్యమ్ (పా) నృత్తమ్-నర్తనమ్ ॥న॥ ౬-ఆటపేళ్లు, Dancing, नृत्य.

తౌర్యత్రికం (నృత్యగీతవాద్యం) నాట్య (మిదంత్రయమ్)॥ ౧౯౨

తౌర్యత్రికమ్-నాట్యమ్ ॥న॥ ౨-నృత్యగీత వాద్యములు మూఁడును కూడుట పేళ్లు, Symphyon or union of song; dance and instrumental music, संगीत, नृत्य व वाद्य का सम्मेलन.

భ్రకుంసశ్చ భ్రుకుంశశ్చ భ్రూకుంస (శ్చేతి నర్తకః। స్త్రీవేషధారీ

భ్రకుంసః-భ్రుకుంసః-భ్రూకుంసః ॥పు॥ 3 - స్త్రీ వేషధారీ=స్త్రీ వేషధారియైన, నర్తకః=నృత్యముచేయు, పురుషః = పురుషుని పేళ్లు,

పురుషో)

(నాట్యోక్త్యా)

గణికాఽజ్జుకా॥ ౧౩॥ (భగినీపతి) రావుత్తో భావో (విద్వాన) భావుకః। (జనకో యువరాజస్తు) కుమారో భర్తృదారకః॥ ౧౪॥ (రాజా) భట్టారకో దేవ (స్తత్సుతా) భర్తృదారికా । దేవీ (కృతాభిషేకాయా) (మితరాసుతు) భట్టినీ॥ ౧౫॥ అబ్రహ్మణ్య (మవధ్యోక్త్యా) (రాజ్ఞస్స్యాలస్తు) రాష్ట్రియః। అమ్బా (మాతాఽథ బాలాస్యా) ద్వాసూ (రార్యస్తు) మారిషః॥ ౧౬॥ అత్తికా (భగినీజ్యేష్ఠా) నిష్ఠానిర్వహణే (సమే) హణ్డే హఞ్జే హలాఽ

A male dancer in woman's apparel, स्त्री वेष से नाचनेवाला पुरुष.

నాట్యోక్త్యా = నాట్యపరిభాషయందు అనఁగా అజ్జుకాశబ్దము - మొదలు "అజ్జుకసాత్త్వికే" అనువఱకు ముందు చెప్పఁబడు పేళ్లు నాట్య పరిభాషయందు వర్తించుననుట, Theatrical language नाटकीय भाषा.

అజ్జుకా (పా) అజ్జుకా ॥స్త్రీ॥ ౧ - వేశ్య, A courtesan, वेश्या. ఆవుత్తః॥పు॥౧-తోడఁబుట్టినదానిమగఁడు. బావ Brother-in-law. ॥పు॥ ౧-విద్వాంసుడు. ఆవుకః ॥పు॥ ౧-తండ్రి. కుమారః-భర్తృదారకః ॥పు॥ ౨-యువరాజు, భట్టారకః-దేవః ॥పు॥ ౨-రాజు, భర్తృదారికా ॥స్త్రీ॥ ౧-ఆ రాజుకూఁతుపేరు. దేవీ ॥స్త్రీ॥ ౧-పట్టాభిషిక్తురాలైన రాణిపేరు, Queen, रानी. భట్టినీ ॥స్త్రీ॥ ౧ - తక్కినరాజుభార్యల పేరు. అబ్రహ్మణ్యమ్ ॥న॥ ౧ - చంపఁదగని వాఁడనుమాట Alas! woe. రాష్ట్రియః॥ పు॥ ౧-రాజు బావమఱఁదిపేరు. అమ్బా ॥స్త్రీ॥ ౧-తల్లిపేరు. వాసూః ॥స్త్రీ॥ ౧ - చిన్నపడుచు పేరు. మారిషః ॥పు॥ ౧ - పూజ్యునిపేరు. అత్తికా (పా) అన్తికా ॥స్త్రీ॥ ౧ - అక్కపేరు. నిష్ఠా ॥స్త్రీ॥ నిర్వహణమ్ ॥న॥ ౨-నాటకకథను ముగించుట, The catastrophe or conclusion, नाटक का अंत. హణ్డే-హఞ్జే-హలా॥ అవ్య॥ ఈ 3 ను వరుసగా నీచురాలిని దాసిని చెలికత్తెనుగూర్చి పిలుచుట. అఙ్గహారః - అఙ్గవిక్షేపః ॥పు॥ ౨ - ఆడుసప్పుడు శరీరమును

(హ్వానే నీచాం చేటీం సఖీంప్రతి)॥ అఙ్గహారో ఽఙ్గవిక్షేపో వ్యఞ్జకాభినయౌ(సమౌ)।(నిర్వృత్తే త్వఙ్గసత్త్వాభ్యాం ద్వేత్రి) ష్వాఙ్గికసాత్త్వికే॥ శృఙ్గారవీరకరుణాద్భుత హాస్య భయానకాః। బీభత్సరౌద్రే (చరసాః)

కదిలించుట, Gesture, हाव भाव. వ్యఞ్జకః-అభినయః ॥పు॥ ౨-హస్తవిన్యాసాదులచే భావార్థమును తెలుపుట, Indication of a passion, अभिनय. ఆఙ్గికమ్ - సాత్త్వికమ్ ॥త్రి॥ ౨-కనుబొమలు మొదలైన యంగములచేతను, Assumed bodily posture, मुखभाव. మనోవృత్తి రూపమయిన సత్త్వముచేతను, Sincere emotion, सात्विक भाव. పుట్టింపఁబడిన క్రియలకును స్వేదరోమాంచాదులకును పేళ్లు, Tokens, संचारी भाव. శృఙ్గారః - వీరః - కరుణః-అద్భుతః-హాస్యః-భయానకః ॥పు॥ - బీభత్సమ్ - రౌద్రమ్ ॥న॥ ౮-రసముల పేళ్లు, Tastes or sentiments, रस. శాన్తః, Devotion and resignation, शांति. వాత్సల్యః, Parental affection, वात्सल्य

శృఙ్గారశ్శుచిరుజ్జ్వలః॥ ౧౯౯॥

శృఙ్గారః-శుచిః-ఉజ్జ్వలః ॥పు॥ ౩ - శృంగారరసము పేళ్లు, Love, शृंगार.

ఉత్సాహవర్ధనో వీరః

ఉత్సాహవర్ధనః-వీరః ॥పు॥ ౨-వీరరసము పేళ్లు, Heroism, वीर रस.

కారుణ్యం కరుణా ఘృణా। కృపాదయాఽనుకమ్పాస్యాదనుక్రోశో

కారుణ్యమ్ ॥న॥ - కరుణా-ఘృణా-కృపా-దయా-అనుకమ్పా ॥స్త్రీ॥ అనుక్రోశః ॥పు॥ ౭ - కరుణరసము పేళ్లు, Tenderness, करुणा.

(ఽప్యథో) హసః॥ హాసో హాస్యంచ

హసః - హాసః ॥పు॥ -- హాస్యమ్ ॥న॥ ౩-హాస్యరసము పేళ్లు, Laughter, हास्य.

బీభత్సం వికృతం (త్రిష్విదం ద్వయమ్)

బీభత్సమ్-వికృతమ్ ॥న॥ ౨-బీభత్సరసము పేళ్లు, Disgust, बीभत्स.

| | |
|---|---|
| | ఈ రెండు శబ్దములును భీభత్సరసహేతువు లయిన మాంసాదులను జెప్పునపుడు॥ త్రి॥ |
| విస్మయోఽద్భుత మాశ్చర్యం చిత్ర మప్యథ భైరవమ్॥ ౨౦౧॥ దారుణం భీషణంభీష్మం ఘోరంభీమం భయానకమ్। భయంకరం ప్రతిభయం రౌద్రం తూగ్ర (మమీత్రిషు॥ చతుర్దశ) | విస్మయః ॥పు॥ - అద్భుతమ్ - ఆశ్చర్యమ్- చిత్రమ్ ౪ - అద్భుతరసము పేళ్లు, Surprise, अद्भुत. భైరవమ్-దారుణమ్-భీషణమ్-భీష్మమ్- ఘోరమ్-భీమమ్-భయానకమ్-భయంకరమ్- ప్రతిభయమ్॥ ౯ - భయానకరసము పేళ్లు, Horror, भयानक. రౌద్రమ్ - ఉగ్రమ్॥ ౨- రౌద్రరసముపేళ్లు, Anger, रौद्र. అద్భుత శబ్దము మొదలీ పదునాలుగు శబ్దములును రస హేతు వస్తువాచకము లైనపుడు ॥త్రి॥ |
| దరిత్రాసౌ భీతిర్భీ స్సాధ్వసంభయమ్। | దరః-త్రాసః ॥పు॥ - భీతిః-భీః ॥సీ॥ - సాధ్వ సమ్-భయమ్ ॥న॥ (పా) భియా॥ ౬_భయము పేళ్లు, Fear or terror, भय. |
| (వికారో మానసో) భావోఽ | భావః ॥పు॥ ౧ - రసములఁ బుట్టించెడు స్థాయిభావ వ్యభిచారిభావ సాత్త్వికభావము లను మనోవికారము పేళ్లు, Sentiment or passion, भाव. |
| నుభావో (భావబోధకః)॥ ౨౦౩॥ | అనుభావః ॥పు॥ ౧ - భావబోధకః=ఆభా వము నెఱిఁగించెడి ముఖవికాసాదుల పేరు, Indication of sentiment, अनुभाव. |
| గర్వోఽభిమానోఽహఙ్కారో | గర్వః-అభిమానః-అహఙ్కారః ॥పు॥ ౩- అహంకారము పేళ్లు, Pride, गर्व. [దర్పోఽవలేపోఽవష్టమ్భ శ్చిత్తోద్రేకః స్మయో మదః] |
| మాన (శ్చిత్తసము న్నతిః। | మానః ॥పు॥౧-చిత్తసమున్నతిః-నే నుత్కృష్టుఁడ నను చిత్తౌన్నత్యము పేరు, Arrogance, अभिमान. |

అనాదరః పరిభవః పరీభావస్తిరస్క్రియా॥ ౨౦౩॥ రీఢా౽వమాననా౽వజ్ఞా౽వహేలనమసూర్క్షణమ్॥ [నికారశ్చాప్యభీభావో న్యక్కారశ్చ పరాభవః॥] మన్దాక్షం హ్రీస్త్రపా వ్రీడా లజ్జా

అనాదరః - పరిభవః - పరీభావః ॥పు॥-తిరస్క్రియా రీఢా అవమాననా - అవజ్ఞా ॥స్త్రీ॥- అవహేలనమ్ (పా) వహేలనమ్-అసూర్క్షణమ్ (పా) అసుర్క్షణమ్ - అసూక్షణమ్-అసుక్షణమ్ ॥న॥ ౯ - తిరస్కారము పేళ్లు, Disrespect, तिरस्कार.

[నికారః - అభీభావః - న్యక్కారః - పరాభవః ॥పు॥] అధికపాఠము.

మన్దాక్షమ్ ॥న॥-హ్రీః-త్రపా-వ్రీడా-లజ్జా॥స్త్రీ॥ ౫-సిగ్గుపేళ్లు, వ్రీడాశబ్దము పుల్లింగమును గలదు, Modesty or shame, लज्जा.

(సా) ౽పత్రపా౽న్యతః)॥ ౨౦౪॥

అపత్రపా ॥స్త్రీ॥ ౧ - అన్యతః = పరులవలన వచ్చిన, సా = ఆ సిగ్గుపేరు, Bashfulness, झेंप.

క్షాన్తి స్తితిక్షా౽భిధ్యాతు (పరస్వవిషయేస్పృహా)।

క్షాన్తిః-తితిక్షా ॥స్త్రీ॥ ౨-ఓర్పుపేళ్లు, Forbearance, क्षमा.

అభిధ్యా ॥స్త్రీ॥ ౧-(పరధనాపహారణవిషయమైన) యభిలాషపేరు, Coveting another's property, लालच.

అక్షాన్తి రీర్ష్యా

అక్షాన్తిః - ఈర్ష్యా ॥స్త్రీ॥ ౨-పరునియొక్కయుత్కర్షమునకు నోర్వకుండుట పేళ్లు, Envy, ईर्ष्या.

౽సూయాతు (దోషారోపో గుణేష్వపి)॥

అసూయా ॥స్త్రీ॥ ౧-మంచిగుణములుగలిగియున్నను దోషము నారోపించుట పేరు,

వైరం విరోధో విద్వేషో

వైరమ్ ॥న॥ - విరోధః-విద్వేషః ॥పు॥ ౩- వైరము పేళ్లు, Enmity, विरोध.

మన్యుశోకౌతు శుక్ (స్త్రియామ్)॥

మన్యుః-శోకః ॥పు॥ - శుక్ ॥చ్, స్త్రీ॥ ౩- శోకముపేళ్లు, Grief or sorrow, शोक.

పశ్చాత్తాపోఽనుతాపశ్చ విప్రతీసార (ఇత్యపి)॥ కోప క్రోధామర్ష రోషప్రతిఘారుట్క్రుధౌ (స్త్రియౌ)।

పశ్చాత్తాపః-అనుతాపః-విప్రతీసారః ॥పు॥ ౩ - పశ్చాత్తాపము పేళ్లు, Repentance, पश्चात्ताप.

కోపః - క్రోధః - అమర్షః-రోషః-ప్రతిఘః ॥పు॥ రుట్ ॥ష్, స్త్రీ॥-క్రుత్ ॥ధ్, స్త్రీ॥ ౭-కోపము పేళ్లు, Rage, क्रोध.

(శుచౌతు చరితే) శీల మున్మాద శ్చిత్తవిభ్రమః॥ ౨౦౮॥

శీలమ్ ॥న॥ ౧-పవిత్రచరితముపేరు, Good conduct, शील.

ఉన్మాదః-చిత్తవిభ్రమః॥ ౨ - భూతావేశాదులచేతఁ గలిగిన చిత్తచాంచల్యము, Infatuation, चित्त की चचंलता.

ప్రేమా (నా) ప్రియతా హార్దం ప్రేమ స్నేహోఽథ

ప్రేమా ॥న్, పు॥-ప్రియతా ॥స్త్రీ॥-హార్దమ్-ప్రేమ ॥న్,న॥-స్నేహః ॥పు॥ ౫-స్నేహముపేళ్లు, Affection or kindness, प्रेम.

దోహదమ్। ఇచ్ఛాకాఙ్క్షాస్పృహేహాతృడ్వాఞ్ఛా లిప్సామనోరథః॥ ౨౦౯। కామోఽభిలాషస్తర్షశ్చ

దోహదమ్ ॥న॥ - ఇచ్ఛా-కాఙ్క్షా-స్పృహా-ఈహా-తృట్ ॥ష్॥-వాఞ్ఛా-లిప్సా ॥స్త్రీ॥-మనోరథః-కామః-అభిలాషః-తర్షః ॥పు॥ ౧౨ - కోరిక పేళ్లు, Desire or longing, इच्छा.

(సమహాన్) లాలసా (ద్వయోః)। ఉపాధి (ర్నా) ధర్మచిన్తా

లాలసా ॥ప్స॥ ౧ - అధికమైన కోరికపేరు, Ardent desire, लालसा.

ఉపాధిః ॥పు॥-ధర్మచిన్తా ॥స్త్రీ॥ ౨-ధర్మచింత పేళ్లు, Virtuous reflection, धर्म चिंता.

| | |
|---|---|
| గలోఽ | కసవుపేళ్లు, గనుపదంటు, A reed. |
| థోకాశ (మస్త్రియామ్॥ ౨౦౮॥ ఇక్షుగన్ధా పోటగలః (పుంభూమనితు) బల్బజాః। | కాశమ్॥ పున॥ ఇక్షుగన్ధా॥ సీ॥ పోటగలః॥ పు॥ 3-తెల్లుకసవుపేళ్లు, బల్బజాః॥పు, బ॥ ౧-మోదయపుకసవుపేరు. ఈ ర ను తెల్లుకసవుపేళ్లని కొందఱందురు. Saccharum Spontaneum, काँस. |
| రసాల ఇక్షు | రసాలః - ఇక్షుః॥ పు॥ ౨ - చెఱుకుపేళ్లు, Sugarcane, ईख. |
| (స్తద్భేదాః) పుణ్డ్రకాన్తారకాదయః॥ ౨౦౯॥ | పుణ్డ్రః - కాన్తారకః - ఆదిపదముచే, కోశకారః॥ పు॥ మొదలైనవి, తద్భేదాః = చెఱుకు విశేషములు. |
| స్యాద్వీరణం వీరకరం | వీరణమ్-వీరకరమ్॥ న॥ ౨ - అవురుకసవుపేళ్లు, Andropogon muricatum. |
| (మూలేఽస్యో) శీర (మస్త్రియామ్)। అభయం నలదం సేవ్యమమృణాలం జలాశయమ్॥ ౨౧౦॥ లామజ్జకం లఘులయ మపదా హేష్టకాపథే। | ఉశీరమ్॥పున॥అభయమ్-నలదమ్-సేవ్యమ్-అమృణాలమ్-జలాశయమ్-లామజ్జకమ్- లఘులయమ్(పా) లఘు-లయమ్ - అపదాహమ్ - ఇష్టకాపథమ్॥ న॥ ౧౦ - అస్య = ఈ యవురుకసవుయొక్క, మూలే = వేరుపేళ్లు, అవే వట్టివేళ్లు, Cas-cus, खसखस. |
| (నడాదయ) స్తృణం (గర్మ్చ్ఛ్యామాక ప్రముఖా అపి) ౨౧౧॥ | నడాదయః = నడశబ్దము మొదలిదివఱకునైన శబ్దములచేతఁ జెప్పఁబడినవియు, గర్ముచ్ఛ్యామాక ప్రముఖాఅపి = గర్ముత్ = ఊడలు- శ్యామాక = చామలు, ప్రముఖాఅపి = ఇవి మొదలైన తృణధాన్య వాచకశబ్దములచేత జెప్పఁబడఁగలవియు, తృణమ్॥ న॥ తృణమని చెప్పఁబడును. A gramineous plant, तृण. |

| | |
|---|---|
| (అస్త్రీ)కుశం కుథో దర్భః పవిత్ర | కుశమ్॥ ష్న॥ కుథః-దర్భః॥ పు॥ పవిత్రమ్॥ న॥ ౪-దర్భలపేళ్లు, Sacrificial grass, दाभ. |
| (మథ) కత్తృణమ్। పౌర సౌగన్ధిక ధ్యామ దేవజగ్ధక రౌహిషమ్॥ ౨౧౨॥ | కత్తృణమ్-పౌరమ్-సౌగన్ధికమ్-ధ్యామమ్-(పా) ధ్యాయమ్-దేవజగ్ధకమ్-రౌహిషమ్॥ న॥ ౬-కామంచికసవుపేళ్లు, A fragrant grass, घास. |
| ఛత్త్రాతిచ్ఛత్త్ర పాలఘ్నౌ | ఛత్త్రా॥ సీ॥ అతిచ్ఛత్త్రః (పా) ఛత్త్రాతిచ్ఛత్త్రః-పాలఘ్నః॥ పు॥ ౩-ఛత్త్రాకారమైన కసవుపేళ్లు, A mushroom. |
| మాలాతృణక భూస్తృణే। | మాలాతృణకమ్ - భూస్తృణమ్॥ న॥ ౨-చిప్పకసవు పేళ్లు, Andropogon schoenanthus. |
| శష్పం బాలతృణం | శష్పమ్ (పా) శస్యమ్-బాలతృణమ్॥ న॥ ౨-లేఁతకసవుపేళ్లు, Young grass, घास. |
| ఘాసో యవస | ఘాసః-యవసః(పా)యావసః॥పు॥ ౨-పశువులు మొదలైనవి తినఁదగిన కసవుపేళ్లు, Meadow grass. |
| స్తృణమర్జునమ్॥ ౨౧౩॥ | తృణమ్-అర్జునమ్॥న॥ ౨-సామాన్యముగా కసవుపేళ్లు, Grass, घास. |
| (తృణానాం సంహతి) స్తృణ్యా | తృణ్యా॥సీ॥౧-తృణానామ్ = కసవుయొక్క, సంహతిః = సమూహముపేరు, Abundance of grass. |
| నడ్యా తు (నడసంహతిః)। | నడ్యా॥ సీ॥ ౧ - నడసంహతిః = గనుపకసవు గుంపుపేరు, కిక్కసకసవుగుంపు, Abundance of reeds. |
| తృణరాజా(హ్వయ) స్తాలో | తృణరాజః-తాలః॥ పు॥ ౨ - తాటిచెట్టు పేళ్లు, Palmyra, ताड़. |

నాలికేర స్తు లాఙ్గలీ॥ ౨౧౭॥

నాలికేరః (పా) నారికేలః॥ పు॥ లాఙ్గలీ॥ న్, పు, ఈ, స్త్రీ॥ ౨ - టెంకాయచెట్టు పేళ్లు, Cocoanut, नारियल.

ఘోణ్టా తు పూగః క్రముకో గువాకః ఖపురో

ఘోణ్టా॥ స్త్రీ॥ పూగః - క్రముకః-గువాకః (పా) గూవాకః-ఖపురః॥పు॥౫-పోఁకచెట్టుపేళ్లు, Areca, Faufel, सुपारी का पेड़.

(ఽస్య తు। ఫల)ము ద్వేగ

ఉద్వేగమ్॥ న॥ ౧-ఈ పోఁక చెట్టుఫలము, Arecanut, सुपारी.

(మేతే చ హిన్తాల సహితా స్త్రయః॥ ౨౧౮॥ ఖర్జూరః కేతకీ తాలీఖర్జూరీ చ) తృణద్రుమాః।

హిన్తాలసహితాః=గిలకతాటి (Marshy date, खजूर विशेष) తోఁ గూడుకొనియున్న, ఏతే త్రయశ్చ= ఈ చెప్పఁబడిన తాల నారికేల క్రముకములు మూఁడును, ఖర్జూరః=ఖర్జూర వృక్షము (Date, खजूर), కేతకీ = మొగలి చెట్టు (Pandanus odora tissimus, केतकी), తాలీ=(శ్రీ)తాళవృక్షము (Corypha Talliera), ఖర్జూరీ = ఈఁతచెట్టు (Wild date, जंगली खजूर). ఈ ౮ ను గూడి మొనిమిదియు తృణవృక్షము లనంబడును, A palm.

ఇతి వనౌషధివర్గః.

అరణ్యము ఓషధులు కల పదసమూహము ముగిసెను.

---

సింహో మృగేన్ద్రః పఞ్చాస్యో హర్యక్షః కేసరీ హరిః॥ ౨౧౯॥

సింహః-మృగేన్ద్రః-పఞ్చాస్యః-హర్యక్షః-కేసరీ॥ న్॥ హరిః॥ పు॥ ౬ - సింహము పేళ్లు, A lion, सिंह.

[కణ్ఠీరవో గజరిపుః పిఙ్గదృష్టి ర్మృగాధిపః॥]

[కణ్ఠీరవః-గజరిపుః-పిఙ్గదృష్టిః-మృగాధిపః॥ పు॥ ౪ అధికపాఠము.]

శార్దూల ద్వీపినౌ వ్యాఘ్రే

శార్దూలః - ద్వీపీ॥ న్॥ వ్యాఘ్రః॥ పు॥ 3- పెద్దపులిపేళ్లు, A tiger, बाघ.

తరక్షుస్తు మృగాదనః।

తరక్షుః-మృగాదనః॥ పు॥ ౨-సివంగిపేళ్లు, A hyena, चर्ग.

వరాహ స్సూకరో ఘృష్టిః కోలః పోత్రీ కిరిః కిటిః। ౨౧౭।
దంష్ట్రీ ఘోణీ స్తబ్ధరోమా క్రోడో భూదార (ఇత్యపి)।

వరాహః-సూకరః (పా) శూకరః-ఘృష్టిః (పా) గృష్టిః-కోలః-పోత్రీ॥ న్॥ కిరిః - కిటిః - దంష్ట్రీ॥ న్॥ ఘోణీ॥ న్॥ స్తబ్ధరోమా॥ న్॥ క్రోడః-భూదారః॥ పు॥ ౧౨-అడవిపందిపేళ్లు, A hog, जंगली सुअर.

కపిప్లవఙ్గ ప్లవగ శాఖామృగ వలీముఖాః॥ మర్కటో వానరః కీశో వనౌకా

కపిః - ప్లవఙ్గః - ప్లవగః-శాఖామృగః-వలీముఖః-మర్కటః-వానరః-కీశః-వనౌకాః॥ సీ॥ పు॥ ౯ - కోఁతిపేళ్లు, A monkey or ape, बन्दर.

(అథ) భల్లుకే। ఋక్షాచ్ఛభల్ల భాలూకా

భల్లుకః (ప) భల్లూకః - ఋక్షః - అచ్ఛభల్లః (పా) అచ్ఛః-భల్లః-భాలూకః॥ పు॥ ౪- ఎలుఁగుగొడ్డుపేళ్లు, A bear, रीछ.

గణ్డకే ఖడ్గ ఖడ్గినౌ॥ ౨౧౮॥

గణ్డకః-ఖడ్గః-ఖడ్గీ॥న్,పు॥ 3-ఖడ్గమృగము పేళ్లు, A rhinoceros, गैंडा.

లులాయో మహిషో వాహద్విషత్కాసర సైరిభాః।

లులాయః - మహిషః-వాహద్విషన్॥ త్॥ కాసరః-సైరిభః॥ పు॥ ౫-కారెనుపోతుపేళ్లు, A buffalo, भैंसा.

(స్త్రియాం) శివా భూరిమాయు గోమాయు మృగధూర్తకాః॥ సృగాల వఞ్చక క్రోష్టు ఫేరు ఫేరవ జమ్బుకాః॥

శివా॥ సీ॥ భూరిమాయుః(పా)భూరిమాయుః-గోమాయుః-మృగధూర్తకః-సృగాలః (పా) శృగాలః - వఞ్చకః - క్రోష్టుః-ఫేరుః-ఫేరవః-జమ్బుకః॥ పు॥ ౧౦ - నక్కపేళ్లు, క్రోష్టుశబ్దమునకు ఋకారాంతమునకువలె రూపము, A jackal, लोमडी.

ఓతుర్బిడాలో మార్జారో వృషదంశక ఆఖుభుక్॥ ౨౨౧॥

ఓతుః-బిడాలః-మార్జారః (పా) మార్జాలః వృషదంశకః (పా) వృషదంశకః - ఆఖుభుక్॥ జ్, పు॥ ౫-పిల్లిపేళ్లు, A cat, बिल्ली.

(త్రయో) గాధేర గాధార గాధేయా (గోధికాత్మజే)।

గాధేరః - గాధారః - గాధేయః॥ పు॥ ౩-ఉడుముపిల్లపేళ్లు, An iguana, गौधार.

శ్వావిత్తు శల్య

శ్వావిత్॥ ధ్॥ శల్యః॥ పు॥ ౨-ఏదుపందిపేళ్లు, A porcupine, शल्य.

(స్తల్లోమ్ని) శలలీ శలలం శలమ్॥ ౨౨౨॥

శలలీ॥ స్త్రీ॥ శలలమ్ - శలమ్॥ న॥ ౩-తల్లోమ్ని=ఆ యేదుపందిముండ్లపేరు, Porcupine quills.

వాత ప్రమీ ర్వాత మృగః

వాతప్రమీః-వాతమృగః॥ పు॥ ౨ - గాలికి నెదురునడచు నిఱ్ఱివంటి మృగము,పొడయిఱ్ఱి. వాతప్రమీశబ్దము స్త్రీలింగమును, A swift antelope, मृगविशेष.

కోక స్త్వీహామృగో వృకః।

కోకః-ఈహామృగః-వృకః॥ పు॥ ౩-తోడేలుపేళ్లు, A wolf, भेड़िया.

మృగే కురఙ్గ వాతాయు హరిణాజిన యోనయః॥ ౨౨౩॥

మృగః-కురఙ్గః-వాతాయుః-హరిణః-అజినయోనిః॥ పు॥ ౫ - ఇఱ్ఱి పేళ్లు, A deer or antelope, हरिण.

ఐణేయ (మేణ్యాశ్చర్మాద్యమేణ) మైణ (ముభే త్రిషు)।

ఏణ్యాః=ఆఁడులేడియొక్కయు, ఏణస్య = మగదుప్పియొక్కయు, చర్మాద్యమ్=చర్మము మొదలైనవి, వరుసగా - ఐణేయమనియు (Belonging to a doe), ఐణమనియు (Belonging to a buck) చెప్పఁబడును. త్రి॥ **मृग चर्म.**

కదలీ కన్దలీ చీన

కదలీ॥ స్త్రీ॥(పా) కదలీ॥ న్, పు॥ బొల్లిచాయ

శ్చమూరు ప్రియకావపి॥ ౨౨౮॥ సమూరు (శ్చేతిహరిణా అమీ అజినయోనయః)।

మెడచారలుగలిగి బిలములోనుండుమృగము. కన్దలీ॥ స్త్రీ॥ (పా) కన్దళీ॥ న్,పు॥ దొడ్డకడుపును నల్లని ముందరికాళ్లును గల మృగము. చీనః॥ పు॥ గువ్వవన్నెగలిగి 30 అంగుళములు పొడవుగల మృగము. చమూరుః॥ పు॥ తోఁకలేని మృగము. ప్రియకః॥ పు॥ దట్టమైె యెఱ్ఱని నల్లని రోమములుగల మృగము. సమూరుః॥ పు॥ తెల్లని కొనవెండ్రుకలతోఁ గూడిన దొడ్డమెడగల మృగము. ఇత్యమీ=ఈయూఱును, అజినయోనయః = ఆస్తరణాదుల కుపయోగించు చర్మములకుఁ గారణములయిన, హరిణాః=ఇఱ్ఱిజాతులలో విశేషములు.

కృష్ణసార రురు న్యఙ్కు రఙ్కు శమ్బర రౌహిషాః॥ ౨౨౯॥ గోకర్ణ పృష తైణర్శ్య రోహితా శ్చమరో (మృగాః)।

కృష్ణసారః (పా) కృష్ణశారః=నల్లయిఱ్ఱి, (The spotted antelope, कृष्णसार). రురుః= నల్లచారలదుప్పి (The stag, बारहसिंगा). న్యఙ్కుః = తలవంచుకొనిపోవు జింకపోతు, రఙ్కుః = తెల్లరోమములుగల యిఱ్ఱి (The spotted axis, हरिणविशेष.) శమ్బరః=ఎఱ్ఱవన్నెగల సన్నపుజింక, రౌహిషః = కొండగొఱ్ఱె, గోకర్ణః = కణితి, పృషతః = దుప్పి (The porcine deer). ఏణః=పెద్దకన్నులుగల నల్లయిఱ్ఱి, ఋశ్యః (పా) ఋష్యః=మనుఁబోతు (White-footed antelope, सफेद-हरिन). రోహితః = కేసరి యను మృగము, చమరః=సవరపుమృగము (Bos grunniens, चमर) ఈ ౧౨ ను॥ పు॥ మృగాః=తమతమ పేళ్ల చేతఁ బ్రసిద్ధములైన మృగభేదములు.

గన్ధర్వశ్శరభో రామ స్సృమరో గవయ శ్శశః॥ ౧౧౬॥

గన్ధర్వః = దొడ్డకడుపును వఱ్ఱువ తోఁకయును గల మృగము, శరభః=ఎనిమిదికాళ్లు గలిగి సింహమును చంపెడి మృగము, రామః= పెద్దదుప్పి, సృమరః=పెద్దసవరపుమృగము, గవయః=గురుపోతు, Bos Gavoeus, శశః= కుందేలు, A hare, खरगोश.

ఇత్యాదయో మృగేన్ద్రాద్యా గవాద్యాః పశుజాతయః।

ఇత్యాదయః = గన్ధర్వశబ్దము మొదలయినవి యాఱును, మృగేన్ద్రాద్యాః = సింహశబ్దము మొదలు చమరశబ్దపర్యంతము లయినవియు, గవాద్యాః=వైశ్యవర్గయందుఁ జెప్పఁబడు గోవులు మొదలైనవియు, పశుజాతయః= పశువులని చెప్పఁబడును. A beast.

[అధోగన్తా తు ఖనకో వృకః పుంధ్వజ ఉన్దురః]

[అధోగన్తా - ఖనకః - వృకః-పుంధ్వజః- ఉన్దురః] ఎలుకపేళ్లు, అధికపాఠము.

ఉన్దురు ర్మూషికోఽప్యాఖు

ఉన్దురుః-మూషికః (పా) మూషకః-ఆఖుః॥ పు॥ ౩-ఎలుకపేళ్లు, A rat, चूहा.

ర్గిరికా బాలమూషికా॥ ౧౧౭॥

గిరికా-బాలమూషికా॥ స్త్రీ॥ ౨-చిట్టెలుకపేళ్లు, A small rat.

చుచున్దరీ గన్ధమూషీ

చుచున్దరీ-గన్ధమూషీ॥స్త్రీ॥ ౨-మంచుపేళ్లు, A mouse, चूहा.

దీర్ఘదేహీ తు మూషికా।

దీర్ఘదేహీ-మూషికా॥ స్త్రీ॥ ౨-పందికొక్కుపేళ్లు, The Bandcoot.

సరటః కృకలాస్ (స్స్య)

సరటః - కృకలాసః॥ పు॥ ౨-తొండపేళ్లు, Cameleon, गिरगिट.

న్ముసలీ గృహగోధికా॥ ౧౧౮॥

ముసలీ-గృహగోధికా॥ స్త్రీ॥ ౨ - బల్లిపేళ్లు, A lizard, चिपकली.

లూతా (స్త్రీ) తన్తు

లూతా॥ స్త్రీ॥ తన్తువాయః - ఊర్ణనాభః -

| | |
|---|---|
| వాయోర్ణనాభ మర్కటకా (స్సమాః)। | మర్కటకః॥ పు॥ ర – సాలెపురుగు పేళ్లు, A spider, मकड़ी. |
| నీలఙ్గు స్తు క్రిమిః | నీలఙ్గుః – క్రిమిః॥ పు॥ ౨ – పురుగులపేళ్లు, మానిమీఁది నల్లని పురుగులని కొందఱందురు. An insect, कीड़ा. |
| కర్ణజలూకా శతప (ద్యుభే)॥ ౨౯॥ | కర్ణజలూకా (పా) కర్ణజలౌకా–శతపదీ॥ స్త్రీ॥ ౨–జెఱ్ఱిపేళ్లు, చెవిదూఱుపామును, రోకటిబండయు, A centipede, गोजर. |
| వృశ్చిక శ్శూక కీట (స్స్యాత్) | వృశ్చికః – శూకకీటః॥ పు॥ ౨–నల్లతేలు పేళ్లు, కణుఁదురుపేరును, A caterpillar, झींगा. |
| దలి ద్రోణౌ తు వృశ్చికే। | అలీ॥ న్॥ (పా) ఆలీ॥ న్॥ ద్రోణః (పా) దుణః – వృశ్చికః॥ పు॥ 3 – ఎఱ్ఱతేలుపేళ్లు. సామాన్యముగా తేలుపేళ్లని కొందఱందురు. A scorpion, बिच्छू. |
| పారావతః కలరవః కపోతోఽథ | పారావతః–కలరవః–కపోతః॥ పు॥ 3–పావురముపేళ్లు, A dove or pigeon, कबूतर. |
| శశాదనః॥ ౩౦॥ ప త్త్రి శ్శ్యేన | శశాదనః–పత్త్రీ॥న్॥ శ్యేనః॥పు॥3–డేగపేళ్లు, A hawk or falcon, बाज. |
| ఉలూకస్తు వాయ సారాతిపేచకౌ। | ఉలూకః- వాయసారాతిః–పేచకః॥ పు॥ 3–గూబపేళ్లు, An owl, उल्लू. |
| [దివాన్ధః కౌశికో ఘూకో దివాభీతో నిశాటనః] | [దివాన్ధః–కౌశికః–ఘూకః–దివాభీతః–నిశాటనః] అధికపాఠము. |
| వ్యాఘ్రాటస్తు భర ద్వాజః | వ్యాఘ్రాటః–భరద్వాజః॥ పు॥ ౨–పట్రింత పేళ్లు, భారద్వాజపక్షి, A sky-lark, लावा. |
| ఖఞ్జరీటస్తు ఖఞ్జనః॥ | ఖఞ్జరీటః – ఖఞ్జనః॥ పు॥ ౨ – మందపిచ్చిక |

పేళ్లు, కాటుకపిట్ట రవ్వపుల్లుఁగు కౌజు, A wagtail, खंजन पक्षी.

లోహపృష్ఠస్తు కఙ్కః (స్స్యాత్)

లోహపృష్ఠః-కఙ్కః॥ పు॥ ౨-రాపులుఁగు పేళ్లు, మల్లెజేగురును, A heron, बगुला.

(అథ) చాషః కికీదివిః।

చాషః - కికీదివిః॥ పు॥ ౨-పాలపిట్ట పేళ్లు, A blue jay, नीलकंठ.

కలిఙ్గభృఙ్గధూమ్యాటాః

కలిఙ్గః-భృఙ్గః-ధూమ్యాటః॥ పు॥ ౩-కూఁకటిమూఁగయను పక్షి పేళ్లు, A fork-tailed shrike, कलिंग.

(అథస్యా)చ్ఛతపత్త్రకః॥ ౨౩౨॥ దార్వాఘాటోఽ-

శతపత్త్రకః-దార్వాఘాటః॥ ౨ - మానుగోయిలపులుఁగు పేళ్లు, వెగ్గురుపులుఁగును, A wood-pecker, कठफोडा.

థ సారఙ్గః స్తోకకశ్చాతక (స్సమాః)।

సారఙ్గః (పా) శారఙ్గః-స్తోకకః - చాతకః॥ పు॥ ౩ - వానకోయిలపేళ్లు, చాతకపక్షి, चातक.

కృకవాకుస్తామ్రచూడః కుక్కుటశ్చరణాయుధః॥ ౨౩౩॥

కృకవాకుః-తామ్రచూడః-కుక్కుటః-చరణాయుధః॥ పు॥ ౪ - కోడిపేళ్లు, A gallinaceous fowl, मुर्गा.

చటకః కలవిఙ్కః (స్స్యా)

చటకః-కలవిఙ్కః॥ పు॥ ౨-పిచ్చిక పేళ్లు, A sparrow, गौरैया.

త్తస్య (స్త్రీ) చటకా

చటకా॥ స్త్రీ॥ ౧ - ఆఁడుపిచ్చిక పేరు, A female sparrow, मादा गौरैया.

(తయోః। పుమపత్యే) చాటకైరః (స్త్ర్యపత్యే) చటకై (వసా)॥ ౨౩౪॥

చాటకైరః॥ పు॥ చటకా॥ స్త్రీ॥ ౨-ను వరుసగా, తయోః=ఆపిచ్చుకలయొక్క, పుమపత్యే=మగపిల్లయందును, స్త్ర్యపత్యే=ఆఁడుపిల్లయందును వర్తించును.

కర్కరేటుస్తు కరేటుస్స్యాత్

కర్కరేటుః-కరేటుః॥ పు॥ ౨-పెద్దకొక్కెరపేళ్లు, Numidian crane, करेट.

కృకణక్రకరౌ (సమౌ)।

కృకణః-క్రకరః॥ పు॥ ౨-కొక్కెరపేళ్లు.

వనప్రియః పరభృతః కోకిలః పిక (ఇత్యపి)॥ ౨౩౫॥

వనప్రియః-పరభృతః-కోకిలః - పికః॥ పు॥ ౪-కోకిలపేళ్లు, The black cuckoo, कोकिल.

కాకేతు కరటారిష్ట బలిపుష్టసకృత్ప్రజాః। ధ్వాంక్షాత్మఘోష పరభృద్బలిభుగ్వాయసా అపి॥ ౨౩౬॥ [చిరజీవీ చైకదృష్టిర్మౌకలిః పికవర్ధనః।]

కాకః-కరటః-అరిష్టః-బలిపుష్టః-సకృత్ప్రజః-ధ్వాంక్షః-ఆత్మఘోషః-పరభృత్॥ త్॥ బలిభుక్॥ జ్॥ వాయసః-చిరజీవీ॥ న్॥ ఏకదృష్టిః-మౌకలిః-పికవర్ధనః॥ పు॥ ౧౪-కాకిపేళ్లు, చిరజీవి మొదలు నాలుగు నధికనామములు, A crow, कौआ.

ద్రోణకాకస్తు కాకోలో

ద్రోణకాకః-కాకోలః॥ పు॥ ౨-మాలకాకిపేళ్లు, A raven, काला कौआ.

దాత్యూహః కాలకణ్టకః॥ ౨౩౭॥

దాత్యూహః-కాలకణ్టకః॥పు॥ ౨-నీరుకోడి గుడ్డంగిపిట్టపేళ్లు. భరతపక్షి, A gallinule, भरत पक्षी.

ఆతాయి చిల్లౌ

ఆతాయీ॥ న్॥ (పా) ఆతాపీ॥ న్॥ చిల్లః॥ పు॥ ౨ - పిన్నగద్దపేళ్లు. జెముడుకాకియు చీరపిట్టయు, A kite, चील.

దాక్షాయ్య గృధ్రౌ

దాక్షాయ్యః - గృధ్రః॥ పు॥ ౨-గద్దపేళ్లు, బోరుకయును, A vulture, गीध.

కీర శుకౌ (సమౌ)।

కీరః - శుకః॥ పు॥ ౨ - చిలుక పేళ్లు, A parrot, तोता.

క్రుఙ్ క్రౌఞ్చోఽథ

క్రుఙ్॥ చ్॥ క్రౌఞ్చః॥ పు॥ ౨-కొంగపేళ్లు, A curlew, कराकुल.

బకః కహ్వః

బకః-కహ్వః॥ పు॥ ౨-వక్కు కొంగపేళ్లు, A crane, सारस.

పుష్కరాహ్వస్తుసా రసః॥ ౨౩౮॥

పుష్కరాహ్వః - సారసః॥ పు॥ ౨-బెగ్గురు పేళ్లు, The Indian crane, सारस.

కోకశ్చక్రశ్చక్రవా కో రథాఙ్గా (హ్వయ నామకః)।

కోకః-చక్రః-చక్రవాకః-రథాఙ్గః॥పు॥ ౪-జక్కవపిట్ట పేళ్లు, The ruddy goose, चक्रवाक.

కాదమ్బః కలహంస (స్స్యాత్)

కాదమ్బః-కలహంసః॥ పు॥ ౨-ధూమ్రవర్ణములయిన ముక్కు కాళ్లుగల హంసల పేళ్లు, A drake, बतख विशेष.

దుత్క్రోశ కురరౌ (సమౌ)॥ ౨౩౯॥

ఉత్క్రోశః - కురరః॥ పు॥ ౨-పెన్నడ పులుఁగు పేళ్లు, An osprey, कुरल पक्षी.

హంసాస్తు శ్వేత గరుత శ్చక్రాఙ్గా మాన సౌకసః।

హంసః-శ్వేతగరుత్॥త్॥ చక్రాఙ్గః-మానసౌకాః॥ స్, పు॥ ౪-హంస పేళ్లు, A swan, हंस.

రాజహంసా (స్తు తే చఞ్చుచరణై ర్లోహి తైః స్సితాః)॥ ౨౪౦॥

రాజహంసః॥ పు॥ ౧-లోహితైః చఞ్చుచరణైః = ఎఱ్ఱని ముక్కుకాళ్లతోఁగూడి, సితాః = తెల్లనైయుండు ఆ హంసలపేళ్లు, हंस.

(మలినై) ర్మల్లికా ఖ్యా (స్తే)

మల్లికః (పా) మల్లికాక్షః॥ పు॥ ౧-మలినైః=కొంచెము ధూమ్రవర్ణముగల ముక్కు కాళ్లతోఁగూడి తెల్లనైయుండు హంసలపేరు.

ధార్తరాష్ట్రా (స్సితే తరైః)।

ధార్తరాష్ట్రః॥ పు॥ ౧-సితేతరైః=నల్లని ముక్కు కాళ్లతోఁ గూడి తెల్లనైయుండు హంసలపేరు.

శరారి రాటి రాడి శ్చ

శరారిః-ఆటిః-ఆడిః॥ స్త్రీ॥ ౩-ఆఁడేలు అను పక్షి పేళ్లు.

బలాకా బిసకణ్ఠికా॥ ౨౮౧॥

బలాకా-బిసకణ్ఠికా॥ సీ॥ ౨- తెల్లకొంగ పేర్లు, A small crane, छोटा सारस.

(హంసస్య యోషి) ద్వరటా

వరటా॥ సీ॥ ౧-హంసస్య=హంసయొక్క, యోషిత్=స్త్రీ పేరు, A duck or goose, वतख़.

(సారసస్యతు) లక్ష్మణా।

లక్ష్మణా (పా) లక్షణా॥ సీ॥ ౧-సారసస్య=బెగ్గురుపక్షియొక్క స్త్రీ పేరు, मादा सारस.

జతుకాఽజినపత్త్రా (స్యా) త్పరోష్ణీ తైలపాయికా॥ ౨౮౨॥

జతుకా (పా) జతూకా-అజినపత్త్రా॥ సీ॥ ౨ - గబ్బిలాయి పేళ్లు, చిరుతవాయి, A bat, चमगीदड़. పరోష్ణీ - తైలపాయికా॥ సీ॥ ౨- బొద్దెపురుగు పేళ్లు, A cock-roach, तिलचिट्टा.

(వ) చర్చణామక్షికానీలీ

చ(వ)ర్చణా-మక్షికా-నీలీ॥ సీ॥ 3 - నల్లని ఈగ పేళ్లు, A blue fly, नीली पक्षी.

సరఘా మధుమక్షికా।

సరఘా - మధుమక్షికా॥ సీ॥ ౨ - జుంటి యీఁగ పేళ్లు, తేనటీఁగ, A bee, मधुमखी.

పతఙ్గికాపుత్తికాస్యా

పతఙ్గికా-పుత్తికా॥ సీ॥ ౨- తెరయీఁగ పేళ్లు, A small bee, पतंग.

ద్దంశస్తు వనమక్షికా॥ ౨౮౩॥

దంశః॥ పు॥ వనమక్షికా॥ సీ॥ ౨ - అడవి యీఁగ పేళ్లు, A gadfly, डंस.

దంశీ (తజ్జాతి రల్పా స్యా)

దంశీ॥ సీ॥ ౧-అల్పా=అల్పమైన, తజ్జాతిః స్యాత్ =ఆ యడవియీఁగలజాతి పేరు, అడవి దోమ, मच्छड़.

ద్గన్ధోలీ వరటా (ద్వయోః)।

గన్ధోలీ (పా) గన్ధోలీ-వరటా॥ప్ర॥ ౨-ఎఱ్ఱ తుమ్మెద పేళ్లు, కణుఁదురీఁగ, A wasp, झींगुर.

భృఙ్గారీ చీరుకా

భృఙ్గారీ - చీరుకా (పా) ఝిరుకా-చీరికా-

| | |
|---|---|
| చీరీ ఝిల్లికాచ (సమా ఇమాః)॥ ౨౮౪॥ | చీరీ-ఝిల్లికా॥ స్త్రీ॥ ౪-చిమటపేళ్లు, ఈలపురుగును, A cricket, झींगुर. |
| (సమౌ) పతఙ్గ శలభౌ | పతఙ్గః – శలభః॥ పు॥ ౨ – మిడతపేళ్లు, A grasshopper, पतंग. |
| ఖద్యోతో జ్యోతిరిఙ్గణః। | ఖద్యోతః – జ్యోతిరిఙ్గణః॥ పు॥ ౨ – మిణుఁగుఱుబూచిపేళ్లు, A firefly, जुगनू. |
| మధువ్రతో మధుకరో మధులిణ్మధుపాలినః॥ ౨౮౫॥ ద్విరేఫపుష్పలిడ్భృఙ్గషట్పదభ్రమరాలయః। [ఇన్దిన్దిరశ్చఞ్చరీకో రోలమ్బో బమ్భరశ్చసః]॥౨౮౬॥ | మధువ్రతః-మధుకరః – మధులిట్॥ హా॥ మధుపః-అలీ॥ న్॥ ద్విరేఫః – పుష్పలిట్॥ హా॥ భృఙ్గః-షట్పదః-భ్రమరః – అలిః [ఇన్దిన్దిరః – చఞ్చరీకః – రోలమ్బః – బంభరః]॥ పు॥ ౧౫-తుమ్మెదపేళ్లు, ఇన్దిన్దిర శబ్దము మొదలు ౪-అధికనామములు, A large black bee, भ्रमर. |
| మయూరో బర్హిణో బర్హీ నీలకణ్ఠో భుజఙ్గభుక్। శిఖావలశ్శిఖీ కేకీ మేఘనాదానులాస్యపి॥ ౨౮౭ | మయూరః–బర్హిణః–బర్హీ॥ న్॥ నీలకణ్ఠః–భుజఙ్గభుక్॥ జ్॥ శిఖావలః – శిఖీ॥ న్॥ కేకీ॥ న్॥ మేఘనాదానులాసీ॥ న్, పు॥ ౯ – నెమిలిపేళ్లు, A peacock, मोर. |
| కేకా (వాణీమయూరస్య) | కేకా॥ స్త్రీ॥ ౧ – మయూరస్యవాణీ= నెమిలి కూఁతపేరు, His cry, उसकी ध्वनि. |
| (సమౌ) చన్ద్రికమేచకౌ। | చన్ద్రికః – మేచకః॥ పు॥ ౨ – నెమిలిపురి కన్నుపేరు. |
| శిఖాచూడా | శిఖా–చూడా॥ స్త్రీ॥ ౨–నెమిలికుంకటిపేళ్లు, Crest, शिखा. |
| శిఖణ్డస్తు పిఞ్ఛబర్హే (నపుంసకే)॥ ౨౮౮॥ | శిఖణ్డః॥ పు॥ పిఞ్ఛమ్–బర్హమ్॥ న॥ 3–నెమిలి పురిపేళ్లు, Peacock's tail, पिछ. |

ఖగేవిహఙ్గ విహఙ్గ
విహఙ్గమ విహాయసః ।
శకున్తిపక్షి శకుని శకు
న్త శకున ద్విజాః ॥
౨౮౯॥ పతత్త్రి పత్త్రి
పతగ పతత్పత్త్రర థా
ణ్డజాః। నగౌకో వాజి
వికిర వివిష్కిర పత
త్త్రయః॥ ౨౯౦॥ నీడో
ద్భవాగరుత్మన్తః పిత్స
న్తోనభసఙ్గమాః ।

ఖగః - విహఙ్గః-విహగః-విహఙ్గమః-విహాయాః॥స్॥ శకున్తిః-పక్షీ॥న్॥ శకునిః-శకున్తః-శకునః-ద్విజః-పతత్త్రీ॥న్॥ పత్త్రీ॥న్॥పతగః-పతన్॥త్॥ పతత్త్రరథః-అణ్డజః-నగౌకాః॥ స్॥ వాజీ॥న్॥ వికిరః - విః - విష్కిరః-పతత్త్రిః-నీడోద్భవః-గరుత్మాన్॥త్॥ పిత్సన్॥ త్॥ నభసఙ్గమః॥ పు॥ ౨౭ - సామాన్యముగాఁ బక్షుల పేళ్లు, A bird, पक्षी.

(తేషాం విశేషా)
హారీతో మద్గుః కార
ణ్డవః ప్లవః॥ ౨౯౧॥
తిత్తిరిః కుక్కుభో లావో
జీవంజీవశ్చకోరకః।
కోయష్టిక ష్టిట్టిభకో
వర్తకో వర్తికాదయః॥
౨౯౨।

హారీతః॥ పు॥ = పచ్చనిపిట్ట, The green pigeon, हरीत. మద్గుః॥ పు॥ =నీరుకాకి, The shag, मद्गु. కారణ్డవః॥ పు॥ = కన్నెలేడు, ప్లవః॥ పు॥ నీరుకోడి, తిత్తిరిః॥ పు॥ = తీతువు, The francoline partridge, तीतर. కుక్కుభః॥ పు॥ = బెళగువ్వ, A wild cock, लवा. లావః॥ పు॥ = లావుక, A quail. జీవంజీవః॥ పు॥ = వన్నెపులుఁగు, A pheasant, महूका. చకోరకః॥ పు॥ = వెన్నెలపులుఁగు, Perdix rufa, कोरक. కోయష్టికః॥పు॥ చీఁకుకొక్కెర, గుడ్డికొంగ, టిట్టిభకః॥ పు॥ = లకుముకిపిట్ట, Jacana, टिह्ली. వర్తకః॥ పు॥ = వెలిచెపిట్ట, దొట్లపులుఁగు, వర్తికా॥ స్త్రీ॥ = మీలవల్లంకి, ఈ ౧౩ శబ్దములును. తేషాంవిశేషాః = ఆ పక్షులలో భేదములు. ఇచటఁ గొందఱు జీవంజీవ చకోరకశబ్దములు పర్యాయములనియు, వర్తక శబ్దమును స్త్రీలింగముగా పఠించి

వర్తకా వర్తికా శబ్దములు పర్యాయములని యుం జెప్పిరి.

గరుత్పక్షచ్ఛదాః పత్త్రంపతత్త్రంచ తనూరుహమ్।

గరుత్-పక్షః-ఛదః॥ పు॥ పత్త్రమ్ - పతత్త్రమ్-తనూరుహమ్॥ న॥ ౬-ఱెక్కల పేళ్లు, A wing, पक्ष.

(స్త్రీ)పక్షతిః పక్షమూలం.

పక్షతిః॥ స్త్రీ॥ పక్షమూలమ్॥ న॥ ౨-ఱెక్కల మొదటి పేళ్లు, The root of a wing, पक्षमूल.

చఞ్చుస్త్రోటి (రుభే స్త్రియా)॥ ౨౫౩॥

చఞ్చుః-త్రోటిః॥ స్త్రీ॥ ౨-పక్షిముక్కు పేళ్లు, The beak, चोंच.

ప్రడీనోడ్డీన సణ్డీనా (న్యేతాః ఖగగతిక్రియాః)।

ప్రడీనమ్॥న॥=ఎగయుట, Taking fight, उडना. ఉడ్డీనమ్॥ న॥ = పాఱుట, Soaring, उडान. సణ్డీనమ్॥ న॥ = వ్రాలుట, Perching, बैठना. ౩-ను, ఏతాః=ఇవి, ఖగగతిక్రియాః= పక్షులగతిభేదములు.

పేశీ కోశో (ద్విహీనే)౽ణ్డం

పేశీ॥స్త్రీ॥కోశః॥పు॥అణ్డమ్॥న॥ ౩-గ్రుడ్డు పేళ్లు. పేశీకోశః=ఒక పదముగ కొందఱందురు. An egg, अंडा.

కులాయో నీడ(మస్త్రియామ్)॥ ౨౫౪॥

కులాయః॥ పు॥ నీడమ్॥ న॥ ౨-పక్షిగూటి పేళ్లు, A nest, घोंसला.

పోతః పాకో౽ర్భకో డిమ్భః పృథుకశ్శాబకశ్శిశుః।

పోతః - పాకః-అర్భకః-డిమ్భః-పృథుకః-శాబకః-శిశుః॥ పు॥ ౭-సామాన్యముగా శిశువు పేళ్లు, Young of any animal, शिशु.

స్త్రీపుంసౌ మిథునం ద్వన్ద్వం

స్త్రీపుంసౌ - మిథునమ్-ద్వన్ద్వమ్॥ న॥ ౩-స్త్రీ పురుషుల జంటపేళ్లు, A couple, male and femalc, मिथुन.

| | |
|---|---|
| యుగ్మంతు యుగలం యుగమ్॥ ౨౫౫॥ | యుగ్మమ్ - యుగలమ్-యుగమ్॥ న॥ 3-జంటపేళ్లు, A pair or brace, जोडा. |
| సమూహనివహ వ్యూహ సన్దోహ విసర వ్రజాః। స్తోమౌఘ నికర వ్రాత వార సఙ్ఘాత సఞ్చయాః॥ ౨౫౬॥ సముదాయ స్సముదయ స్సమవాయ శ్చయోగణః। (స్త్రీయాంతు) సంహతి ర్బృన్దం నికురమ్బం కదమ్బకమ్॥ ౨౫౭॥ | సమూహః - నివహః-వ్యూహః-సన్దోహః-విసరః - వ్రజః-స్తోమః-ఓఘః-నికరః-వ్రాతః-వారః-సఙ్ఘాతః-సఞ్చయః-సముదాయః-సముదయః-సమవాయః-చయః-గణః॥ పు॥ సంహతిః॥ స్త్రీ॥ బృన్దమ్-నికురమ్బమ్-కదమ్బకమ్॥ న॥ ౨౨-గుంపుపేళ్లు, A flock or multitude, समूह. |
| (బృన్దభేదాః) (సమైః) ర్వర్గః | బృన్దభేదాః=ఇఁకఁజెప్పఁబడునవి సమూహవిశేషముల పేళ్లు. వర్గః॥ పు॥ ౧-సమైః=ఒకతీరువస్తువుల గుంపుపేరు, A multitude of similar things, समूह. |
| సఙ్ఘసార్థౌతు (జన్తుభిః)। | సఙ్ఘః-సార్థః॥ పు॥ ౨-జన్తుభిః=ప్రాణిసమూహముపేరు, An assembly of animals, झुंड. |
| (సజాతీయైః) కులం | కులమ్॥ న॥ ౧-సజాతీయైః=సజాతీయములైన ప్రాణిసమూహముపేరు, A multitude of homogeneous animals, कुल. |
| యూథం (తిరశ్చాం పున్నపుంసకమ్)॥ ౨౫౮॥ | యూథమ్॥ పున్న॥ ౧-తిరశ్చామ్=తిర్యగ్జంతుసమూహముపేరు, A flock of birds or beasts, झुंड. |
| (పశూనాం) సమజో | సమజః॥ పు॥ ౧-పశూనామ్=పశువులగుంపుపేరు, A herd of beasts, झुंड. |

| | |
|---|---|
| (న్యేషాం) సమాజో౽. | సమాజః॥పు॥౧-అన్యేషామ్=పశువులకంటె నన్యమయిన నరపక్ష్యాది సమూహము పేరు, An assembly of men &c. समाज. |
| (థ సధర్మిణామ్)। (స్యా) న్నికాయః | నికాయః॥ పు॥ ౧-సధర్మిణామ్=ఒక్క విధమయిన నడకగలవారియొక్క గుంపుపేరు, An association of persons performing like duties. |
| పుఞ్జరాశీ తూత్కరః కూట (మస్త్రియామ్)॥ ౨౫౯॥ | పుఞ్జః-రాశిః-ఉత్కరః॥ పు॥ కూటమ్॥ పు॥ ౪-ధాన్యాదిసమూహము పేళ్లు, A heap of grain, ढेर. |
| కాపోత శౌక మాయూర తైత్తిరాదీని(తద్గణే)। | కాపోతమ్॥ న॥ = పావురములగుంపు, A flock of doves. శౌకమ్॥న॥=చిలుకలగుంపు, of parrots. మాయూరమ్॥ న॥ = నెమిళ్లగుంపు, of peacocks. తైత్తిరమ్॥న॥=తీతువులగుంపు, of francoline partridges. ఆదిపదముచేత మఱియు, తద్గణే=ఆయాగుంపున కీలాగున తెలియునది. |
| (గృహాసక్తాః పక్షిమృగా) శ్ఛేకాః(స్యు) ర్గృహ్యకా (శ్చ తే)॥ ౨౬౦॥ | ఛేకాః (పా) సేకాః-గృహ్యకాః॥ పు॥ ౨-గృహాసక్తాః = పెంపఁబడి యిల్లు మరగిన, పక్షిమృగాః = పక్షులకును మృగములకును పేళ్లు, Domesticated birds or beasts, पालतू पक्षी. |
| ఇతి సింహాదివర్గః. | సింహము మొదలైనవానితోఁ జేరిన పదసమూహము ముగిసెను. |

---

| | |
|---|---|
| మనుష్యా మానుషా మర్త్యా మనుజా | మనుష్యః-మానుషః-మర్త్యః-మనుజః - మానవః-నరః-పుమాన్॥ స్॥ పఞ్చజనః-పురు |

మూన్వా నరాః । (స్యుః)పుమాంసఃపఞ్చ జనాః పురుషాః పూరుషా నరః॥ ౨౬-౧॥

పః-పూరుషః-నా॥ ఋ, పు॥ ౧౧-మనుష్యుల పేళ్లు, Man; mankind, आदमी, मनुष्य.

స్త్రీ యోషి దబలా యోషానారీ సీమన్తినీ వధూః । ప్రతీపదర్శినీ వామా వనితా మహిలా (తథా)॥ ౨౬-౨॥

స్త్రీ-యోషిత్॥ స్త్రీ॥ (పా) యోషితా॥ ఆ॥ అబలా-యోషా (పా) జోషా-నారీ-సీమన్తినీ-వధూః-ప్రతీపదర్శినీ-వామా-వనితా - మహిలా॥ స్త్రీ॥ ౧౧ - సామాన్యముగా స్త్రీ పేళ్లు, A woman or female, स्त्री.

(విశేషా) స్త్వఙ్గనా భీరూః కామినీ వామలోచనా। ప్రమదా భామినీ కాన్తా లలనా చనితమ్బినీ॥ ౨౬-౩॥ సున్దరీ రమణీ రామా

అఙ్గనా = మంచి అవయవములు గలది, Well shaped, कोमलांगि. భీరూః = భయముగలది, Timid, भीरु. కామినీ = మిగులం గామముగలది, Loving, कामिनी. వామలోచనా=మంచి కన్నులు గలది, Having fine eyes. ప్రమదా = మిక్కిలి మదముగలది, భామినీ=శృంగార చేష్టగలది, (పా) మానినీ= ప్రణయకోపముగలది, मानिनी. కాన్తా=మిక్కిలిచక్కనిది, कान्ता. లలనా = వేడుకగలది, ललना. నితమ్బినీ = గొప్ప పిఱుదులు గలది, సున్దరీ=రూపలావణ్యముగలది, Handsome, सुन्दरी. రమణీ=నాయకుని రమింపఁజేయునది, रमणी. రామా=గీతకళాదులు నేర్చి రమించునది॥ స్త్రీ॥ ౧౨-స్త్రీ విశేషముల పేళ్లు.

కోపనా (సైవ)భామినీ।

కోపనా-భామినీ॥ స్త్రీ॥ ౨-కోపముగల స్త్రీ పేళ్లు, A passionate woman, क्रुद्ध स्त्री.

వరారోహా మత్తకాశి న్యుత్తమా వరవర్ణినీ ॥ ౨౬-౪॥

వరారోహా-మత్తకాశినీ (పా) మత్తకాసినీ-ఉత్తమా-వరవర్ణినీ॥ స్త్రీ॥ ౪-ఉత్తమస్త్రీ పేళ్లు, A handsome healthy and affectionate woman.

| | |
|---|---|
| (కృతాభిషేకా) మహిషీ | మహిషీ॥ సీ॥ ౧ - కృతాభిషేకా = రాజు పట్టపుదేవి పేరు, A queen, रानी. |
| భోగిన్యో (ఽన్యా నృపస్త్రియః)॥ | భోగిన్యః॥ సీ॥ ౧ - అన్యాః నృపస్త్రియః = పట్టపుదేవికంటెఁ దక్కిన రాజస్త్రీల పేరు, Other wives of a king, राजा की अन्य स्त्रियाँ. |
| పత్నీ పాణిగృహీతీచ ద్వితీయా సహధర్మిణీ। ౨౬౫॥ భార్యా జాయా (ఽథ పుంభూమ్ని) దారాః | పత్నీ-పాణిగృహీతీ-ద్వితీయా-సహధర్మిణీ-భార్యా-జాయా॥ సీ॥ దారాః॥ పు, బ॥ ౭-అగ్నిసాక్షికముగా వివాహము చేసికొన్నదాని పేళ్లు. మొదటి ౪ను యజ్ఞాధికారముగల పెండ్లామునకును, తక్కిన ౩ను సామాన్యమయిన పెండ్లామునకును పేళ్లని కొందఱందురు, A wife, पत्नी. |
| (స్యాత్తు) కుటుమ్బినీ। పురన్ధ్రీ | కుటుమ్బినీ-పురన్ధ్రీ॥ సీ॥ ౨-పుత్రభృత్యాది కుటుంబము గల స్త్రీ పేళ్లు, A matron, कुलवधू. |
| సుచరిత్రా తు సతీ సాధ్వీ పతివ్రతా॥ ౨౬౬॥ | సుచరిత్రా-సతీ-సాధ్వీ-పతివ్రతా॥ సీ॥ ౪-పతివ్రత పేళ్లు, A virtuous and faithful wife, सती. |
| కృతసాపత్నికాఽధ్యూఢాఽధివిన్నాఽ | కృతసాపత్నికా-అధ్యూఢా-అధివిన్నా॥ సీ॥ ౩-పెద్దపెండ్లాము పేళ్లు, The first wife, पहली स्त्री. |
| (అథ) స్వయంవరా। పతింవరా చ వర్యాఽ | స్వయంవరా-పతింవరా-వర్యా॥ సీ॥ ౩-తనంతటనే మగని వరించు స్త్రీ పేళ్లు, A bride choosing her husband, स्वयंवरा. |
| (అథ) కులస్త్రీ కులపాలికా॥ ౨౬౭॥ | కులస్త్రీ-కులపాలికా॥ సీ॥ ౨-వ్యభిచారము లేమిచేత కులమును కాపాడుకొను స్త్రీ పేళ్లు, A chaste woman, पतिव्रता. |

కన్యాకుమారీ

కన్యా (ప) కన్యకా-కుమారీ॥ సీ॥ ౨-మొదటి వయస్సున నున్న పెండ్లికాని పడుచు పేళ్లు, A virgin, कुमारी.

గౌరీ తు నగ్నికా౽నాగతార్తవా।

గౌరీ-నగ్నికా- అనాగతార్తవా॥ సీ॥ ౩-సమర్తాడని పడుచు పేళ్లు, A girl who has not menstruated, गौरी.

(స్యా) న్మధ్యమా దృష్టరజా

మధ్యమా-దృష్టరజాః॥స్,సీ॥ ౨-క్రొత్తగా సమర్తాడిన పడుచు పేళ్లు, A girl arrived at puberty, सयानी.

స్తరుణీ యువతి (స్సమే)॥ ౨౬౮॥

తరుణీ (పా) తలునీ-యువతిః॥ సీ॥ ౨-జవ్వని-౩౦ ఏండ్లకు లోఁబడిన వయస్సుగలది, A young woman, युवती.

(సమా) స్నుషా జనీవధ్వ

స్నుషా-జనీ-వధూః॥ సీ॥ ౩-కోడలి పేళ్లు, A daughter-in-law, बहू.

శ్చిరణ్టీ తు సువాసినీ।

చిరణ్టీ-సువాసినీ (పా) స్వవాసినీ॥ సీ॥ ౨-పేరఁటాలిపేళ్లు, స్వవాసినీ యను పాఠము నందుఁ బుట్టినింటనున్న స్త్రీ పేళ్లు, A married woman staying in her father's house, सुवासिनी.

ఇచ్ఛావతీ కాముకా (స్యా)

ఇచ్ఛావతీ - కాముకా॥ సీ॥ ౨-ధనాదుల యందు ఆశ గల స్త్రీ పేళ్లు, A woman covetous of wealth; eager for food, etc., इच्छावती.

ద్వృషస్యన్తీ తు కాముకీ॥ ౨౬౯॥

వృషస్యన్తీ - కాముకీ॥ సీ॥ ౨ - రతియందాసక్తిగల స్త్రీ పేళ్లు, A lustful woman, कामी स्त्री.

(కాన్తార్థినీ తు యా యాతి సఙ్కేతం సా)

అభిసారికా॥ సీ॥ ౧-కాన్తార్థినీ=పురుషునిం గోరినదై, సంకేతమ్=సంకేతస్థలమునుగూర్చి,

| | |
|---|---|
| ఽభిసారికా। | యాయాతి సా = పోవుచున్న స్త్రీ పేరు, A woman going to an assignation, अभिसारिका. |
| పుంశ్చలీ ధర్షణీ బన్ధ క్యసతీ కులటేత్వరీ॥ స్వైరిణీ పాంసులాఽ | పుంశ్చలీ - ధర్షణీ (పా) చర్షణీ - బన్ధకీ - అసతీ-కులటా-ఇత్వరీ-స్వైరిణీ - పాంసులా॥ స్త్రీ॥ ౯రంకులాఁడి పేళ్లు, An unchaste woman, कुलटा. |
| (ధస్యా) దశిశ్వీ (శిశునా వినా)। | అశిశ్వీ॥ స్త్రీ॥ ౧-శిశునావినా=బిడ్డలేని స్త్రీ పేరు, A childless woman, वांझ. |
| అవీరా (నిష్పతి సుతా) | అవీరా॥ స్త్రీ॥ ౧ - నిష్పతిసుతా=మగఁడును బిడ్డలునులేని స్త్రీ పేరు, A woman having neither husband nor children, पति-पुत्र हीन स्त्री. |
| విశ్వస్తా విధవే (సమే)॥ ౨౭౧॥ | విశ్వస్తా-విధవా॥ స్త్రీ॥ ౨-పెనిమిటిలేని స్త్రీ పేళ్లు, A widow, विधवा. |
| ఆలిస్సఖీ వయస్యా చ | ఆలిః-సఖీ-వయస్యా॥ స్త్రీ॥ ౩-చెలికత్తె పేళ్లు, A woman's female friend, सहेली. |
| పతివత్నీ సభర్తృకా। | పతివత్నీ-సభర్తృకా॥ స్త్రీ॥ ౩-ముత్తైదువ పేళ్లు, A woman whose husband is living, सुहागिनी. |
| వృద్ధా పలిక్నీ | వృద్ధా-పలిక్నీ॥ స్త్రీ॥ ౨-ముదిసిన స్త్రీ పేళ్లు, An old or grey haired woman, बूढी. |
| ప్రాజ్ఞీ తు ప్రజ్ఞా | ప్రాజ్ఞీ-ప్రజ్ఞా॥ స్త్రీ॥ ౨ - లౌకికవ్యవహారము నందు మిక్కిలి మెలుకగల స్త్రీ పేళ్లు, An intelligent woman, प्राज्ञी. |
| ప్రాజ్ఞా తు ధీమతీ॥ ౨౭౨॥ | ప్రాజ్ఞా-ధీమతీ॥ స్త్రీ॥ ౨ - ఎక్కువబుద్ధి గల స్త్రీ పేళ్లు, A wise woman, धीमती. |
| శూద్రీ (శూద్రస్య | శూద్రీ॥ స్త్రీ॥ ౧-శూద్రస్యభార్యా=శూద్ర |

భార్యా స్యా) — జాతి కానిదైనను శూద్రుని పెండ్లాము పేరు, The wife of a Sudra, शूद्राणी.

చ్ఛూద్రా (తజ్జాతి రజ్గనా)। — శూద్రా॥ సీ॥ ౧ - తజ్జాతిః అజ్గనా=శూద్ర జాతియందుఁ బుట్టిన స్త్రీ పేరు, A woman of the Sudra tribe, शूद्राणी.

ఆభీరీ తు మహా శూద్రీ (జాతిపుంయో గయో స్సమే)॥ ౨౭౩॥ — ఆభీరీ-మహాశూద్రీ॥ సీ॥ ౨ - జాతిపుంయో గయోః సమే = గొల్లజాతి స్త్రీకిని గొల్లని పెండ్లామునకును పేళ్లు, A milk woman or milkman's wife, अहीरिन.

ఆర్యాణీ (స్వయ) మర్యా (స్యాత్) — ఆర్యాణీ-ఆర్యా॥ సీ॥ ౨-వైశ్యజాతియందుఁ బుట్టిన స్త్రీ పేళ్లు, A vaisya woman, वैश्या.

క్షత్రియాక్షత్రియా ణ్యపి। — క్షత్రియా-క్షత్రియాణీ॥ సీ॥ ౨-క్షత్రియ జాతియందు బుట్టి క్షత్రియునకుగాని మరి యొకనికిగాని పెండ్లామయిన స్త్రీ పేళ్లు, A kshatriya woman, क्षत्राणी.

ఉపాధ్యాయా ప్యు పాధ్యాయీ — ఉపాధ్యాయా-ఉపాధ్యాయీ॥సీ॥ ౨-తనం తటనే చదువుచెప్పెడి స్త్రీ పేళ్లు, A female teacher, अध्यापिका.

స్యాదాచార్యాఽ (పి చ స్వతః)॥ ౨౭౪॥ — ఆచార్యా॥ సీ॥ ౧ - తనంతటనే మంత్ర వ్యాఖ్యానముచేసెడి స్త్రీ పేరు, A spiritual instructress, आचार्या.

ఆచార్యానీ (తు పుంయోగే) — ఆచార్యానీ॥సీ॥ ౧-తానుమూఢురాలైనను, పుంయోగే=ఆచార్యుని పెండ్లామైన స్త్రీ పేరు, The wife of a spiritual preceptor, आचार्य की स्त्री.

(స్యా) దర్యీ — అర్యీ॥ సీ॥ ౧ - తాను శూద్రురాలైనను

వైశ్యుని పెండ్లాము పేరు, Wife of a vaisya, वैश्या.

క్షత్త్రియా(తథా)।

క్షత్త్రియా॥ సీ॥ ౧-తాను వైశ్యురాలయి నను క్షత్త్రియుని పెండ్లాము పేరు, Wife of a kshatriya, क्षत्रियाणी.

ఉపాధ్యాయా న్యుపాధ్యాయీ

ఉపాధ్యాయానీ - ఉపాధ్యాయీ॥ సీ॥ ౨-ఉపాధ్యాయుని పెండ్లాము పేళ్లు, Wife of a tutor, उपाध्याई.

పోటా (స్త్రీ పుంసలక్షణా)॥ ౨౭౫॥

పోటా॥సీ॥ ౧-స్త్రీ పుంసలక్షణా = స్త్రీ పురుషుల లక్షణములు (మీసలు) గల స్త్రీ పేరు, A masculine woman.

వీరపత్నీ వీరభార్యా

వీరపత్నీ - వీరభార్యా॥ సీ॥ ౨ - వీరుని పెండ్లాము పేళ్లు, A hero's wife, वीरपत्नी.

వీరమాతా తు వీరసూః।

వీరమాతా॥ ఋ॥ వీరసూః॥ సీ॥ ౨-వీరుని తల్లిపేళ్లు, A hero's mother, वीर माता.

జాతాపత్యా ప్రజాతా చ ప్రసూతా చ ప్రసూతికా॥ ౨౭౬॥

జాతాపత్యా-ప్రజాతా-ప్రసూతా-ప్రసూతికా (పా) ప్రసూతకా॥సీ॥౪-బాలెంతరాలి పేళ్లు, A woman recently delivered.

(స్త్రీ) నగ్నికాకోటవీ (స్యా)

నగ్నికా (పా) లగ్నికా-కోటవీ॥ సీ॥ ౨-దిసమొలతో నుండు స్త్రీ పేళ్లు, A naked woman, नंगी स्त्री.

దూతీ సంచారికే (సమే)।

దూతీ-సంచారికా॥ సీ॥ ౨ - దూతిక పేళ్లు, A female messenger or go-between. दूती.

కాత్యాయ (న్యర్ధవృద్ధాయా కాషాయవసనాఽధవా)॥ ౨౭౭॥

కాత్యాయనీ॥ సీ॥ ౧ - యా అర్ధవృద్ధా = సగము ముదిసి, కాషాయవసనా = కావిచీర కట్టి, అధవా=విధవయై యున్న స్త్రీ పేరు.

సైరంధ్రీ (పరవేశ్మస్థా। స్వవశా శిల్పకారికా)

సైరంధ్రీ॥ స్త్రీ॥ ౧-స్వవశా=స్వతంత్రురాలై, పరవేశ్మస్థా = పరగృహమునయుండి, శిల్పకారికా=గంధ లేపన తిలక నిర్మాణాదులగు పనులు చేయు స్త్రీ పేరు.

అసిక్నీ (స్యాదవృద్ధాయా ప్రేష్యాన్తః పురచారిణీ)॥ ౨౭౮॥

అసిక్నీ॥ స్త్రీ॥ ౧ - అవృద్ధా=ముదుసలిగాక, ప్రేష్యా = రాజస్త్రీలు చెప్పినపని చేయుచు, అన్తఃపురచారిణీ=అంతఃపురమున నుండు స్త్రీ పేరు.

వారస్త్రీ గణికా వేశ్యా రూపాజీవా౽

వారస్త్రీ-గణికా-వేశ్యా-రూపాజీవా॥ స్త్రీ॥ ౪ - లంజెపేళ్లు, A courtesan or harlot, वेश्या.

(థ సా జనైః। సత్కృతా) వారముఖ్యా (స్యా)

వారముఖ్యా॥ స్త్రీ॥ ౧ - జనైః=జనులచేత, సత్కృతా = సత్కరింపబడిన, సా=ఆ లంజె పేరు, गणिका.

త్కుట్టనీ శమ్భలీ (సమే)॥ ౨౭౯॥

కుట్టనీ-శమ్భలీ (పా) సమ్భలీ॥ స్త్రీ॥ ౨-కుంటెనకత్తెపేళ్లు, లంజెను విటునికి దార్చునది, A procuress, कुटनी.

విప్రశ్నికా త్వీక్షణికా దైవజ్ఞా౽

విప్రశ్నికా-ఈక్షణికా-దైవజ్ఞా॥ స్త్రీ॥ 3 - వేల్పుసాని పేళ్లు, శుభాశుభములను దెలిసినది, A fortune-teller.

థ రజస్వలా। స్త్రీధర్మిణ్యవిరాత్రేయీ మలినీ పుష్పవత్యపి॥ ఋతుమత్యప్యుదక్యాపి

రజస్వలా - స్త్రీధర్మిణీ - అవిః-ఆత్రేయీ-మలినీ - పుష్పవతీ - ఋతుమతీ-ఉదక్యా॥ స్త్రీ॥ ౮-ముట్టయిన స్త్రీ పేళ్లు, A woman in her courses, रजस्वला.

(స్యా) ద్రజః పుష్పమార్తవమ్ ।

రజః॥ న॥ పుష్పమ్ - ఆర్తవమ్॥ న॥ 3- ముట్టునెత్తురుపేళ్లు, The courses, रज.

శ్రద్ధాలు ర్దోహదవతీ

శ్రద్ధాలుః-దోహదవతీ॥ స్త్రీ॥ ౨-గర్భవశమున

మంచివస్తువులనుగోరు స్త్రీపేళ్లు, వేవిళ్లుగలది, A pregnant woman longing for any thing.

నిష్కలా విగతార్తవా॥ ౨౮౧॥

నిష్కలా (పా) నిష్కలీ-విగతార్తవా॥ స్త్రీ॥ ౨-ముట్లుడిగిన స్త్రీ పేళ్లు, A woman past child bearing, निष्कला.

ఆపన్నసత్త్వా (స్యా) ద్గుర్విణ్యన్తర్వత్నీ చ గర్భిణీ।

ఆపన్నసత్త్వా-గుర్విణీ-అన్తర్వత్నీ-గర్భిణీ॥ స్త్రీ॥ ౪ - గర్భిణీస్త్రీ పేళ్లు, A pregnant woman, गर्भिणी.

(గణికాదేస్తు) గాణిక్యం గార్భిణం యౌవతం (గణే)॥ ౨౮౨॥

గాణిక్యమ్ - గార్భిణమ్ - యౌవతమ్॥ న॥ ౩ - గణికాదేః గణే=వరుసగా గణికా సమూహమునకును (An assemblage of harlots, गणिकाओं का समूह); గర్భిణీ సమూహ ము నకును (—of pregnant women, गर्भिणी स्त्रीयों का समूह); యువతీ సమూహ మునకును(—of young women, युवति यों का समुह).

పునర్భూర్దిధిషూ (రూఢా ద్వి)

పునర్భూః-దిధిషూః॥ స్త్రీ॥ ౨ - ద్విః=రెండు మాఱులు, ఊఢా = పెండ్లాడిన స్త్రీ, A virgin widow re-married.

(స్తస్యా) దిధిషుః (పతిః)।

దిధిషుః॥పు॥ ౧-తస్యాః పతిః=దాని రెండవ మగని పేరు, Her second husband, दूसरा पति.

(సతుద్విజో) అగ్రేదిధిషుః (సైవ యస్య కుటుమ్బినీ॥ ౨౮౩॥

అగ్రేదిధిషుః॥ పు॥ ౧ - ఆ మాఱుమనువు దానియందు బిడ్డలఁగన్న ద్విజుని పేరు, One to whom she has borne children.

కానీనః (కన్యకా జాత స్సుతో)

కానీనః॥ ౧ - కన్యకాజాతః సుతః=పెండ్లి కానిపడుచుకొడుకు పేరు, Son of an unmarried woman, कानीन.

(ఉభ) సుభగాసుతః। సౌభాగినేయః

సుభగాసుతః-సౌభాగినేయః॥ పు॥ ౨-భాగ్యవంతురాలి కొడుకుపేళ్లు, Son of an auspicious mother.

(స్యా) త్పారస్త్రైణేయ (స్తు పరస్త్రియాః)॥ ౨౦౪॥

పారస్త్రైణేయః॥ పు॥ ౧ - పరస్త్రియాః= పరస్త్రీకిఁ బుట్టిన కొడుకుపేరు, Son by another's wife.

పైతృష్వసేయః (స్యాత్) పైతృష్వస్రీయశ్చ (పితృష్వసుః)।

పైతృష్వసేయః - పైతృష్వస్రీయః॥ పు॥ ౨-పితృష్వసుః=తండ్రితోఁబుట్టినదానికొడుకు పేళ్లు, మేనత్తకొడుకు, Paternal aunt's son, फुफेरा भाई.

(సుతో మాతృష్వసుశ్చైవం)

మాతృష్వసుః సుతశ్చఏవమ్ = తల్లితోఁ బుట్టినదానికొడుకును ఇట్లే, మాతృష్వసేయః-మాతృష్వస్రీయః అనఁబడును, Maternal aunt's son, ममेरा भाई.

వైమాత్రేయో విమాతృజః॥ ౨౦౫॥

వైమాత్రేయః-విమాతృజః॥ పు॥ ౨-సవతి తల్లి కొడుకు పేళ్లు, Step-mother's son, सौतेला भाई.

(అథ) బాన్ధకినేయ స్స్యాద్బన్ధుల శ్చాసతీసుతః। కౌలటేయః కౌలటేరో

బాన్ధకినేయః-బన్ధులః-అసతీసుతః-కౌలటేయః-కౌలటేరః॥ పు॥ ౫ - అంకులాఁడికొడుకు పేళ్లు, A bastard, Son of a disloyal wife, भडुआ.

(భిక్షుకీతు సతీ యది॥ తదా) కౌలటినేయో (ఉస్యాః) కౌలటేయో (ఉపిచాత్మజః)।

కౌలటినేయః-కౌలటేయః॥ పు॥ ౨-పతివ్రతయై భిక్షార్థముగా గృహములనుగూర్చి సంచారముచేయు స్త్రీయొక్క కొడుకునకు పేళ్లు, A son of a female beggar, कौलटेय.

ఆత్మజ స్తనయస్సూను స్సుతః పుత్త్రః

ఆత్మజః-తనయః-సూనుః-సుతః-పుత్త్రః॥ పు॥ ౫-కొడుకుపేళ్లు, A son, पुत्र.

(స్త్రియాం త్వమీ॥ ౨౮౭॥ ఆహుర్దుహితరం సర్వే)

అమీ సర్వే = ఈ సగిను, స్త్రియామ్ = స్త్రీలింగమందును పర్తించి, దుహితరమాహుః = కూఁతుపేళ్లగును. అపుడు, ఆత్మజా–తనయా–సూనుః–సుతా–పుత్త్రీ–పుత్త్రికా–దుహితా॥ బు॥ అని రూపంబులు, A daughter, पुत्री.

ఉపత్యం తోకం (తయోః స్సమే)।

అపత్యమ్–తోకమ్॥ న॥ ౨–కొడుకునకును కూఁతునకును సమానమైన పేళ్లు, Off-spring, संतान.

(స్వజాతే) త్వౌరసౌరస్యౌ

ఔరసః–ఔరస్యః॥ పు॥ ౨–స్వజాతే–సవర్ణ వివాహ స్త్రీయందుఁ దనవలనఁ బుట్టిన కొడుకు పేళ్లు, A legitimate son, औरस पुत्र.

తాతస్తు జనకః పితా॥ ౨౮౮॥

తాతః–జనకః–పితా॥ బు, పు॥ ౩–తండ్రి పేళ్లు, Father, पिता.

జనయిత్రీ ప్రసూర్మాతా జననీ

జనయిత్రీ–ప్రసూః–మాతా॥ బు॥ జననీ॥ ఈ॥ ౪–తల్లిపేళ్లు, Mother, माता.

భగినీ స్వసా।

భగినీ–స్వసా॥ బు, సీ॥ ౨–తోఁబుట్టినదాని పేళ్లు, Sister, बहन.

ననన్దాతు (స్వసా పత్యు)

ననన్దా (పా) ననాన్దా॥ బు,సీ॥ ౧–మగనికి తోఁబుట్టినదాని పేరు, ఆఁడుబిడ్డ, Husband's sister, ननद.

ర్నప్త్రీపౌత్రీ (సుతాత్మజా)॥ ౨౮౯॥

నప్త్రీ (పా) నప్తా॥ బు॥ పౌత్రీ॥ సీ॥ ౨–సుతాత్మజా=కొడుకు కూఁతునకును, కూఁతు కూఁతునకును పేళ్లు, మనుమరాలు, Grand-daughter, पोती, नाती.

(భార్యాస్తు భ్రాతృవర్గస్య) యాతరః (స్యుః పరస్పరమ్)।

యాతరః॥ బు, సీ, బ॥ ౧–భ్రాతృవర్గస్య=తోడఁబుట్టినవారియొక్క, భార్యాస్తు=పెండ్లాలు, పరస్పరమ్=తమలోఁ దమకు పేరు, తోడికోడండ్రు, याता.

ప్రజావతీ భ్రాతృజాయా

ప్రజావతీ-భ్రాతృజాయా॥ స్త్రీ॥ ౨-తోడఁ బుట్టినవాని పెండ్లాము పేళ్లు, అన్నపెండ్లామని కొందఱు, भाभी.

మాతులానీతు మాతులీ॥ ౨౯౦॥

మాతులానీ-మాతులీ॥ స్త్రీ॥ ౨-మేనమామ పెండ్లాము పేళ్లు, Maternal uncle's wife, मामी.

(పతిపత్న్యోః ప్రసూః) శ్వశ్రూః

శ్వశ్రూః॥ స్త్రీ॥ ౧-పతిపత్న్యోః ప్రసూః=మగనితల్లి, లేక పెండ్లాముతల్లి, అత్త, Mother-in-law, सास.

శ్వశుర (స్తు పితా తయోః)।

శ్వశురః॥ పు॥ తయోఃపితా=మగనితండ్రికిని పెండ్లాము తండ్రికిని పేరు, మామ, Father-in-law, ससुर.

పితుర్భ్రాతా పితృవ్య (స్స్యాత్)

పితృవ్యః॥ పు॥ ౧ - పితుర్భ్రాతా=తండ్రితోఁబుట్టినవాని పేరు, Paternal uncle, चाचा, काका.

(మాతుర్భ్రాతు) మాతులః॥ ౨౯౧॥

మాతులః॥ పు॥ ౧ - మాతుర్భ్రాతా=తల్లితోఁబుట్టినవాని పేరు, మేనమామ, Maternal uncle, मामा.

స్యాలా(స్స్యుర్భ్రాతరః పత్న్యాః)

స్యాలాః (పా) శ్యాలాః॥ పు, బ॥ ౧ - పత్న్యాః భ్రాతరః = పెండ్లాము తోఁబుట్టినవారిపేరు, బావమఱఁదులు, Wife's brothers, साला.

(స్వామినో) దేవృదేవరౌ।

దేవా॥ ఋ॥ దేవరః॥ పు॥ ౨-స్వామినః=పెనిమిటితోఁబుట్టినవాని పేళ్లు, Husband's brother, जेठ देवर.

స్వస్రీయో భాగినేయ (స్స్యాత్)

స్వస్రీయః - భాగినేయః॥ పు॥ ౨-తోడఁబుట్టినదానికొడుకు పేళ్లు, మేనల్లుఁడు, Sister's son, भानजा.

జామాతా (దుహితుః పతిః)॥ ౨౯-౨॥

జామాతా॥ పు॥ ఋ॥ ౧-దుహితుః పతిః = కూఁతుమగనిపేరు, అల్లుఁడు, Son-in-law, दामाद.

పితామహః పితృపితా

పితామహః॥ పు॥ పితృపితా॥ ఋ॥ ౨ - తండ్రితండ్రిపేళ్లు, తాత, Paternal grand-father, दादा.

(తత్పితా) ప్రపితామహః।

ప్రపితామహః॥ పు॥ ౧ - తత్పితా = తాత తండ్రి, ముత్తాత, Paternal great grand-father, पर दादा.

(మాతు) ర్మాతామహా (ద్యేవం)

ఏవమ్ = ఇట్లే, మాతామహః = తల్లితండ్రి Maternal grandfather, नाना. ప్రమాతామహః = తల్లి తాత, Maternal great grandfather, पर नाना అనఁబడుదురు ఇవి ॥పు॥

సపిణ్డా (స్తు) సనాభయః॥ ౨౯-౩॥

సపిణ్డాః - సనాభయః॥ పు॥ ౨-ఏడుతరములకు లోఁబడిన జ్ఞాతుల పేళ్లు, Kinsmen बन्धु.

సమానోదర్య సోదర్య సగర్భ్య సహజా (స్సమాః)

సమానోదర్యః - సోదర్యః - సగర్భ్యః - సహజః॥ పు॥ ౪ - ఒకతల్లికొడుకుల పేళ్లు, A brother of the whole blood, भाई.

సగోత్రబాన్ధవజ్ఞాతి బన్ధుస్వస్వజనా (స్సమాః)॥ ౨౯-౪॥

సగోత్రః-బాన్ధవః-జ్ఞాతిః-బన్ధుః-స్వ॥-స్వజనః॥ పు॥ ౬-ఒకగోత్రము గల జ్ఞాతుల పేళ్లు, A distant kinsmen, बन्धु.

జ్ఞాతేయం బన్ధుతా (తేషాం క్రమాద్భావసమూహయోః)।

జ్ఞాతేయమ్॥ న॥ ౧-బన్ధుతా॥ స్త్రీ॥ ౧ - ఈ రెండును, క్రమాత్ = వరుసగా, తేషాంభావసమూహయోః = జ్ఞాతిభావమునకును (Relationship, बन्धुत्व), బంధుసమూహమున

| | |
|---|---|
| | కను (Aggregate of kinsmen). జ్ఞాతిభావ మనగా దాయాదత్వము. |
| ధవః ప్రియః పతి ర్భర్తా | ధవః-ప్రియః-పతిః-భర్తా॥ ఋ॥ పు॥ మగని పేళ్లు, Husband, पति. |
| జార స్తూపపతి(స్స మౌ)॥ ౨౯-౫౦॥ | జారః-ఉపపతిః॥ పు॥ ౨-అంకుమగని పేళ్లు, Paramour, उपपति. |
| (అమృతే జారజః) కుండో | కుండః॥ పు॥ ౧-అమృతే=మగఁడు జీవించి యుండఁగా, జారజః=అంకుమగనికిఁ బుట్టిన కొడుకు పేరు, An adulterine, जारज. |
| (మృతేభర్తరి) గో లకః | గోలకః॥ పు॥ ౧ - భర్తరిమృతే=మగఁడు చనిపోయిన వెనుక అంకుమగనికిఁ బుట్టిన కొడుకు పేరు, A widow's bastard. |
| భ్రాత్రీయో భ్రాతృ జో | భ్రాత్రీయః (పా) భ్రాతృవ్యః-భ్రాతృజః॥ పు॥ ౨ - తోడఁబుట్టినవాని కొడుకు పేళ్లు, A brother's son, भतीजा. |
| (భ్రాతృ భగిన్యౌ) భ్రాతరౌ (పుభా)॥ ౫౯-౬॥ | భ్రాతరౌ॥ ఋ, పు, ద్వి॥ ౧-భ్రాతృభగిన్యౌ ఉభౌ=తోడఁబుట్టిన యన్న చెల్లెండ్రకుఁగాని, తమ్ముఁడు అక్కలకుఁగాని పేరు. Brother and sister, भाई-बहन. |
| మాతాపితరౌ పిత రౌ మాతరపితరౌ ప్ర సూజనయితారౌ। | మాతాపితరౌ॥ ఋ॥ పితరౌ॥ ఋ॥ మాతర పితరౌ॥ అ॥ (ప) ఋ॥ ప్రసూజనయితారౌ॥ ఋ, పు, ద్వి॥ ४-తల్లిదండ్రులపేళ్లు, Father and mother, माता पिता. |
| శ్వశ్రూశ్వశురౌ శ్వశురౌ | శ్వశ్రూశ్వశురౌ-శ్వశురౌ॥ పు, ద్వి॥ ౨-అత్తమామలకు పేళ్లు, Husband's or wife's father and mother, सास ससुर. |

పుత్రౌ (పుత్రశ్చ దుహితా చ)॥ ౨౯౭॥

పుత్రౌ॥ పు, ద్వి॥ ౧-పుత్రశ్చ దుహితా చ= కొడుకునకును కూఁతునకును పేళ్లు, Son and daughter, पुत्र-पुत्री.

దమ్పతీ జమ్పతీ జాయాపతీ భార్యాపతీ (చతౌ)।

దమ్పతీ - జమ్పతీ-జాయాపతీ-భార్యాపతీ॥ పు, ద్వి॥ ౪ - ఆలుమగలపేళ్లు, Husband and wife, पति पत्नी.

గర్భాశయో జరాయుః (పుం) స్యుల్బంచ కలలో (౽స్త్రియామ్)॥ ౨౯౮॥

గర్భాశయః-జరాయుః॥ ఉ, (పా) స్, పు॥ ౨-గర్భమును చుట్టుకొనియున్న మావిపేళ్లు, Womb, गर्भ. ఉల్బమ్॥ న॥ కలలః॥ పు॥ ౨-శుక్లశోణితములు గూడినపిండము, Embryo, पिंड. ౪-మావిపేళ్లని కొందఱు.

సూతిమాసో వైజననో

సూతిమాసః-వైజననః॥ పు॥ ౨ - బిడ్డను గను నెలపేళ్లు, The last month of gestation.

గర్భో భ్రూణ (ఇమౌ సమౌ)।

గర్భః - భ్రూణః॥ పు॥ ౨ - గర్భముపేళ్లు, Fetus, गर्भ.

తృతీయా ప్రకృతి శ్శణ్ఢః క్లీబః పణ్ఢో నపుంసకమ్॥ ౨౯౯॥

తృతీయాప్రకృతిః॥ స్త్రీ॥ శణ్ఢః (పా) షణ్ఢః॥ పు॥ క్లీబః - పణ్ఢః॥ పు॥ నపుంసకమ్॥ న॥ ౫ - నపుంసకుని పేళ్లు, A eunuch, हिजड़ा.

శిశుత్వం శైశవం బాల్యం

శిశుత్వమ్-శైశవమ్-బాల్యమ్॥ న॥ 3-పది యేండ్లకు లోపలివయస్సు పేళ్లు, Childhood, बचपन.

తారుణ్యం యౌవనం (సమే)।

తారుణ్యమ్ - యౌవనమ్॥ న॥ ౨-మంచి వయస్సు పేళ్లు, Youth or manhood, जवानी.

(స్యాత్) స్థావిరం (తు) వృద్ధత్వం (వృద్ధ

స్థావిరమ్-వృద్ధత్వమ్-వార్ధకమ్ (పా) వార్ధక్యమ్॥ న॥ 3 - ఏఁబదియేండ్లకుమీఁది ముది

| | |
|---|---|
| సఙ్ఘేఽపి) వార్ధకమ్॥ 300॥ | వయస్సుపేళ్లు, Old age, बढ़ापा. వార్ధకమ్॥ ౧-వృద్ధసఙ్ఘేఽపి=వృద్ధుల సమూహమునకును పేరు, Assemblage of old men, वृद्धों का संघ. |
| పలితం (జరసా శౌక్ల్యం కేశాదౌ) | పలితమ్॥ న॥ ౧ - కేశాదౌ = వెండ్రుకలు మొదలయినవానియందలి, జరసా = ముదిమిచేత, శౌక్ల్యమ్=తెల్లఁదనముపేరు, Greyness of hair, पकना. |
| విస్రసా జరా। | విస్రసా-జరా॥సీ॥ ౨-మిక్కిలిముదిమిపేళ్లు, Decrepitude, जरा. |
| | ముందుఁ జెప్పఁగల ఉత్తానశయాదిశబ్దములకు "త్రిష్వజరావరాః" అనుచో లింగము వ్రాయఁబడును. |
| (స్యా) దుత్తానశయో డిమ్భః స్తనపా (చ) స్తనంధయీ॥ 301॥ | ఉత్తానశయా-డిమ్భా-స్తనపా॥ఆ॥ స్తనంధయీ॥ ౪ - చన్నుగుడుచు చిన్నపాపపేళ్లు, An infant, बच्चा. |
| బాల (స్తు స్యా) న్మాణవకో | బాలః - మాణవకః॥ ౨-పదియాఱేండ్లకు లోఁబడిన వయస్సుగలవానిపేళ్లు, A child, बालक. |
| వయస్థ స్తరుణో యువా। | వయస్థః-తరుణః-యువా॥న॥ 3-ప్రాయపువానిపేళ్లు, A young man, युवक. |
| ప్రవయాః స్థవిరో వృద్ధో జీనో జీర్ణో జరన్నపి॥ 302॥ | ప్రవయాః॥స॥ స్థవిరః-వృద్ధః-జీనః-జీర్ణః-జరన్॥ త్॥ ౬-ముదిసినవానిపేళ్లు, An old man, वृद्ध. |
| వర్షీయాన్ దశమీ జ్యాయాన్ | వర్షీయాన్॥స॥ దశమీ॥న॥ జ్యాయాన్॥స॥ 3 - మిక్కిలి ముదిసినవానిపేళ్లు, One very aged, अति वृद्ध. |

| | |
|---|---|
| పూర్వజ_స్త్వగ్రియోఽగ్రజః। | పూర్వజః-అగ్రియః(పా)అగ్రిమః-అగ్రజః-౩-అన్నపేళ్లు, Elder brother, first born, बड़ा भाई. అగ్ర్యః, అగ్రీయః అనియు రూపములు. |
| జఘన్యజే (స్యుః) కనిష్ఠ యవీ యోఽ వరజానుజాః॥ ౩౦౩॥ | జఘన్యజః - కనిష్ఠః-యవీయాన్॥ స్॥ అవరజః-అనుజః॥ ౫ - తమ్ముని పేళ్లు, Younger brother, छोटा भाई. కనీయాన్ - కన్యసః - యవిష్ఠః అనియు రూపములు. |
| అమాంసో దుర్బల శ్ఛాతో | అమాంసః-దుర్బలః-ఛాతః (పా) శాతః॥ ౩-బక్కవాని పేళ్లు, చిక్కినవాఁడు, Feeble; thin, दुर्बल. |
| బలవాన్ మాంస లోఽంసలః। | బలవాన్॥ త్॥ మాంసలః-అంసలః॥ ౩ - బలిసినవాని పేళ్లు, Strong; lusty, मजबूत. |
| తున్దిల స్తున్దిభ స్తున్దీ బృహత్కుక్షిః పిచణ్డిలః॥ ౩౦౪॥ | తున్దిలః-తున్దిభః (పా) తున్దికః-తున్దీ॥ న్॥ బృహత్కుక్షిః-పిచణ్డిలః (పా) పిచిణ్డిలః॥ ౫-పెద్దకడుపుగలవాని పేళ్లు, Corpulent; pot-bellied, तोंद वाला. |
| అవటీటోఽవనాట శ్చావభ్రటో నతనాసికే। | అవటీటః-అవనాటః-అవభ్రటః-నతనాసికః॥ ౪ - చప్పిడిముక్కు గలవాని పేళ్లు, Flat-nosed, चपटी नाक वाला. |
| కేశవః కేశికః కేశీ | కేశవః-కేశికః-కేశీ॥ న్॥ ౩-మంచివెండ్రుకలు గలవాని పేళ్లు, Having much or fine hair. |
| వలినో వలిభ (స్సమౌ)॥ ౩౦౫॥ | వలినః-వలిభః॥ ౨-ముదిమిచేత ముడుతలు పడినచర్మముగలవాని పేళ్లు, Flaccid. |

| | |
|---|---|
| వికలాఙ్గస్తు పోగణ్డః | వికలాఙ్గః - పోగణ్డః (పా) అపోగణ్డః॥ అంగహీనుని పేళ్లు, Deformed, अपाहिज |
| ఖర్వోహ్రస్వశ్చ వామనః। | ఖర్వః-హ్రస్వః - వామనః॥ 3 - పొట్టిః పేళ్లు, A dwarf, बौना. |
| ఖరణా (స్నాస్య) ఖరణసో | ఖరణాః॥ స్॥ ఖరణసః॥ ౨ - వాఁడిము గలవాని పేళ్లు, Sharp-nosed. |
| విగ్రో వికతనాసికః॥ 306॥ | విగ్రః (పా) విఖ్యః - వికతనాసికః॥ ముక్కు పోయినవాని పేళ్లు, Noseless, कटा. |
| ఖురణా (స్నాస్య) ఖురణసః | ఖురణాః॥ స్॥ ఖురణసః॥ ౨ - బుజ్జము గలవాని పేళ్లు, Potato-nosed, चपटी ना |
| ప్రజ్ఞుః ప్రగతజానుకః। | ప్రజ్ఞుః (పా) ప్రజ్ఞః - ప్రగతజానుకః॥ ఒకటి కొకటి యెడముగల మోఁకాళ్లు వాని పేళ్లు, Bandy-legged. |
| ఊర్ధ్వజ్ఞురూర్ధ్వజానుః (స్యాత్) | ఊర్ధ్వజ్ఞుః (పా) ఊర్ధ్వజ్ఞః-ఊర్ధ్వజానుః ౨-పొడుగు మోకాళ్లుగలవాని పేళ్లు, Lo shanked. |
| సంజ్ఞు స్సంహతజానుకః॥ 302॥ | సంజ్ఞుః (పా) సంజ్ఞః - సంహతజానుః ౨ - ముట్టిమోఁకాళ్లుగలవాని పేళ్లు, Knc kneed. |
| స్యా దేడే బధిరః | ఏడః-బధిరః॥ ౨-చెవిటివాని పేళ్లు, D बहरा. |
| కుబ్జే గడులః | కుబ్జః-గడులః॥ ౨ - ఱొమ్మునఁగాని నఁగాని కణితిగల పొట్టివాని పేళ్లు, Hu |

| | |
|---|---|
| కుకరే కూణిః | కుకరః – కుణిః (పా) కూణిః॥ ౨ – ఈచంబోయిన చేతులుగలవాని పేళ్లు, Having a withered arm, कुकर. |
| పృశ్నిరల్పతనౌ | పృశ్నిః – అల్పతనుః॥ ౨ – అల్పదేహము గలవాని పేళ్లు, కుఱుమట్టపు అలిపిరివాఁడు, Small, short or thin, पृश्नि. |
| శ్రోణః పఙ్గౌ | శ్రోణః–పఙ్గుః॥ ౨ – పిచ్చుకుంటువాని పేళ్లు, A cripple, लंगडा. |
| ముణ్డస్తుముణ్డితే॥ ౩౦౮॥ | ముణ్డః – ముణ్డితః॥ ౨ – బోడివాని పేళ్లు, Bald close-shaved मुंडित आदमी. |
| వలిరః కేకరే | వలిరః–కేకరః॥ ౨–మెల్లకంటివాని పేళ్లు, Squint-eyed, कंजा. |
| ఖోడే ఖఞ్జే | ఖోడః–ఖఞ్జః॥ ౨ – కాలుకుంటివాని పేళ్లు, Lame, लंगडा. |
| (త్రిషుజరావరాః)। | జరావరాః–త్రిషు=జరాశబ్దమునకు వెనుకఁ జెప్పిన శబ్దములన్నియు ఖఞ్జశబ్దమువఱకు॥ త్రి॥ |
| జటులః కాలకః పిప్లు స్తిలక స్తిలకాలకః॥ ౩౦౯॥ | జటులః (పా) జడులః–కాలకః–పిప్లుః – తిలకః–తిలకాలకః॥ పు॥ ౫–తిలకాకారములయిన నల్లమచ్చల పేళ్లు, పుట్టుమచ్చలు, A freckle or mole, तिल, मसा. |
| అనామయం(స్యా) దారోగ్యం | అనామయమ్–ఆరోగ్యమ్॥ న॥ ౨–రోగము లేకయుండుట పేళ్లు, Health, आरोग्य. |
| చికిత్సా (రుక్ప్రతి క్రియా)। | చికిత్సా–రుక్ప్రతిక్రియా॥ స్త్రీ॥ ౨–రోగమునకుఁ బ్రతిక్రియ చేయుట పేళ్లు, Medical treatment, इलाज. |

| | |
|---|---|
| భేషజౌషధభైష జ్యాన్యగదో జాయు (రిత్యపి)। ౩౧౦॥ | భేషజమ్-ఔషధమ్-భైషజ్యమ్॥న॥అగదః-జాయుః॥ పు॥ ౫-మందుపేళ్లు, Medicament, औषधम्. |
| (స్త్రీ) రుగ్రుజాచో పతాప రోగ వ్యాధి గదాఽఽమయాః। | రుక్॥ జ్॥ రుజా॥ స్త్రీ॥ ఉపతాపః-రోగః-వ్యాధిః-గదః-ఆమయః॥ పు॥ ౭-రోగముపేళ్లు, A disease, व्याधि. |
| (పుమాన్) యక్ష్మా క్షయశ్శోషః | యక్ష్మా॥న్॥ క్షయః-శోషః॥ పు॥ ౩-క్షయరోగముపేళ్లు, Pulmonary consumption, राजयक्ष्मा. |
| ప్రతిశ్యాయస్తు పీనసః॥ ౩౧౧॥ | ప్రతిశ్యాయః-పీనసః॥ పు॥ ౨-పీనసపడిసెముపేళ్లు, Catarrh, जुकाम. |
| (స్త్రీ) క్షుత్ క్షుతం క్షవః (పుంసి) | క్షుత్॥ధ్,స్త్రీ॥ క్షుతమ్॥ న॥ క్షవః॥ పు॥ ౩-తుమ్ముపేళ్లు, Sneezing, छींक. |
| కాసస్తు క్షవథుః (పుమాన్)। | కాసః(పా) కాశః-క్షవథుః॥పు॥ ౨-దగ్గుపేళ్లు, Cough, खाँसी. |
| శోఫస్తు శ్వయథు శ్శోథః | శోఫః-శ్వయథుః-శోథః (పా) శోషః॥ పు॥ ౩-వాపుపేళ్లు, Intumescence, सूजन. |
| పాదస్ఫోటో విపాదికా॥ ౩౧౨॥ | పాదస్ఫోటః॥ పు॥ విపాదికా॥ స్త్రీ॥ ౨-కాళ్లుపగులు కుష్ఠభేదముపేళ్లు, Kibe, बिवाई. |
| కిలాసం సిధ్మ | కిలాసమ్ - సిధ్మ॥ న్॥ (పా) సిధ్మమ్॥ న॥ ౨-సిబ్బెముపేళ్లు, Blotch, ददोरा. సిధ్మమ్ అనుచో కిలాససిధ్మే యని పాఠము. |
| కచ్ఛ్వాం (తు) పామపామే విచర్చికా। | కచ్ఛ్వాః-పామా॥ న్॥ పామా॥ ఆ॥ విచర్చికా॥ స్త్రీ॥ ౪-గజ్జిపేళ్లు, Scab, पपड़ी. |
| కణ్డూః ఖర్జూశ్చ క | కణ్డూః-ఖర్జూః-కణ్డూయా॥స్త్రీ॥ ౩-తీఁటపేళ్లు, |

| | |
|---|---|
| విస్ఫోటః పిటక (స్త్రీషు)॥ ౩౧౩॥ | విస్ఫోటః॥ పు॥ పిటకః॥ త్రి॥ ౨-పొక్కుల పేళ్లు, బొబ్బలు, Boil, फोड़ा. |
| వ్రణో (౽స్త్రియా) మీర్మమరుః (క్లీబే) | వ్రణః॥ పు॥ ఈర్మమ్-అరుః॥ స్, న॥ ౩-పుంటి పేళ్లు, Sore or wound, घाव. |
| నాడీవ్రణః (పుమాన్)। | నాడీవ్రణః॥ పు॥ ౧-సెలవేసిన పుంటి పేరు, Ulcer, फोड़ा. |
| కోఠో మణ్డలకం | కోఠః॥ పు॥ మణ్డలకమ్॥ న॥ ౨-మండలాకారమయిన కుష్ఠుపేళ్లు, ఎఱ్ఱపులుము, Leprosy with round spots, कोढ़.। |
| కుష్ఠశ్విత్రే | కుష్ఠమ్ - శ్విత్రమ్॥ న॥ ౨- తెల్లకుష్ఠుపేళ్లు, తెల్లపులుము, Leprosy, कुष्ठ. |
| దుర్నామకా౽ర్శసీ॥ ౩౧౪॥ | దుర్నామకమ్-అర్శః॥ స్, న॥ ౨-మూలవ్యాధిపేళ్లు, Hemorrhoids, बवासीर. |
| ఆనాహ (స్తు) విబన్ధ (స్స్యాత్) | ఆనాహః-విబన్ధః (పా) నిబన్ధః॥ పు॥ ౨- ఇరువాయిగట్టురోగము పేళ్లు, మలమూత్రములు గట్టుట, Epistasis. |
| గ్రహణీరుక్ప్రవాహికా। | గ్రహణీరుక్॥ జ॥ ప్రవాహికా॥ స్త్రీ॥ ౨- గ్రహణిపేళ్లు, Diarrhoea, संग्रहणी. |
| ప్రచ్ఛర్దికా వమి (శ్చ స్త్రీ పుమాంస్తు) వమథు (స్సమాః)॥ ౩౧౫॥ | ప్రచ్ఛర్దికా-వమిః (పా) వమీ॥ స్త్రీ॥ వమథుః॥ పు॥ ౩ - వాంతిపేళ్లు, కక్కువ్యాధి, Vomiting, वमन. |
| (వ్యాధిభేదా) విద్రధిః (స్త్రీ) జ్వర మేహ భగన్దరాః। | విద్రధిః॥ స్త్రీ॥ కడుపులోఁ బుట్టు బల్లగడ్డ, An internal abscess. జ్వరః॥ పు॥ జ్వరము, Fever, ज्वर. మేహః॥ పు॥ ప్రమేహము, Gonorrhoea, प्रमेह. భగన్దరః॥ పు॥ చూడ |

| | |
|---|---|
| | రాని తావునఁ బుట్టు భగందర మను వ్రణము, Fistula in ano, भगंधर. ఈ ౮ ను వ్యాధి భేదములు. |
| అశ్మరీ మూత్రకృచ్ఛ్రం (స్యాత్) | అశ్మరీ॥ సీ॥ Stone, अश्मरी. మూత్రకృచ్ఛ్రమ్॥ న॥ Strangury, मूत्रकृच्छ. ౨- మూత్రకృచ్ఛ్రము పేళ్లు. నీరు విడువఁగూడని తెవులు. |
| (పూర్వే శుక్రావధేః స్త్రీషు) ౩౧౬॥ | ఇది మొదలుకొని శుక్రావధేః = శుక్రం తేజో రేతసీచ, అను శుక్రశబ్దమువఱకు, పూర్వే = ముందుఁ జెప్పఁగల శబ్దము లన్నియు॥ స్త్రీ॥ |
| రోగహార్యగదంకారో భిషగ్వైద్యౌ చికిత్సకే। | రోగహారీ॥ న॥ అగదంకారః-భిషక్॥ జ॥ వైద్యః-చికిత్సకః॥ ౫-వైద్యుని పేళ్లు, Physician, वैद्य. |
| వార్తో నిరామయః కల్య ఉల్లాఘో (నిర్గతో గదాత్)॥ ౩౧౭॥ | వార్తః-నిరామయః-కల్యః॥ 3 - రోగము లేనివాఁడు, Healthy, तन्दुरुस्त. ఉల్లాఘః॥ ౧-గదాత్ నిర్గతః = రోగము తీఱినవాని పేళ్లు, Recovered from sickness. |
| గ్లాన గ్లాస్నూ ఆమయావీ వికృతో వ్యాధితోఽపటుః। ఆతురోఽభ్యమితోఽభ్యాన్తః | గ్లానః - గ్లాస్నుః॥ ౨ - చిక్కినవాని పేళ్లు, Emaciated or weak; कमजोर. ఆమయావీ॥ న॥ వికృతః-వ్యాధితః-అపటుః-ఆతురః-అభ్యమితః-అభ్యాన్తః॥ పు॥ ౭- తెవులుగలవాని పేళ్లు, Diseased, व्याधिग्रस्त, बीमार. |
| (సమౌ) పామనకచ్ఛురౌ॥ ౩౧౮॥ | పామనః-కచ్ఛురః॥ ౨-గజ్జిగలవాని పేళ్లు, Scabby, खुजली का रोगी. |
| దద్రుణో దద్రురోగీ (స్యాత్) | దద్రుణః-దద్రురోగీ॥ న॥ ౨ - దద్రువను కుష్ఠభేదముగలవాని పేళ్లు, Afflicted with herpes, कोढी. |

| | |
|---|---|
| అర్శోరోగయుతో ఽర్శసః\| | అర్శోరోగయుతః - అర్శసః॥ ౨ - మూలరోగముగలవాని పేళ్లు, With hemorrhoids, बवासीर का रोगी. |
| వాతకీ వాతరోగీ (స్యాత్) | వాతకీ॥ న్॥ వాతరోగీ॥ న్॥ ౨-వాతరోగముగలవాని పేళ్లు, With gout or rheumatism. |
| సాతిసారోఽతిసారకీ॥ ౩౧౯॥ | సాతిసారః - అతిసారకీ॥ న్॥ ౨ - అతిసారరోగము గలవాని పేళ్లు, With dysentery, अतिसार का रोगी. |
| (స్యుః) క్లిన్నాక్షే చుల్లచిల్లపిల్లాః (క్లిన్నేఽక్ష్ణి చాప్యమీ)\| | క్లిన్నాక్షః-చుల్లః-చిల్లః-పిల్లః॥ ౪-తడిసిన కన్నులుగలవాని పేళ్లు, Blear-eyed, चिमघा. అమీ = ఈ ౩ శబ్దములు, క్లిన్నే అక్ష్ణి = తడిసిన కంటియందును వర్తించును, Diseased eye. |
| ఉన్మత్త ఉన్మాదవతి | ఉన్మత్తః - ఉన్మాదవాన్॥ త్॥ ౨ - వెఱ్ఱియెత్తినవాని పేళ్లు, Insane, पाग. |
| శ్లేష్మలః శ్లేష్మణః కఫీ॥ ౩౨౦॥ | శ్లేష్మలః-శ్లేష్మణః - కఫీ॥ న్॥ ౩ - శ్లేష్మవ్యాధిగలవాని పేళ్లు, తెమడ తెవులు, Phlegmatic, कफ रोगी. |
| న్యుబ్జో (భుగ్నే రుజా) | న్యుబ్జః॥ ౧-రుజా = రోగముచేత, భుగ్నే = వక్రమయినవాని పేరు, Gibbous from disease, रोगपीड़ित. |
| వృద్ధనాభౌ తుణ్డిలతుణ్డిభౌ\| | వృద్ధనాభిః-తుణ్డిలః-తుణ్డిభః॥ ౩ - పొడవైన బొడ్డుగలవాని పేళ్లు, Having an elevated navel, तुण्डिभ. |
| కిలాసీ సిధ్మలో | కిలాసీ॥ న్॥ సిధ్మలః॥ ౨-సిబ్బెముగలవాని పేళ్లు, Having blotches, किलासी. |

ఽన్ధోఽదృ

అన్ధః - అదృక్॥ శ్॥ ౨ - గ్రుడ్డివానిపేళ్లు, Blind

ఙ్మూర్ఛాలే మూర్త మూర్ఛితౌ॥ ౩౨౧॥

మూర్ఛాలః - మూర్తః - మూర్ఛితః॥ ౩ - మూర్ఛరోగము గలవాని పేళ్లు, Fainting, मूर्छे.

శుక్రం తేజోరేత సీచ బీజవీర్యేన్ద్రియాణి చ।

శుక్రమ్ (పా) శుక్లమ్-తేజః॥ స్॥ రేతః॥ స్॥ బీజమ్-వీర్యమ్-ఇన్ద్రియమ్॥న॥ ౬-రేతస్సు పేళ్లు, Seed, इन्द्रिय.

మాయుః పిత్తం

మాయుః॥ పు॥ పిత్తమ్॥ న॥ ౨-పైత్యము పేళ్లు, Bile, पित्तरस.

కఫః శ్లేష్మా

కఫః-శ్లేష్మా॥ న్॥ పు॥ ౨-కఫము పేళ్లు, Phlegm, कफ.

(స్త్రియాంతు) త్వగసృగ్వరా॥ ౩౨౨॥

త్వక్॥ చ్॥ అసృగ్వరా (పా) అసృగ్ధరా॥ స్త్రీ॥ ౨-చర్మము పేళ్లు, The skin, चमड़ा.

పిశితం తరసం మాంసం పలలం క్రవ్యమామిషమ్।

పిశితమ్ - తరసమ్ - మాంసమ్-పలలమ్ - క్రవ్యమ్-ఆమిషమ్॥ న॥ ౬-మాంసము పేళ్లు, Flesh, माँस. మాంసామిషశబ్దములు ౨ ను॥ పు॥ అని కొందఱు.

ఉత్తప్తం శుష్కమాంసం (స్యాత్త) ద్వల్లూరం (త్రిలిఙ్గకమ్)॥ ౩౨౩॥

ఉత్తప్తమ్ - శుష్కమాంసమ్॥ న॥ వల్లూరమ్॥ త్రి॥ ౩ - ఎండినమాంసముపేళ్లు, Dry flesh, सूखामाँस.

రుధిరేఽసృగ్లోహితాస్రరక్తక్షతజశోణితమ్।

రుధిరమ్-అసృక్॥జ్॥లోహితమ్-అస్రమ్-రక్తమ్-క్షతజమ్-శోణితమ్॥న॥ ౭-నెత్తురుపేళ్లు, Blood, रक्त.

వృక్కాగ్రమాంసం

వృక్కా (పా) బుక్కా॥ స్త్రీ॥ అగ్రమాం

సమ్॥ న॥ ౨ - క్రోడమునందు పృక్కమని ప్రసిద్ధమైన మంచిమాంసము పేళ్లు, The therax.

హృదయం హృత్

హృదయమ్ - హృత్॥ ద్, న॥ ౨-గుండెకాయ పేళ్లు, హృదయకమలము, The heart, हृदय. వృక్కాదులు ౪ ను గుండెకాయ పేళ్లని కొందఱందురు.

మేదస్తు వపా వసా॥
౩౨౪॥

మేదః॥ స్, న॥ ౧ - హృదయమున నస్థులయందుండెడు మెదడు పేరు, The marrow of bones, मज्जा. వపా॥ సీ॥ ౧ - బొడ్డుక్రింద కోకవలెనుండు పొరమాంసము, The skin of the intestines. వసా॥ సీ॥ ౧ - అన్ని మాంసములలో మేలైన క్రొవ్వు, The serum of flesh, वसा. ఈ ౩ ను పర్యాయములని కొందఱందురు.

పశ్చాద్గ్రీవాసిరా మన్యా

మన్యా॥ సీ॥ ౧-పశ్చాద్గ్రీవాసిరా=పెడతలనుండు బోలునరము పేరు, Muscle at the nape of the neck.

నాడీతుధమని స్సిరా।

నాడీ-ధమనిః (పా) ధమనీ-సిరా (పా) శిరా॥ సీ॥ ౩-సామాన్యముగా బోలునరముల పేళ్లు, A nerve, नस.

తిలకం క్లోమ

తిలకమ్ - క్లోమ॥ న్॥ (పా) క్లోమమ్॥ న॥ ౨-కడుపులో నొకప్రక్క నెత్తునైయుండు మాంసవిశేషము పేళ్లు, నీరుతిత్తియని కొందఱు, The bladder, मूत्राशय.

మస్తిష్కం గోర్దం

మస్తిష్కమ్-గోర్దమ్॥న॥ ౨-మెదడు పేళ్లు, The brain, दिमाग.

| | |
|---|---|
| కిట్టం మలో (౭ స్త్రి యామ్)॥ ౩ ౨౫॥ | కిట్టమ్॥ న॥ మలః॥ పు॥ ౨-క్రొవ్వు, రేతస్సు, నెత్తురు, మెదడు, మూత్రము, విష్ఠ, గులిమి, చీమిడి, తెమడ, కన్నీరు, కంటిపుసి, చెమట అను పండ్రెండు మలములపేళ్లు, An excretion, मल. |
| అన్త్రం పురీతత్ | అన్త్రమ్ (పా) ఆన్త్రమ్ - పురీతత్॥ న॥ ౨-పేగులపేళ్లు, పురీతచ్ఛబ్దము పుంలింగమును, Entrails, आँतड़ी. |
| గుల్మస్తు ప్లీహా (పుంస్యథ) | గుల్మః-ప్లీహా॥ న్, పు॥ ౨-కడుపున నెడమదిక్కున పచ్చనై యుండు మాంసవిశేషము పేళ్లు, Spleen. पिलही. |
| వస్నసా। స్నాయుః (స్త్రియాం) | వస్నసా (పా) స్నసా - స్నాయుః॥ సీ॥ ౨-సన్నపునరములపేళ్లు, A tendon or muscle, स्नायु. |
| కాలఖణ్డ యకృతీ (తుసమే ఇమే)॥౩ ౨౬॥ | కాలఖణ్డమ్-యకృత్॥ న॥ ౨-కడుపున కుడిప్రక్కనున్న నల్లని మాంసవిశేషము పేళ్లు, The liver. |
| సృణికాస్యన్దినీ లాలా | సృణికా (పా) సణీకా-స్యన్దినీ-లాలా॥ సీ॥ ౩-నోటిజొల్లుపేళ్లు, Saliva, लार. |
| దూషికా (నేత్రయో ర్మలమ్)। | దూషికా (పా) దూషీకా॥ సీ॥ ౧-నేత్రయోః మలమ్=కంటిపుసిపేరు, The rheum of the eyes, दूषिका. |
| [నాసామలం తు సింఘాణం | సింఘాణమ్॥ న॥ ౧ - చీమిడిపేరు, The mucus of the nose, जुकाम. |
| పింజూషం కర్ణయో ర్మలమ్] | పింజూషమ్॥ న॥ ౧ - గులిమిపేరు, Earwax, कर्णमल. |
| మూత్రం ప్రస్రావ | మూత్రమ్॥ న॥ ప్రస్రావః॥ పు॥ ౨ - మూత్రముపేళ్లు, Urine, मूत्र. |

| | |
|---|---|
| ఉచ్చారావస్కరౌ శమలం శకృత్ ॥౩౨౭॥ పురీష గూథే వర్చస్క- (మస్త్రీ) విష్ఠావిషా (స్త్రియా)। | ఉచ్చారః - అవస్కరః॥ పు॥ శమలమ్ - శకృత్ -పురీషమ్-గూథమ్॥ ప్న॥ వర్చస్కమ్॥ ప్న॥ విష్ఠా-విట్॥ ష్॥ (పా) విట్॥ శ్॥ స్త్రీ॥ ౯- అమేధ్యము పేళ్లు, Faeces, पुरीष. |
| (స్యా) త్కర్పరః కపాలో (ఽస్త్రీ) | కర్పరః॥ పు॥ కపాలః॥ ప్న॥ ౨-తలయెముక తునుక పేళ్లు, The skull-bone, कपाल की हड्डी. |
| కీకసం కుల్యమస్థి చ॥ ౩౨౮॥ | కీకసమ్-కుల్యమ్-అస్థి॥ న॥ ౩-ఎముక పేళ్లు, Bone, हड्डी. |
| (స్యాచ్ఛరీరాస్థ్ని) కఙ్కాలః | కఙ్కాలః॥ పు॥ ౧-(చర్మమాంసరహితమై ఒకటితో నొకటి కూడుకొనియున్న) శరీరాస్థ్ని=ఒడలి యెముకల సమూహము పేరు, The skeleton, कंकाल. |
| (పృష్ఠాస్థ్నితు) కశేరుకా। | కశేరుకా॥స్త్రీ॥౧-పృష్ఠాస్థ్ని=వెన్నెముక పేరు, The back-bone, रीढ़. |
| (శిరోఽస్థ్నితు) కరోటిః (స్త్రీ) | కరోటిః॥ స్త్రీ॥ ౧-శిరోఽస్థ్ని=తలపుర్రె పేరు, The skull; cranium, कपाल, खोपड़ी. |
| (పార్శ్వాస్థనితు) పర్శుకా॥ ౩౨౯॥ | పర్శుకా॥స్త్రీ॥౧-పార్శ్వాస్థని=ప్రక్కయెముక పేరు, A rib, पसली की हड्डी. |
| అఙ్గం ప్రతీకోఽవయవోఽపఘనోఽ | అఙ్గమ్॥ న॥ ప్రతీకః-అవయవః-అపఘనః॥ పు॥ ౪ - కరచరణాద్యవయవముల పేరు, A limb, अंग. |
| థ కలేబరమ్। గాత్రం వపుస్సంహననం శరీరం వర్ష్మవిగ్రహః॥ ౩౩౦॥ కాయో దేహః (క్లీబపుంసోః స్త్రి | కలేబరమ్ - గాత్రమ్-వపుః॥ స్॥ సంహననమ్-శరీరమ్-వర్ష్మ॥న్॥న॥ విగ్రహః-కాయః॥ పు॥ దేహః॥ ప్న॥ మూర్తిః-తనుః-తనూః॥ స్త్రీ॥ ౧౨-ఒడలిపేళ్లు, తనుశబ్దము సాంతనపుంసకము గలదు, The body, शरीर. |

| | |
|---|---|
| ర్యాదా) | प्रतिज्ञा; మర్యాదా=మేర, Limit, मर्यादा. |
| శ్రద్ధా (సంప్రత్యయః స్పృహా)। | శ్రద్ధా॥ స్త్రీ॥ ౧-సంప్రత్యయః = భక్తివిశ్వాసము, Fondness, श्रद्धा; స్పృహా = ఇచ్ఛ, Belief, इच्छा. |
| మధు (మద్యే పుష్పరసే క్షౌద్రే) | మధు॥ న॥ ౧-మద్యే = మద్యము Ardent spirit, मद्य; పుష్పరసే=పూఁదేనె Nectar of flowers, फूलों का रस; క్షౌద్రే= తేనె, Honey, शहद; (అపి) చైత్రమాసము, మధువను రాక్షసుఁడు, A demon एक राक्षस; పు॥ ఇప్పచెట్టు, Bassia latifolia. |
| అన్ధం (తమస్యపి)॥ ౨౫౮॥ | అన్ధమ్॥ న॥ ౧-తమసి=చీఁకటి, Darkness, अंधेरा; (అపి) గ్రుడ్డివానికి పేరైనపుడు త్రి॥ Blind, अंधा. |
| (అథ త్రిషు) | ముందుఁ జెప్పఁగల ధాంతశబ్దములు॥ త్రి |
| సమున్నద్ధౌ (పణ్డితంమన్య గర్వితౌ)। | సమున్నద్ధః॥ త్రి॥ ౧-పణ్డితంమన్య=పండితుఁడు గాకయే తాను పండితుఁ డనుకొను వాఁడు, Conceited of learning, पंडित का गर्व करने वाला; గర్వితౌ = గర్వముగలవాఁడు, Proud, गर्वी. |
| బ్రహ్మబన్ధు (రధిక్షేపే నిర్దేశే౽) | బ్రహ్మబన్ధుః॥ త్రి॥ ౧-అధిక్షేపే=బ్రాహ్మకర్మహీనుఁడైన బ్రాహ్మణుఁడు, A nominal Brahmana, कर्महीन ब्राह्मण; నిర్దేశే ద్వేషముచేత పేర్కొనఁబడినవాఁడు, A unworthy Brahmana, अयोग्य ब्राह्मण. |

| | |
|---|---|
| (ధావలమ్బితః॥ ౨౬౦॥ అవిదూరో) ప్యవష్టబ్ధః | అవష్టబ్ధః॥ త్రి॥ ౧ - అవలమ్బితః = అవలంబింపఁబడినవాఁడు, Relied on, अवलंबित; అవిదూరః = దగ్గఱనున్నది, Near, समीप; (అపి) కట్టఁబడినవాఁడు, Bound, बधाहुआ. |
| ప్రసిద్ధౌ (ఖ్యాతభూషితౌ)। | ప్రసిద్ధః॥ త్రి॥ ౧-ఖ్యాత = ఖ్యాతిగలవాఁడు, Celebrated, प्रसिद्ध; భూషితౌ = అలంకరింపఁబడినది, Adorned, अलंकृत. |
| ఇతి ధాన్తాః | ధాన్తనానార్థకశబ్దములు ముగిసెను. |
| (సూర్యవహ్నీ) చిత్రభానూ | చిత్రభానుః॥ పు॥ ౧ - సూర్య = సూర్యునికిని, The sun, सूरज; వహ్నీ = అగ్నికిని పేరు, Fire, अग्नि. |
| భానూ (రశ్మి దివాకరౌ)॥ ౨౬౧॥ | భానుః॥ పు॥ ౧ - రశ్మి = కిరణమునకును, Ray of light, किरण; దివాకరౌ = సూర్యునికిని పేరు, The sun, सूर्य. |
| భూతాత్మానౌ (ధాతృదేహౌ) | భూతాత్మా॥ న్, పు॥ ౧ - ధాతృ = బ్రహ్మకును, Brahma, ब्रह्मा; దేహౌ = దేహమునకు పేరు, Body, शरीर. |
| (మూర్ఖనీచౌ) పృథగ్జనౌ। | పృథగ్జనః॥ పు॥ ౧ - మూర్ఖ = మూర్ఖుఁడు, An ignorant man, मूर्ख; నీచౌ = హీనజాతివాఁడు, One of low tribe, नीच जाति वाला. |
| గ్రావాణౌ (శైలపాషాణౌ) | గ్రావా॥ న్, పు॥ ౧ - శైల = పర్వతము, Mountain, पर्वत; పాషాణౌ = రాయి, Stone, पत्थर. |
| పత్త్రిణౌ (శరపక్షిణౌ)॥ ౨౬౨॥ | పత్త్రీ॥ న్, పు॥ ౧ - శర = బాణము, An arrow, शर; పక్షిణౌ = పక్షి, A bird, पक्षी. |

(తరు శైలౌ) శిఖరిణౌ

శిఖరీ॥ న్, పు॥ ౧-తరు=వృక్షము, Tree, पेड; శైలౌ=పర్వతము, Mountain, पहाड़.

శిఖినౌ (వహ్ని బర్హిణౌ)।

శిఖి॥ న్, పు॥ ౧ - వహ్ని=అగ్ని, Fire, अग्नि; బర్హిణౌ=నెమలి, A peacock, मोर.

ప్రతియత్నౌ (పుభౌ లిప్సోపగ్రహౌ)

ప్రతియత్నః॥ పు॥ ౧ - లిప్సా = అభిలాష, Desire, अभिलाष; ఉపగ్రహౌ = చెఱపట్టుట, Making prisoner, कैद करना; ప్రతీకారము, Retaliation, प्रतीकार.

(వధ) సాదినౌ॥ (ద్వౌ సారథి హయారోహౌ)

సాదీ॥ న్, పు॥ ౧ - సారథి = సారథి, Charioteer,सारथी; హయారోహౌ =గుఱ్ఱపురౌతు, Horseman, घुड़ सवार.

వాజినో (ఽశ్వేషు పక్షిణః)।

వాజీ॥ న్, పు॥ ౧ - అశ్వ = గుఱ్ఱము, Horse, घोड़ा; ఇషు = బాణము, Arrow बाण; పక్షిణః=పక్షి, Bird, पक्षी.

(కులేఽ)ప్యభిజనో (జన్మభూమ్యా మ)

అభిజనః॥ పు॥ ౧-కులే=కులము, Famil noble, birth or descent, कुलीन ; జన్మభూమ్యాం=జన్మభూమి, Native country जन्मभूमि; (అపి) కీర్తి, Fame, कीर्ति; కుల గతమయిన ధ్వజాదులు, Retinue, कुल क ध्वजा.

(ప్యథ) హాయనాః॥ ౨౬౮॥ (వర్షార్చిర్వ్రీహిభేదాస్స్యుః)

హాయనః॥ పు॥ ౧ - వర్ష = సంవత్సరము A year, वर्ष; అర్చిః = కిరణము, A ray o light, किरण; వ్రీహిభేదాః=ధాన్యవిశేషము Red rice, एक धान्य.

(చన్ద్రాగ్న్యర్కా) విరోచనాః।

విరోచనః॥ పు॥ ౧ - చన్ద్రే = చంద్రుఁడు, Moon, चन्द्र; అగ్ని = అగ్ని, Fire, अग्नि; అర్కః = సూర్యుఁడు, Sun, सूर्य.

(కేశేఽపి) వృజినో

వృజినః॥ త్రి॥ కేశే = వెండ్రుకలకును, Hair, केश; (అపి) న॥ పాపమునకును, Sin; పు॥ క్లేశమునకును, Distress, क्लेश.

విశ్వకర్మా (ర్కసురశిల్పినోః)॥ ౨౬౫॥

విశ్వకర్మా॥ న్, పు॥ అర్కః = సూర్యునికిని, The sun, सूर्य; సురశిల్పినోః = దేవశిల్పికిని, Architect of the gods, देवशिल्प.

ఆత్మా (యత్నో ధృతి ర్బుద్ధి స్స్వభావో బ్రహ్మ వర్ష్మ చ)।

ఆత్మా॥ న్, పు॥ ౧ - యత్నః = యత్నము, Care, यत्न; ధృతిః = ధైర్యము, Firmness, धैर्य; బుద్ధి = బుద్ధి, Intellect बुद्धि; స్వభావః = స్వభావము, Natural, disposition, स्वभाव; బ్రహ్మ = పరమాత్మ, The supreme Brahma, ब्रह्मा; వర్ష్మ = దేహము, Body, देह; (చ) జీవుఁడు, Sentient soul, जीव.

(శక్ర ఘాతుక మత్తేభ వర్షుకాబ్దా) ఘనాఘనాః॥ ౨౬౬॥

ఘనాఘనః॥ పు॥ ౧-శక్రే = దేవేంద్రునికిని, Indra, इन्द्र; ఘాతుక మత్తేభ = చంపు స్వభావముగల మదపుటేనుఁగునకు, A vicious elephant, खूँखार हाथी; వర్షుకాబ్దాః = వర్షించు మేఘమునకును పేరు, A rainy cloud, बादल.

అభిమానోఽ(ర్థాదిదర్పే ఽజ్ఞానే ప్రణయహింసయోః)।

అభిమానః॥ పు॥ ౧ - అర్థాదిదర్పే = ధనాదులచేత వచ్చిన గర్వము, Pride of wealth &c., धनगर्व; అజ్ఞానే = అజ్ఞానము, Igno-

rance; ప్రణయ = ప్రార్థన, Request, प्रार्थना; హింసయోః = హింస, Killing, हिंसा.

ఘనో (మేఘే మూర్తిగుణే త్రిషు మూర్తే నిరన్తరే)॥ ౨౬౭॥

ఘనః॥ పు॥ ౧ - మేఘే = మేఘము, A cloud, मेघ; మూర్తిగుణే = కాఠిన్యము, Solidity, काठिन्य; ఘనమ్॥ త్రి॥ మూర్తే = కఠినమైన, Solid, कड़ा; నిరన్తరే = దట్టమైన, Uniformly extended, घना; ఇది లోహముద్గర, (Anvil, मुद्गर) ముస్తా కాంస్యతాళాదులకును పేరు, Cymbal.

ఇన (స్సూర్యే ప్రభౌ)

ఇనః॥ పు॥ ౧ - సూర్యే = సూర్యునికిని, The sun, सूर्य; ప్రభౌ = ప్రభువునకును పేరు, A king, राजा.

రాజా (మృగాఙ్కే క్షత్రియే నృపే)।

రాజా॥ న్, పు॥ ౧-మృగాఙ్కే = చంద్రునికిని, चन्द्र; క్షత్రియే = క్షత్రియజాతివానికిని, क्षत्रिय; నృపే = భూమినేలువానికిని, ప్రభువునకును పేరు, A king, राजा.

వాణిన్యౌ (నర్తకీ దూత్యౌ)

వాణినీ॥స్త్రీ॥ ౧-నర్తకీ = నాట్యమాడు స్త్రీ, A dancing girl, वेश्या; దూత్యౌ = దూతికా స్త్రీ, Intriguing woman, दूतिका; మత్తా, A drunken woman, मदमत स्त्री; విదగ్ధే వాణిన్యౌ అని పాఠము.

(స్రవన్త్యా మపి) వాహినీ॥ ౨౬౮॥

వాహినీ॥స్త్రీ॥ ౧-స్రవన్త్యామ్ = నది, River, नदी; (అపి) సేనావిశేషము, An army, सेना.

హ్రాదిన్యౌ (వజ్ర తటితౌ)

హ్రాదినీ॥ స్త్రీ॥ ౧ - వజ్ర = వజ్రాయుధము, The thunderbolt, वज्र; తటితౌ = మెఱుపు,

Lightning, बिजली.

(వన్దాయా మపి) కామినీ।

కామినీ॥ స్త్రీ॥ ౧ - వన్దాయామ్ = బదనిక, A climbing plant, लता; (అపి) విలాసినియైన స్త్రీ, A loving woman, विलासिनी.

(త్వగ్దేహయోరపి) తనుః

తనుః॥ స్త్రీ॥ ౧-త్వక్ = తోలు, The skin, चमड़ा; దేహయోః = దేహము, Body, देह; త్రి॥ అల్పమైన, Small, छोटा; సన్నమైన, Thin, पतला.

సూనా (ఽధోజిహ్వికాఽపి చ)॥ ౨౬౯॥

సూనా॥ స్త్రీ॥ ౧ - అధోజిహ్వికా = కొండనాలుక, The uvula, तालु; (అపి) వధస్థానము, Place of execution, वध्य भूमि.

(క్రతు విస్తారయో రస్త్రీ) వితానం (త్రిషు తుచ్ఛకే। మన్దేఽథ)

వితానమ్॥ పున॥ ౧ - క్రతు = యజ్ఞము, Sacrifice, यज्ञ; విస్తారయోః = విస్తారము, Expansion, विस्तार; త్రి॥ తుచ్ఛకే = రిక్తమైన, Empty, खाली; మన్దే = మందుఁడు, Dull, मन्द.

కేతనం (కృత్యే కేతా వుపనిమన్త్రణే॥ ౨౭౦॥

కేతనమ్॥ న॥ ౧ - కృత్యే = చేయఁదగినది, An indispensable act, करने योग्य; కేతౌ = టెక్కెము, A standard or symbol, झंडा; ఉపనిమన్త్రణే = బ్రాహ్మణుల నిమంత్రణము చేయుట, An invitation, निमन्त्रण.

(వేద స్తత్త్వం తపో) బ్రహ్మ బ్రహ్మా (విప్రః ప్రజాపతిః)।

బ్రహ్మ॥ న్, న॥ ౧-వేదము, Holy writ; తత్త్వమ్ = పరమాత్మ, The supreme being, परमात्मा; తపః = తపస్సు, Devotion, तप; బ్రహ్మా॥ పు॥ విప్రః = బ్రాహ్మ

ణుడు, ब्राह्मण; ప్రజాపతిః = బ్రహ్మదేవుడు.

(ఉత్సాహనేచ హింసాయాం సూచనే చాపి) గన్ధనమ్॥ ౨౬౧॥

గన్ధనమ్॥ న॥ ౧ - ఉత్సాహనే = ఉత్సాహము, Perseverance, उत्साह; హింసాయామ్ = హింసించుట, Destruction, हिंसा; సూచనే = ఎఱిఁగించుట, Hint, सूचना; (అపి) ప్రకాశము, Manifestation.

ఆతఞ్చనం (ప్రతీవాప జవ నాప్యాయనార్థకమ్)।

ఆతఞ్చనమ్॥ న॥ ౧ - ప్రతీవాప = ప్రతివాపము, Calcining; జవన = వేగము, Speed, वेग; ఆప్యాయనార్థకమ్ = తృప్తిచేయుట, Gratifying, तृप्त करना; ప్రతీవాపము నఁగరఁగిన బంగారు మొదలైన దానిని ద్రవ్యాంతరముతోఁ గూర్చి పొడిచేయుట, పాలు తోడుపెట్టుట, Causing to curdle, जामन.

వ్యఞ్జనం (లాఞ్ఛనే శ్మశ్రు నిష్ఠానావయవేష్వపి)॥ ౨౬౨॥

వ్యఞ్జనమ్॥ న॥ ౧ - లాఞ్ఛనే = గుఱుతు, A mark, निशान, శ్మశ్రునిష్ఠానావయవేషు = గడ్డము, మీసాలు, Beard, दाढी; తిమ్మనము, Condiment; స్త్రీ పురుషుల గుహ్యావయవములు, Private part of male or female, मर्मेन्द्रिय; (అపి) కకారాదివర్ణములు, A consonant, व्यजन.

(స్యాత్) కౌలీనం (లోకవాదే యుద్ధే పశ్వహి పక్షిణామ్)।

కౌలీనమ్॥ న॥ ౧ - లోకవాదే = లోకాపవాదము, Rumour, अपवाद; పశ్వహి పక్షిణామ్ యుద్ధే = పశు సర్ప పక్షులయొక్క యుద్ధము, Combat of animals, पशुओं का युद्ध.

(స్యా) దుద్యానం (నిస్సరణే వనభేదే ప్రయోజనే)॥ ౨౭౩॥

ఉద్యానమ్॥ న॥ ౧-నిస్సరణే=గృహాదుల నుండి వెడలుట, Going forth, घर से प्रस्थान; వనభేదే=శృంగారపుతోట, A garden, बाग; ప్రయోజనే = ప్రయోజనము, Purpose, प्रयोजन.

(అవకాశే స్థితౌ) స్థానం

స్థానమ్॥న॥ ౧-అవకాశే=తావు, Place, स्थान; తెఱపి, Leisure, फुरसत; స్థితౌ = ఉనికి, Stay, स्थिति.

(క్రీడాదా వపి) దేవనమ్।

దేవనమ్॥ న॥ ౧ - క్రీడాదౌ = క్రీడ, Sport or play, खेल; (అపి) విజిగీష, Emulation, जयेच्छा; వ్యవహారము, Business, व्यवहार; ద్యుతి, Splendour, द्युति; స్తుతి, Praise, स्तुति; కాంతి, Beauty, कांति; గతి, Motion, गति; (అపి) లీలోద్యాన, Pleasure ground, उद्यान; విలాపము, Grief, विलाप; జూదము, Gambling, जूआ.

ఉత్థానం (పౌరుషే తన్త్రే సన్నివిష్టోద్గమే ఽపిచ)॥ ౨౭౪॥

ఉత్థానమ్॥ న॥ ౧ - పౌరుషే = పురుష ప్రయత్నము, Manly exertion, पुरुष प्रयत्न; తన్త్రే=సైన్యము, An army, सेना; సన్నివిష్టోద్గమే = కూర్చున్నవాఁడు లేచుట, Getting up, उठना; (అపి) మలోత్సర్గము, Evacuating (by stool &c), शौच क्रिया; హర్షము, Joy, हर्ष.

వ్యుత్థానం (ప్రతిరోధే చ విరోధాచర

వ్యుత్థానమ్॥ న॥ ౧ - ప్రతిరోధే = అడ్డుపెట్టుట, Obstruction, प्रतिरोध; విరోధా

ణే౽పిచ)।

చరణే = ప్రతికూలము చేయుట, Opposition, विरोध; (అపి) స్వాతంత్ర్యకృత్యము, Independent action, स्वतंत्र कार्य; సమాధి మానుట, Ceasing meditation, ध्यान छोडना.

(మారణే మృతసంస్కారే గతౌ ద్రవ్యే ౽ర్థదాపనే॥ ౧౭౫॥ నిర్వర్తనోపకరణానువ్రజ్యాసు చ) సాధనమ్।

సాధనమ్॥ న॥ ౧ - మారణే = చంపుట, Killing, मारना; మృతసంస్కారే = మృతుని సంస్కరించుట, Obsequies, दाह क्रिया; గతౌ = గమనము, Motion, गमन; ద్రవ్యే = వస్తువు, Substance, wealth, द्रव्य; అర్థదాపనే = అప్పుపుచ్చుకొన్న యర్థము నిప్పించుట, Enforcement of the payment of debt, ऋण चुकाना; నిర్వర్తన = సాధించుట, Accomplishing, प्राप्तकरना; ఉపకరణ = ఉపాయము, Means, उपकरण; అనువ్రజ్యాసు = వెంటఁ బోవుట, Following, पीछे चलना; (చ) సైన్యము, An army, सेना; మేఢ్రము, The penis, शिश्न.

నిర్యాతనం (వైరశుద్ధౌ దానే న్యాసార్పణే౽పిచ)॥ ౧౭౬॥

నిర్యాతనమ్॥ న॥ ౧ - వైరశుద్ధౌ = పగ సాధించుట, Revenge, बदला; దానే = దానము, Gift, दान; న్యాసార్పణే = దాఁచఁ బెట్టినది తిరుగ నిచ్చుట, Delivery of a deposit, अमानत लौटाना; (అపి) అప్పు తీర్చుట, Payment of a debt, ऋण चुकाना

వ్యసనమ్॥ న॥ విపది = ఆపద, Calamity विपत्ति; భ్రంశే = పడుట, Fall, पतन; కామజకోపజదోషే = కామక్రోధములవలనఁ బుట్టిన స్త్రీద్యూతాదిసప్తవ్యసనము, Vice, व्यसन

| | |
|---|---|
| వ్యసనం (విపది భ్రంశే దోషే. కామజ కోపజే)। | |
| పక్ష్మ (క్షీలోమ్ని కిఞ్జల్కే తన్త్వాద్యంశే ఉప్యణీయసి)॥ ౨౭౭॥ | పక్ష్మ॥ న్, న॥ అక్షిలోమ్ని = తెప్ప వెండ్రుకలు, Eye lashes, बरौनी; కిఞ్జల్కే = ఆకరువు, Filament of a flower, किंजल्क; తన్త్వాద్యంశే = సూక్ష్మమైన నూలు మొదలైన దాని తునుకలు, A short thread, महीन धागा; (అపి) పక్షుల తుప్పొడు, A wing, पंख. |
| (తిథి భేదే క్షణే) పర్వ | పర్వ॥ న్, న॥ తిథిభేదే = పున్నమ మొదలైన పర్వతిథులు, The full and change of the moon, पर्वदिन; క్షణే = ఉత్సవము, Festival, उत्सव; పున్నమ పాడ్యమి సంధికిని; కణుపు, A knot or joint, संधि; ప్రస్తావము, A chapter, एक अध्याय. |
| వర్త్మ (నేత్రచ్ఛదేఽధ్వని)। | వర్త్మ॥ న్, న॥ నేత్రచ్ఛదే = తెప్ప, Eye lid, पलक; అధ్వని = తెరువు, A road, सड़क. |
| (అకార్య గుహ్యే) కౌపీనే | కౌపీనమ్॥ న॥ అకార్యే = చేయరానిపని, An unfit act, अकार्य; గుహ్యే = గుహ్యము, Privy part, मर्म स्थल; (ప) గోచి, Covering of privy part, अंगोछा. |
| మైథునం (సఙ్గతౌ రతౌ)॥ ౨౭౮॥ | మైథునమ్॥ న॥ సంగతౌ = సంబంధము, Union, संबंध; రతౌ = సురతము, Copulation, रति. |
| ప్రధానం (పరమాత్మాధీః) | ప్రధానమ్॥ న॥ పరమాత్మా = పరమాత్మ, The supreme soul, परमात्मा; ధీః = బుద్ధి, Intellect, बुद्धि; ప్రకృతి, Nature, प्रकृति; ప్రధాని, Minister, मंत्री; ముఖ్యుడు, |

Chief, मुखिया.

ప్రజ్ఞానం (బుద్ధిచిహ్నయోః)।

ప్రజ్ఞానమ్॥ న॥ బుద్ధి=బుద్ధి, Knowledge, बुद्धि; చిహ్నయోః=గుఱుతు, Token, चिह्न.

ప్రసూనం (పుష్పఫలయోః)

ప్రసూనమ్॥ న॥ పుష్ప = పుష్పము, A blossom, फूल ; ఫలయోః = ఫలము, A fruit, फल.

నిధనం (కులనాశయోః)॥ ౨౭౯॥

నిధనమ్॥ న॥ కుల=కులము, A family, कुल; నాశయోః=నాశనము, Death, नाश.

క్రన్దనే (రోదనాఽహ్వానే)

క్రన్దనమ్॥ న॥ రోదన=ఏడ్పు, Weeping, रोदन; ఆహ్వానే = పిలుచుట, A calling, आह्वान.

వర్ష్మ (దేహప్రమాణయోః)।

వర్ష్మ॥ న్, న॥ దేహ = దేహమునకును, Body, देह; ప్రమాణయోః=కొలతకును పేరు, Measure, माप.

(గృహదేహత్విట్ప్రభావా) ధామ

ధామ॥ న్, న॥ గృహ = గృహము, A house, गृह; దేహ = దేహము, Body, देह; త్విట్ = కాంతి, Light, कांति; ప్రభావాః = ప్రభావము, Dignity or majesty, प्रभाव.

(న్యథ చతుష్పథే॥ ౨౮౦॥ సన్నివేశే చ) సంస్థానం

సంస్థానమ్॥ న॥ చతుష్పథే = నాలుగు తెరువులు గూడిన దిక్కు, Meeting of four roads, चौक; సన్నివేశే=సన్నివేశము, An open place near a town, सन्निवेश; (చ) ఆకృతి, Form, आकृति; మరణము, Death, मृत्यु; సన్నివేశ మనగా అవయవ

రచనా విశేష మని కొందఱు, Configuration; ఊరిచుట్టునుండు బయలని కొందఱు.

లక్ష్మ (చిహ్న ప్రధానయోః)।

లక్ష్మ॥ న్, న॥ చిహ్న = గుఱుతు, Token, चिह्न; ప్రధానయోః = ప్రధానము, Chief, मुख्य.

ఆచ్ఛాదనే (సంపిధాన మపవారణ మిత్యుభే)॥ ౨౮౧॥

ఆచ్ఛాదనమ్॥ న॥ సంపిధానమ్ = వస్త్రము, Clothing, वस्त्र; అపవారణమ్ = కప్పుట, Covering, ढकना.

ఆరాధనం (సాధనే స్యా దవాప్తౌ తోషణే ఽపిచ)।

ఆరాధనమ్॥ న॥ సాధనే = సిద్ధించుట, Accomplishment, सिद्धि; అవాప్తౌ = ప్రాప్తి, Attainment, प्राप्ति; తోషణే = సంతోషించుట, Gratifying, खुशी.

అధిష్ఠానం (చక్ర పురప్రభావాధ్యాసనే ష్వపి)॥ ౨౮౨॥

అధిష్ఠానమ్॥ న॥ చక్ర = బండికన్ను, Wheel, चक्र; పుర = పట్టణము, A town, शहर; ప్రభావ = ప్రభావము, Dignity, प्रभाव; అధ్యాసనేష్వపి = ఆక్రమించుట, Approach, आक्रमण.

రత్నం (స్వజాతి శ్రేష్ఠేఽపి)

రత్నమ్॥ న॥ స్వజాతిశ్రేష్ఠే = స్వజాతిలో శ్రేష్ఠమైనది, Excellent of its kind, रत्न; (అపి) వజ్రములు మొ॥ మణులు, A gem, मणि.

వనే (సలిలకాననే)।

వనమ్॥ న॥ సలిల = ఉదకమునకును, Water, पानी; కాననే = అడవికిని, Forest, जंगल.

తలినం (విరళే స్తోకే)

తలినమ్॥ త్రి॥ విరళే = పలుచనిది, Thin, महीन; (ప) నిర్మలమైనది, Clear, निर्मल;

స్తోకే=ఇంచుకంత, Small, छोटा.

(వాచ్యలిఙ్గా స్తథో త్తరే)॥ ౨౮౩॥

ఉత్తరే = ముందుఁ జెప్పఁగల నాంతశబ్దములు, తథా = ఆ తలినశబ్దమువలె, వాచ్యలిఙ్గాః=విశేష్యలింగము గలవి.

సమానా (స్సత్స మైకే స్యుః)

సమానః॥ త్రి॥ సత్ = సజ్జనునికిని, Virtuous, सज्जन; సమ = సదృశమయినదానికిని, Similar, सदृश्य; ఏకే=ఒక్కటైన వస్తువునకును పేరు, Same, वही.

పిశునా (ఖలసూచకా)।

పిశునః॥ త్రి॥ ఖల=దుర్జనునికిని, Wicked, दुर्जन; సూచకా=కొండెగానికిని పేరు, Tale-bearer, चुगलखोर.

హీన న్యూనా (వూనగర్హ్యయోః)

హీనః-న్యూనః॥ త్రి॥ ఊన = తక్కువైన, Deficient, हीन; గర్హ్య = నిందింపఁదగిన, Blamable, निंदनीय.

(వేగిశూరౌ) తరస్వినౌ॥ ౨౮౪॥

తరస్వీ॥ న్, త్రి॥ వేగి = వేగముగల, Swift, वेग; శూరౌ = బలవంతమైన, Valiant, बलवान.

అభిపన్నో (ఽపరాద్ధోఽరిగ్రస్త వ్యాపద్గతా వపి)।

అభిపన్నః॥ త్రి॥ అపరాద్ధః = అపరాధము చేసిన, Guilty, अपराधी; అరిగ్రస్త = శత్రువులచేతఁ బట్టువడిన, Fugitive, subdued, कैदी; వ్యాపద్గతావపి = ఆపదఁ బొందిన, Involved in calamity, आपन्न.

ఇతి నాన్తాః

నాన్తనానార్థకశబ్దములు ముగిసెను.

కలాపో (భూషణే బర్హే తూణీరే సంహ

కలాపః॥ పు॥ భూషణే = తొడవు, An ornament, भूषण; బర్హే = నెమలిపురి,

| | |
|---|---|
| తా వపి)॥ ౨౮౫॥ | Peacock's tail, मोर पिच्छ; తూణీరే= లపొది, A quiver; సంహతావపి = హము, Multitude, समूह. |
| (పరిచ్ఛదే) పరీవా పః (పర్యుప్తౌ సలిల స్థితౌ)। | పరీవాపః॥ పు॥ పరిచ్ఛదే=గుడారము లైనది, Furniture, सामान तंबू పర్యుప్తౌ = వెదబెట్టుట, Sowing ar बोना; సలిలస్థితౌ=నీళ్లు నిలుచుట, Sta water, इकट्ठा हुआ पानी; (ప) నీళ్ల పట్టు, A place of water, पानी का పరిచ్ఛద మనఁగా పరివారమని కొ Retinue, परिवार. |
| (గోధు గ్గోష్ఠపతీ) గోపౌ | గోపః॥ పు॥ గోధుక్ = గొల్ల A herdsman, चारवाह; గోష్ఠపతీ నేలువాఁడు, The head of a co गायों का मालिक; (ప) రాజు, A राजा; అనేక గ్రామాధికారి, Super dent of a District, ग्रामाधिकारी. |
| (హరవిష్ణూ) వృ షాకపీ॥ ౨౮౬॥ | వృషాకపిః॥ పు॥ హర = శివునికి విష్ణూ=విష్ణువునకును, विष्णु; (ప) अग्नि; ఇంద్రునికిని పేరు, इन्द्र. |
| బాష్ప (ఊష్మా శ్రు) | బాష్పః॥ పు॥ ఊష్మ=ఆవిరికి, V भाँप; అశ్రు = కన్నీళ్లకును పేరు, आँसू. |
| కశిపు (స్త్వన్న మాచ్ఛాదనం ద్వయ మ్)। | కశిపుః॥ పు॥ అన్నమ్ = అన్నము Food, अन्न; ఆచ్ఛాదనమ్=వస్త్రము Clothing, वस्त्र; ద్వయం = ఈ రెంటి |

Food and clothing, अन्न वस्त्र.

తల్పం (శయ్యాట్ట దారేషు)

తల్పమ్॥ న॥ (పా) పు॥ శయ్యా=పాన్పుకును, A bed, शय्या ; అట్ట = అట్టళ్లకును An upper story, मंजिल ; దారేషు = పెండ్లామునకును పేరు, A wife, स्त्री.

(స్తమ్బేఽపి) విటపో (ఽస్త్రియామ్)॥ ౨౮౭॥

విటపః॥ ప్న॥ స్తమ్బే = కసవుగంట, A cluster ; (అపి) చిగురు, A sprout, कोंपल; కొమ్మ, A branch, डाली.

ప్రాప్తరూప సురూపాభిరూపా (బుధమనోజ్ఞయోః। భేద్యలిఙ్గా అమీ)

(కూర్మ్యాం వీణాభేదే ఽపి) కచ్ఛపీ॥ ౨౮౮॥

ప్రాప్తరూపః - సురూపః - అభిరూపః॥ త్రి॥ 3-బుధ=విద్వాంసునికిని, Learned, विद्वान; మనోజ్ఞయోః = ఒప్పెడివానికిని పేరు, Pleasing, मनोज्ञ.

కచ్ఛపీ॥ స్త్రీ॥ కూర్మ్యాం = ఆఁడు తాఁబేలు, A female turtle, मादा कछुआ; వీణాభేదే = సరస్వతి వీణ, A lute, वीणा.

ఇతి పాన్తాః

పాన్త నానార్థకశబ్దములు ముగిసెను.

[(రవర్ణే పుంసి) రేఫ (స్స్యాత్ కుత్సితే వాచ్యలిఙ్గకః)]

రేఫః॥ రవర్ణే=రవర్ణమునకు పేరైనపుడు, పు॥ 'र' वर्ण; కుత్సితే=కుత్సితునికి పేరైనపుడు॥ త్రి॥ Vile, कुत्सित.

ఇతి ఫాన్తాః

ఫాన్త నానార్థకశబ్దములు ముగిసెను.

(అన్తరా భవసత్త్వే ఽశ్వే) గన్ధర్వో (దివ్యగాయనే)।

గన్ధర్వః॥ పు॥ అన్తరాభవసత్త్వే=అంతర పిశాచము, The soul after death and previous to its being born again, प्रेत; అశ్వే=గుఱ్ఱము, A horse, घोडा ; దివ్యగాయనే = దేవలోకమునందు పాడునట్టి విశ్వా

| | |
|---|---|
| | వసువు మొదలయినవారు, A celest musician, देवलोक का गायक. |
| కమ్బు (ర్నా వలయే శఙ్ఖే) | కమ్బుః॥ పు॥ వలయే = కడియమునకు A ring, कड़ा ; శఙ్ఖే = శంఖమునకు A conch or shell, शंख. |
| ద్విజిహ్వౌ (సర్ప సూచకౌ)॥ ౨౮౯॥ | ద్విజిహ్వః॥ పు॥ సర్పే = సర్పము, A s pent, साँप; సూచకే = కొండెగాఁడు, · informer, चुगलखोर. |
| పూర్వో (ఽన్య లిఙ్గః ప్రాగాహ పుం బహుత్వేఽపి పూర్వ జాన్)। | పూర్వః॥ త్రి॥ ప్రాక్ = పూర్వదిక్కు నుండునది, Eastern, पूर्व; పూర్వకాల నందలిది, Prior, पहला ; పూర్వాః॥ బ॥ పూర్వజాన్ ఆహ = పూర్వులైన ? పితామహాదులు, Forefathers, पूर्वज; బహుత్వేఽపి = పుంలింగ బహువచనముల వర్తించును. గంధర్వ ద్విజిహ్వ పూర్వ ములు 'వబయోరభేదః' అనుటచేత బాంతములయందుఁ జెప్పఁబడియెను. |
| ఇతి బాన్తాః | బాన్త నానార్థకశబ్దములు ముగిసెను. |
| కుమ్భౌ (ఘటేభ మూర్ధాంశౌ) | కుమ్భః॥ పు॥ ఘటే = కడవకును, A j कुंभ; ఇభమూర్ధాంశే = ఏనుఁగు కుంభస్థల నకును పేరు, Frontal globe of an e phant's head, हाथी का कुंभस्थल. |
| డిమ్భౌ తు (శిశు బాలిశౌ)॥ ౨౯౦॥ | డిమ్భః॥ పు॥ శిశు = శిశువునకును, A ch शिशु ; బాలిశే = మూర్ఖునికిని పేరు, ignorant man, मूर्ख. |
| స్తమ్భౌ (స్థూణా | స్తమ్భః॥ పు॥ స్థూణా = కంబము, Pill |

| | |
|---|---|
| జడీభావా) | स्तम्भ; జడీభావా = మ్రాన్పడియుండుట, Insensibility, जड़ीभाव. |
| శమ్భుః (బ్రహ్మ త్రిలోచనౌ)। | శమ్భుః॥ పు॥ బ్రహ్మ = బ్రహ్మకును, Brahma, ब्रह्म; త్రిలోచనౌ=శివునికిని పేరు, Siva, शिव. |
| (కుక్షి భ్రూణార్భకా) గర్భః | గర్భః॥ పు॥ కుక్షి = కడుపునకును, The belly, पेट; భ్రూణ=కడుపులోని శిశువునకును, A foetus, गर्भ; అర్భక = బాలునికిని పేరు, A child, शिशु. |
| విస్రమ్భః (ప్రణయే ఽపిచ)॥ ౨౯౧॥ | విస్రమ్భః॥ పు॥ ప్రణయే = పరిచయము, Acquaintance, परिचय; (అపి) క్రీడాకలహము, Playful dispute, खेल का झगड़ा; విశ్వాసము, Confidence, विश्वास. |
| (స్యా ద్భేర్యాం) దున్దుభిః (పుంసి స్యాదక్షే) దున్దుభిః (స్త్రియామ్)। | దున్దుభిః॥ భేర్యామ్=భేరికి పేరయినపుడు॥ పు॥ A large drum, भेरी; అక్షే=పాచికలయందుండు ఇత్తిగకు పేరైనపుడు॥ స్త్రీ॥ A die, पासा; అక్షు మనఁగా పాచికలని కొందఱు. |
| (స్యా న్మహారజనే క్లీబం) కుసుమ్భం (కరకే పుమాన్)॥ ౨౯౨॥ | కుసుమ్భమ్॥ న॥ మహారజనే = కుసుమపువ్వు, Safflower, कुसुम; పు॥ కరకే = కమండలము, A water pot, कमंडल. |
| (క్షత్రియేఽపి చ) నాభి (ర్నా) | నాభిః॥పు॥ క్షత్రియే=క్షత్రియుఁడు, क्षत्रिय; (అపి) విజిగీషుఁడయిన రాజు, An emperor, चक्रवर्ती; ప్ర॥ బొడ్డు, Navel, नाभि; స్త్రీ॥ బండికంటెనడుము, Nave of a wheel, |

| | |
|---|---|
| | धुरा; ప్రధానము, Chief point, मुख्यबात; కస్తూరి, Musk, कस्तूरी. |
| సురభి (ర్గవి చ స్త్రియామ్)। | సురభిః॥ స్త్రీ॥ గవి=ఆవు, A cow, गाय; (చ) పు॥ వసంత ఋతువు, Spring, वसंत ऋतु; త్రి॥ మంచి పరిమళము గల, Fragrant, परिमल; మనోహరమైన, Pleasing, मनोहर. |
| సభా (సంసది సభ్యే చ) | సభా॥ స్త్రీ॥ సంసది=ఆస్థానము, A hall, सभा; సభ్యే = సామాజికుఁడు, One of a company, सभासद; (చ) సమూహము, An assembly, समूह; ద్యూత మందిరము, A gambling house, जुआ खाना. |
| (త్రిష్వధ్యక్షే ఽపి) వల్లభః॥ ౨౯౩॥ | వల్లభః॥ త్రి॥ అధ్యక్షే = అధ్యక్షుఁడు, A superintendent, अध्यक्ष; (అపి) ప్రియమయినది, Beloved, प्रिय. |
| ఇతి భాన్తాః | భాన్త నానార్థకశబ్దములు ముగిసెను. |
| (కిరణ ప్రగ్రహౌ) రశ్మీ | రశ్మిః॥ పు॥ కిరణ = కిరణము, A ray of light, किरण; ప్రగ్రహౌ=పగ్గము, A rein, बागडोर. |
| (కపి భేకౌ) ప్లవఙ్గమౌ। | ప్లవఙ్గమః॥ పు॥ కపి = కోఁతి, An ape, वन्दर; భేకౌ=కప్ప, A frog, मेंढक |
| (ఇచ్ఛా మనోభవౌ) కామౌ | కామః॥ పు॥ ఇచ్ఛా = ఇచ్ఛ, Desire, इच्छा; మనోభవౌ = మన్మథుఁడు, Cupid, मन्मथ; కామమ్॥ న॥ = మిక్కిలి, Much, बहुत. |

(శౌర్యోద్యోగౌ) పరాక్రమౌ ॥ ౨ ౨౯౪॥

పరాక్రమః॥ పు॥ శౌర్య=సామర్థ్యమునకును, Power, valour, शौर्य ; ఉద్యోగః= చేయవలయు పనులం బ్రారంభించుటకును Exertion, उद्योग.

ధర్మాః (పుణ్యయమన్యాయ స్వభావాఽఽచార సోమపాః)।

ధర్మః॥ పు॥ పుణ్య = పుణ్యము, Moral and religious merit, पुण्य ; యమ = యమునకు; న్యాయ = నీతి, Justice, न्याय; స్వభావ = స్వభావము, Nature, स्वभाव ; ఆచార = ఆచారము, Usage, आचार ; సోమపాః = సోమయాజి, सोमयाजी ; (ప) యజ్ఞము, A sacrifice, यज्ञ.

(ఉపాయ పూర్వ ఆరమ్భ ఉపధా చా) వ్యుపక్రమః॥ ౨౯౫॥

ఉపక్రమః॥పు॥ ఉపాయపూర్వ ఆరమ్భః= ఉపాయము నెఱిఁగి యారంభించుట, Deliberate undertaking with knowledge of means, उपक्रम; ఉపధాచ=అమాత్యాదులను పరీక్షించుట, Test of honesty; (అపి) ఇది మొదలని చెప్పుట, Commencement.

(వణిక్పథః పురం వేదో) నిగమో

నిగమః॥ పు॥ వణిక్పథః = అంగడివీథికిని, A market, बाजार ; పురమ్ = పట్టణమునకును, A town, शहर; వేదః=వేదమునకును పేరు, Holy writ, वेद.

(నాగరో వణిక్)। నైగమౌ (ద్వౌ)

నైగమః॥ పు॥ నాగరః=పట్టణమందున్నవాఁడు, A citizen, नागरिक; వణిక్=వర్తకుఁడు, A trader, व्यापारी.

(బలే) రామో (నీల చారు సితే త్రిషు)॥

రామః॥ పు॥ బలే=బలభద్రుఁడు, बलराम; త్రి॥ నీల=నల్లనిది, Black, काला ; చారు=

| | |
|---|---|
| | ఒప్పెడిది, Pleasing, चारु; సితే=తెల్లనిది, White, सफेद. |
| (శబ్దాది పూర్వో బృన్దేఽపి) గ్రామః | గ్రామః॥ పు॥ శబ్ద=శబ్దము, ఆది=మొదలయిన శబ్దములు, పూర్వః = పూర్వమందుండినపుడు, బృన్దే = సమూహమునకు పేరు. శబ్దగ్రామః, గుణగ్రామః అని, A multitude, समूह; (అపి) ఊరికిని, A village, गाँव; స్వరసమూహమునకును పేరు, An octave in music, सप्तस्वर. |
| (క్రాన్తౌ చ) విక్రమః। | విక్రమః॥ పు॥ క్రాన్తౌ=ఆక్రమించుటకును, A stride overcoming, विक्रम; (చ) పరాక్రమమునకును పేరు, Valour, पराक्रम. |
| స్తోమః (స్తోత్రేఽధ్వరే బృన్దే) | స్తోమః॥ పు॥ స్తోత్రే=స్తోత్రము, Praise, स्तोत्र; అధ్వరే = యాగము, A sacrifice, यज्ञ; బృన్దే=సమూహము, An assembly, समूह. |
| జిహ్మ (స్తు కుటిలేఽలసే)॥ ౨౯౭॥ | జిహ్మః॥ పు॥ కుటిలే = వంకరమైనది, Crooked, कुटिल; అలసే=మందమయినది, Slow, lazy, आलस्य. |
| గుల్మో (రుక్ స్తమ్బ సేనాశ్చ) | గుల్మః॥ పు॥ రుక్ = గుల్మరోగము, A disease of the spleen, गुल्मरोग; స్తమ్బ=పొద, A bush, एक झाडी; సేనాః= సేనావిశేషము, Body of troops consisting of 9 platoons, सेना. |
| జామిః (స్వసృకులస్త్రియోః)। | జామిః (పా) యామిః॥ స్త్రీ॥ స్వసృ = తోడబుట్టినది, A sister, बहन; కుల |

స్త్రియోః=కులస్త్రీ, A chaste woman, कुलवधू; జామి॥ అవ్య॥ = ఆలస్యము, देरी.

(క్షితి క్షాన్త్యోః) క్షమా (యుక్తే) క్షమం (శక్తే హితే త్రిషు)॥ ౧౯౮॥

క్షమా॥ స్త్రీ॥ క్షితి=భూమికిని, The earth, पृथ्वी; క్షాన్త్యోః = ఓర్పునకును, Patience, क्षमा; న॥ యుక్తే=ఉచితమైనదానికిని, Fit, योग्य; త్రి॥ శక్తే=సమర్థునికిని, Able, समर्थ; హితే = హితునికిని పేరు, Benevolent, हितैषी.

(త్రిషు) శ్యామా (హరిత్కృష్ణౌ) శ్యామా (స్యా చ్ఛారిబా నిశా)।

శ్యామః॥ త్రి॥ హరిత్ = పచ్చనిదానికిని, Green, हरा; కృష్ణౌ=నల్లనిదానికిని, Black, काला; శ్యామా॥ స్త్రీ॥ శారిబా=సుగంధపాలకును, Convolvulus argenteus; నిశా = రాత్రికిని పేరు, Night, रात.

లలామం (పుచ్ఛ పుణ్డ్రాశ్వభూషా ప్రాధాన్య కేతుషు)॥ ౧౯౯॥

లలామమ్ (పా) లలామ, న్, న॥ పుచ్ఛ = తోఁక, A tail, पूछ; పుణ్డ్ర = తిలకము, A mark on the forehead, तिलक; అశ్వ=గుఱ్ఱము, A horse, घोड़ा; భూషా = ఆభరణము, An ornament, आभरण; ప్రాధాన్య=ప్రధానమయినది, Chief, प्रधान; కేతు=టెక్కెము, Flag, झंडा.

సూక్ష్మ (మధ్యాత్మమ

సూక్ష్మమ్॥ త్రి॥ అధ్యాత్మమ్=పరమాత్మ, The supreme soul, परमात्मा; (అపి) స్వల్పమైనది, An atom, अणु.

ప్యాదా ప్రధానే) ప్రథమం (త్రిషు)।

ప్రథమమ్॥ త్రి॥ ఆదా=మొదటిది, First, पहला, ప్రధానే = ముఖ్యమయినది, Chief, मुख्य.

| | |
|---|---|
| వామౌ (వల్గు ప్రతీపౌ ద్వౌ) | వామః॥ త్రి॥ వల్గు=మనోహరమయినది, Pleasing, मनोहर; ప్రతీపౌ=ప్రతికూలమయినది, Reverse, प्रतिकूल. |
| వధమౌ (న్యూన కుత్సితౌ)॥ ౩౦౦॥ | అధమః॥ త్రి॥ న్యూన = కొదువయైనది, Low, न्यून; కుత్సితౌ = నిందింపఁబడినది, Vile, कुत्सित. |
| (జీర్ణం చ పరిభుక్తం చ) యాతయామ (మిదం ద్వయమ్)। | యాతయామమ్॥ త్రి॥ జీర్ణంచ=చివికినది, Old, पुराना; పరిభుక్తంచ = అనుభవింపఁబడినది, Used, उपयोग किया हुआ. |
| ఇతి మాన్తాః | మాన్తనానార్థకశబ్దములు ముగిసెను. |
| (తురఙ్గ గరుడౌ) తార్క్ష్యౌ | తార్క్ష్యః॥ పు॥ తురంగ=గుఱ్ఱమునకును, A horse, घोडा; గరుడౌ=గరుడునికిని పేరు, Garuda, गरुड. |
| (నిలయాపచయౌ) క్షయౌ॥ ౩౦౧॥ | క్షయః॥పు॥ నిలయ=ఇంటికిని, A house, घर; అపచయౌ = నాశనమునకును పేరు, Destruction, नाश. |
| శ్వశుర్యౌ (దేవర శ్యాలౌ) | శ్వశుర్యః॥ పు॥ దేవర = మగనితోడఁ బుట్టినవాఁడు, Husband's brother, देवर; శ్యాలౌ = ఆలితోడఁ బుట్టినవాఁడు, Wife's brother, साला. |
| భ్రాతృవ్యౌ భ్రాతృజద్విషౌ। | భ్రాతృవ్యః॥ పు॥ భ్రాతృజ=తోడఁబుట్టినవాని కొడుకు, Brother's son, भतीजा; ద్విషౌ=పగవాఁడు, An enemy, शत्रु. |
| పర్జన్యౌ (రసదబ్దేన్ద్రౌ) | పర్జన్యః॥ పు॥ రసత్ = ఉఱుముచున్న, అబ్ద=మేఘము, A thunder cloud, गरजने- |

वाला मेघ; ఇన్ద్రే = ఇంద్రుఁడు, Indra, इन्द्र.

(స్యా) దర్యః (స్వామి వైశ్యయోః)॥

అర్యః॥ పు॥ స్వామి = ప్రభువు, Master, स्वामि; వైశ్యయోః = వైశ్యుఁడు, Vysia, वैश्य.

తిష్యః (పుష్యే కలియుగే)

తిష్యః॥ పు॥ పుష్యే = పుష్యనక్షత్రమునకును, पुण्य नक्षत्र; కలియుగే = కలియుగమునకును పేరు, कलियुग.

పర్యాయో (ఽవసరే క్రమే)।

పర్యాయః॥ పు॥ అవసరే = అవసరము, Opportunity, अवसर; క్రమే = వరుస, Succession, क्रम.

ప్రత్యయో (ఽధీన శపథజ్ఞాన విశ్వాసహేతుషు॥ రన్ధ్రే శబ్దే)

ప్రత్యయః॥ పు॥ అధీన = అధీనము, Subjection, अधीन; శపథ = శపథము, Oath, कसम; జ్ఞాన = తెలివి, Knowledge, ज्ञान; విశ్వాస = విశ్వాసము, Trust, विश्वास; హేతుషు = హేతువు, Cause, कारण; రన్ధ్రే = అవకాశము, A hole, छेद; శబ్దే = కృత్తద్ధితములు మొదలగు ప్రత్యయము, An affix, प्रत्यय.

ఽథానుశయో (దీర్ఘ ద్వేషానుతాపయోః)।

అనుశయః॥ పు॥ దీర్ఘ ద్వేష = దీర్ఘ ద్వేషము, An old enmity, पुराना वैर; అనుతాపయోః = పశ్చాత్తాపము, Repentance, पश्चात्ताप.

స్థూలోచ్చయ (స్త్వసాకల్యే గజానాం మధ్యమే గతే)॥ ౩౦౮॥

స్థూలోచ్చయః॥ పు॥ అసాకల్యే = సంపూర్ణముగాకుండుట, Incompleteness, अपूर्ण; గజానామ్ = ఏనుఁగులయొక్క, మధ్యమే = నడితరమైన, గతే = (తీవ్రమును మందమును

కాని) గమనము, An elephant's middle pace, हाथी की मझली चाल.

సమయ (శ్శపథా-చార కాలసిద్ధాన్త సంవిదః)। సమయః॥ పు॥ శపథ = శపథము, An oath, कसम; ఆచార = ఆచారము, Usage, आचार; కాల = కాలము, Time, काल; సిద్ధాన్త = సిద్ధాన్తము, Demonstrated conclusion, सिद्धान्त; సంవిదః = జ్ఞానము, ज्ञान; సంకేతము, Convention, परिपाटी; మొదలయినది.

(వ్యసనాన్యశుభం దైవం విపది) త్యనయా (స్త్రయః)॥ 30౫॥ అనయః॥ పు॥ వ్యసనాని = జూదము మొదలైన సప్తవ్యసనములు, Vice, व्यसन; అశుభం దైవమ్ = పూర్వమునం జేసిన యశుభకర్మము, Ill fortune, दुर्भाग्य; విపత్ = ఆపద, Calamity, आपत.

అత్యయో (ఽతిక్రమే కృచ్ఛ్రే దోషే దణ్డేఽప్య) అత్యయః॥ పు॥ అతిక్రమే = అతిక్రమించుట, Transgression, अतिक्रम; కృచ్ఛ్రే = దుఃఖము, Distress, दुःख; దోషే = దోషము, Fault, दोष; దణ్డే = దండము, Punishment, दंड; (అపి) నాశము, Destruction, नाश.

(థాఽపది యుద్ధాయత్యోః) స్సంపరాయః సంపరాయః॥ పు॥ ఆపది = ఆపద, Calamity, आपत; యుద్ధ = యుద్ధము, War, युद्ध; ఆయత్యోః = భవిష్యత్కాలము, Futurity, भविष्य.

పూజ్య (స్తు శ్వశురేఽపిచ)॥ 30౬॥ పూజ్యః॥ పు॥ శ్వశురేచ = మామ, Father-in-law, ससुर; (అపి) పూజార్హుఁడు, Respectable, पूज्य.

(పశ్చా దవస్థాయి బలం సమవాయశ్చ) సన్నయః।

సన్నయః॥ పు॥ పశ్చాత్ అవస్థాయి బలమ్ = సేనకు వెనుకనుండు దుముదారిపౌఁజు, Rear guard, अंग रक्षक ; సమవాయః = సమూహము, Multitude, समूह.

(సఙ్ఘాతే సన్నివేశే చ) సంస్త్యాయః

సంస్త్యాయః॥ పు॥ సఙ్ఘాతే = సమూహము, Assemblage, समूह; సన్నివేశే = ఊరిచుట్టు నుండు బయలు, Vicinity, खुलीजगह; (చ) గృహము, A house, घर.

ప్రణయాః (స్త్వమీ॥ విస్రమ్భ యాచ్ఞా ప్రేమాణః)

ప్రణయః॥ పు॥ విస్రమ్భ = పరిచయము, Acquaintance, परिचय ; యాచ్ఞా = అడుగుట, Solicitation, याचना; ప్రేమాణః = ప్రేమ, Affection, प्रेम.

(విరోధేఽపి) సముచ్ఛ్రయః।

సముచ్ఛ్రయః॥ పు॥ విరోధే = వైరము, Enmity, वैर; (అపి) పొడవు, Elevation, लंवाई.

విషయో (యస్య యోజ్ఞాత స్తత్ర శబ్దాదికే ష్వపి)॥ ౩౦౮॥

విషయః॥ పు॥ యస్య = ఎవనికి, యః = ఏది, జ్ఞాత = పరిచయము చేయఁబడునో, తత్ర = అది, Subject matter, विषय; శబ్దాదికేషు = శబ్దస్పర్శరూపరసగంధములు, Object of sense, विषय वासना ; (అపి) దేశము, Country, देश.

(నిర్యాసేఽపి) కషాయో (ఽస్త్రీ)

కషాయః॥ పు॥ నిర్యాసే = కషాయము, Infusion, कषाय ; (అపి) ఒకరు, Astringent; మైపూఁత, Smearing, perfume, लेपन.

(సభాయాం చ) ప్రతిశ్రయః।

ప్రతిశ్రయః॥ పు॥ సభాయామ్ = సభ, Assembly, सभा; (చ) ఉనికిపట్టు, Refuge,

शरण; గృహము, House, घर.

ప్రాయో (భూమ్న్యన్తగమనే)

ప్రాయః॥ పు॥ భూమ్ని = బాహుళ్యము, Frequency, बहुलता ; అన్తగమనే = మరణార్థమై యాహారము లేక యుండుట, Starving oneself to death, मरने के लिये भूखा रहना; ఇదికాక సమాసమునం దుత్తరపదమయిన సదృశార్థమగును, Similar, इसी तरह का.

మన్యు (ర్దైన్యే క్రతౌ క్రుధి)॥ ౩౦౯॥

మన్యుః॥ పు॥ దైన్యే = దైన్యము, Distress, दीनता ; క్రతౌ = యజ్ఞము, Sacrifice, यज्ञ; క్రుధి = కోపము, Anger, क्रोध.

(రహస్యోపస్థయో) ర్గుహ్యం

గుహ్యమ్॥ త్రి॥ రహస్య = దాఁచఁదగినది, A secret, रहस्य ; ॥న॥ ఉపస్థయోః = స్త్రీపురుష గుహ్యావయవము, Privy part, मर्मस्थल; ॥పు॥ తాఁబేలు, Tortoise, कच्छ.

సత్యం (శపథతథ్యయోః)।

సత్యమ్॥ న॥ శపథ = ఆన, An oath, ॥త్రి॥ తథ్యయోః = నిజము, Truth, सत्य; యుగభేద లోకభేదములకును పేరని కొందఱు.

వీర్యం (బలే ప్రభావే చ)

వీర్యమ్॥ న॥ బలే = సత్త్వ, Animal strength, बल ; ప్రభావే = ద్రవ్యశక్తి, Dignity, प्रभाव; (చ) రేతస్సు, Semen-virile, वीर्य; తేజస్సు, Splendour, तेज.

ద్రవ్యం (భవ్యే గుణాశ్రయే)॥ ౩౧౦॥

ద్రవ్యమ్॥ న॥ భవ్యే = మంచిపదార్థము, Substance, वस्तु, द्रव्य; గుణాశ్రయే = గుణా

| | |
|---|---|
| | శ్రయమైన వస్తువు, The substratum o qualities, गुणवान वस्तु; భవ్యుడనఁగ భాగ్యసంపన్నుఁడనియు యోగ్యుఁడనియ కొందఱు, Wealthy, right, भाग्य संपन्न. |
| ధిష్ణ్యం (స్థానే గృహేభేఽగ్నౌ) | ధిష్ణ్యమ్॥ న॥ స్థానే = తావునకును A place; గృహే=ఇంటికిని, House, घर భే=నక్షత్రమునకును, An asterism, नक्षत्र ము॥ అగ్నౌ=అగ్నికిని పేరు, अग्नि. |
| భాగ్యం (కర్మ శుభాశుభమ్)। | భాగ్యమ్॥ న॥ శుభాశుభమ్ = శుభమున అశుభమునైన, కర్మ = కర్మమునకు పేరు Destiny, good luck, ill fate, भाग्य. |
| (కశేరుహేమ్నోః) గాఙ్గేయం | గాఙ్గేయమ్॥ న॥ కశేరు=తామర కలుః మొదలయినదాని దుంపకును, A pignut कमल का मूल; హేమ్నోః = బంగారమునకు పేరు, Gold, सोना. |
| విశల్యా (దన్తికా ఽపిచ)॥ ३००॥ | విశల్యా॥ సీ॥ దన్తికాచ=దంతిచెట్టునకును (పా) పాపరచెట్టునకును, తఱిగొట్టుచెట్టు కును, నాఁగేటిచాలికూరకును పేరు. |
| వృషాకపాయీ (శ్రీగౌర్యోః) | వృషాకపాయీ॥ సీ॥ (శ్రీ) = లక్ష్మికిని लक्ष्मी; గౌర్యోః=పార్వతికిని పేరు, पार्वती. |
| రభిఖ్యా (నామశోభయోః)। | అభిఖ్యా॥ సీ॥ నామ = నామధేయమున కను, Name, नाम; శోభయోః = కాంతికి పేరు, Beauty, शोभा. |
| (ఆరమ్భ నిష్కృతి శ్శిక్షాపూజనం సం | క్రియా॥ సీ॥ ఆరమ్భః = ఉద్యోగము Beginning, आरंभ; నిష్కృతిః = ప్రాయ |

| | |
|---|---|
| ధారణమ్॥ ఉపాయః ర్మచేష్టా చ చికిత్సా నవ) క్రియాః। | శ్చిత్తము, Atonement, प्रायश्चित्त; శిక్షా = శిక్ష, Instruction, शिक्षा ; పూజనమ్ = పూజనము, Worship, पूजा ; సంప్రధారణమ్ = వ్యవహారమునందు నిశ్చయమును బుట్టించు లిఖిత సాక్ష్యాదులు, Judicial investigation, दरियाफ्त; ఉపాయః=ఉపాయము, Expedient, उपाय; కర్మ=వ్యాపారము, Act, काम ; చేష్టా = బుద్ధిపూర్వక వ్యాపారము, Practice, चेष्टा ; చికిత్సా = చికిత్స, Remedy, चिकित्सा; నవ = ఈ తొమ్మిదింటికిని పేరు, (చ) ధాత్వర్థము మొ॥ A verb, क्रिया. |
| ఛాయా (సూర్య ప్రియాకాన్తిః ప్రతిబిమ్బ మనాతపః)॥ | ఛాయా॥ సీ॥ సూర్యప్రియా = సూర్యుని భార్య, सूर्य की स्त्री ; కాన్తిః = కాంతి, Beauty, कान्ति ; ప్రతిబిమ్బమ్ = ప్రతిబిమ్బము, Reflected image, प्रतिबिंब ; అనాతపః=నీడ, Shade, छाया. |
| కక్ష్యా (ప్రకోష్ఠే హర్మ్యాదేః కాఞ్చ్యాం మధ్యేభబన్ధనే)। | కక్ష్యా॥ సీ॥ హర్మ్యాదేః=మేడలు మొదలయిన రాజగృహములయొక్క, ప్రకోష్ఠే= అంతరువులు, Enclosure of an edifice, कक्ष्या; కాఞ్చ్యమ్=మొలనూలు, A string of bells, करधनी ; మధ్యేభబన్ధనే=ఏనుఁగు నడుమునఁ గట్టు మోకు, A rope round an elephant's body. |
| కృత్యా (క్రియా దేవతయో స్త్రిషు | కృత్యా॥సీ॥ క్రియా=చేయుట, An act, काम ; దేవతయోః = దేవతావిశేషము, |

| | |
|---|---|
| భేద్యే ధనాదిభిః)॥ ३०८॥ | A certain diety, एक देवता; త్రి॥ ధనాదిభిః= ధనాదులచేత, భేద్యే=లోఁబఱచుకొనందగిన పరరాష్ట్రరాజులు మొదలయినవారు, Seduced from an alliance. |
| జన్యం (స్యాజ్జన వాదేఽపి) | జన్యమ్॥ త్రి॥ జనవాదే=లోకాపవాదము A rumour, अपवाद; (అపి) యుద్ధము॥ పు పెండ్లికొడుకు చెలికాండ్రు, Bridegroom's attendants, दूल्हे के मित्र ; పెండ్లికొమారిత భృత్యాదులు, Bride's companions, दूल्हे के सेवक ; తండ్రి, Father पिता. |
| జఘన్యో (న్త్యే ఽధమేఽపి చ)। | జఘన్యః॥ త్రి॥ అన్త్యే = వెనుకఁబుట్టిన వాఁడు, Last, आखिर ; అధమేచ = అధముఁడు, Worst, lowest, अधम ; (అపి) శిశ్నము, The penis, शिश्न. |
| (గర్హ్యాధీనౌ చ వక్తవ్యౌ | వక్తవ్యః॥ త్రి॥ గర్హ్యే = కుత్సితుఁడు Reprehensible, कुत्सित; అధీనే = చెప్పినట్టు చేయువాఁడు, Dependent, अधीन (చ) పలుకఁదగిన శబ్దము, Fit to be said कहने योग्य. |
| కల్యౌ (సజ్జనిరా మయౌ)॥ ३०९॥ | కల్యః॥ త్రి॥ సజ్జ = సంపాదింపఁబడినది Ready, तैयार; నిరామయే = రోగము లేనిది, Healthy, तन्दुरुस्त. |
| (ఆత్మవానపేతో ఽర్థా) దర్థ్యౌ | అర్థ్యః॥ త్రి॥ ఆత్మవాన్=ఎఱుకగలవాఁ డు, Intelligent, ज्ञानी; అర్థాత్=అర్థము వలన, అనపేతః = ఎడఁబాయనివానికిని పేరు Wealthy, धनवान. |

| | |
|---|---|
| పుణ్యం (తు చా ప్వపి)। | పుణ్యమ్॥ న॥ చారు = ఒప్పిడిదానికిని, Pleasing, मनोहर; (అపి) సుకృతమునకు పేరు, A good action, अच्छा काम. |
| రూప్యం (ప్రశ స్త రూపేఽపి) | రూప్యమ్॥ త్రి॥ ప్రశస్తరూపే = సౌంద ర్యముగలదానికిని, Beautiful, सुंदर; న॥ ముద్ర వేసిన బంగారునకును వెండికిని పేరు, Gold or silver coin, सोना या चांदी का सिक्का. |
| వదాన్యో (వల్గు వాగపి)॥ 3౧౬॥ | వదాన్యః॥ త్రి॥ వల్గువాక్ = లెస్సగామాట లాడువాఁడు, Eloquent, अच्छा वक्ता; (అపి) దాత, Generous, दाता. |
| (న్యాయ్యే ఽపి) మధ్యః | మధ్యః॥ త్రి॥ న్యాయ్యే = ఉచితమయినది, Just, reasonable, उचित ; (అపి) పు॥ నడుము, Middle, मध्य. |
| సౌమ్యం (తు సున్ద రే సోమదైవతే। | సౌమ్యమ్॥ త్రి॥ సున్దరే = ఒప్పెడునది, Handsome, सुंदर; సోమదైవతే=సోముఁడు దేవతగాఁగల హవిస్సూక్తములు, Sacred to the moon, चन्द्र आदि देवता ओंके सूक्त. |
| ఇతి యాన్తాః | యాన్తనానార్థకశబ్దములు ముగిసెను. |
| (నివహా ఽవసరౌ) వారౌ | వారః॥ పు॥ నివహా = సమూహము, Multitude, समूह; అవసరౌ = అవసరము, Occasion, अवसर. |
| సంస్తరౌ (ప్రస్త రాధ్వరౌ)॥ 3౧౭॥ | సంస్తరః॥ పు॥ ప్రస్తర = దర్భాదులచేతఁ జేయఁబడిన పాన్పు, A bed of grass or |

| | |
|---|---|
| | bark, कुशासन; అధ్వరం = యజ్ఞము A sacrifice, यज्ञ. |
| గురూ (గీష్పతి పిత్రాద్యా) | గురుః॥ పు॥ గీష్పతి = బృహస్పతి, Jupite बृहस्पति; పిత్రాద్య = తండ్రి మొదలై పూజ్యులు, A parent or other ven rable relative, पूज्य; భారవస్తు Heavy, great, भारी वस्तु. |
| ద్వాపరౌ (యుగ సంశయౌ)। | ద్వాపరః॥ పు॥ యుగ = మూడవయుగము The third age, द्वापरयुग; సంశయౌ సంశయము, Doubt, संशय. |
| ప్రకారౌ (భేదసా దృశ్యే) | ప్రకారః॥ పు॥ భేద = భేదమునకున Difference, भेद; సాదృశ్య = పోలికకున పేరు, Similitude, सादृश्य. |
| ఆకారౌ (ఇఙ్గితా ఽకృతీ)॥ ౩౧౮॥ | ఆకారః॥ పు॥ ఇఙ్గిత = అభిప్రాయసూచ మైన చేష్ట, Hint, इंगित; ఆకృతీ = అభిప్రాయ సూచకమైన ముఖరాగాది వికారమ Expression of the face, form, मुख कृति. |
| కింశారూ (ధాన్య శూకేషూ) | కింశారుః॥ పు॥ ధాన్యశూక = వరిముల్లు Beard of corn, जौका अग्रभाग; ఇషూ బాణము, An arrow, वाण. |
| మరూ (ధన్వధరా ధరౌ)। | మరుః॥ పు॥ ధన్వ = నిర్జలభూమి A country void of water, निर्जल भूमि ధరాధరా = పర్వతము, A mountai पहाड. |
| అద్రయో (ద్రుమ | అద్రిః॥ పు॥ ద్రుమ = వృక్షము, A tre |

| | |
|---|---|
| శైలార్కాః) | पेड़; శైల=పర్వతము, A mountain, पर्वत; అర్కాః=సూర్యుఁడు, The sun, सूर्य. |
| (స్త్రీస్తనాబ్దౌ) పయోధరౌ॥ ౩౧౯॥ | పయోధరః॥ పు॥ స్త్రీస్తన=స్త్రీస్తనము, A woman's breast, स्तन; అబ్దౌ=మేఘము, A cloud, मेघ. |
| (ధ్వాన్తారి దానవౌ) వృత్రౌ | వృత్రః॥ పు॥ ధ్వాన్త = చీఁకటి, Darkness, अंधेरा; అరి = శత్రువు, A foe, शत्रु; దానవాః=వృత్రాసురుఁడు, वृत्रासुर. |
| (బలి హస్తాంశవః) కరాః। | కరః॥ పు॥ బలి=అప్పనము, Tax, कर; హస్త=చేయి, Hand, हाथ; అంశవః = కిరణము, Ray of light, किरण. |
| ప్రదరా (భఙ్గ నారీ రుగ్బాణాః) | ప్రదరః॥ పు॥ భఙ్గః = విఱుచుట, Splitting, भंग; నారీరుక్ = స్త్రీలయొక్క రక్తస్రావ వ్యాధి, Excess of menstruation, प्रदर रोग; బాణాః = అమ్ము, An arrow, बाण. |
| అస్రాః (కచాఅపి)॥ ౩౨౦॥ | అస్రః (పా) ఆస్రః॥ పు॥ కచాః = వెండ్రుకలు, Hair, केश; (అపి) న॥ నెత్తురు, Blood, रक्त; కన్నీళ్లు, A tear, आँसू. |
| (అజాతశృఙ్గో గౌః కాలేఽప్యశ్మశ్రుర్నా చ) తూబరః। | తూబరః॥ పు॥ కాలే = కాలమునందు, అజాతశృఙ్గః = కొమ్ములురాని, గౌః = ఎద్దునకును, A hornless bull, बैल; అశ్మశ్రు = గడ్డము మీసము రాని పురుషునికిని పేరు, A beardless man, किशोर आदमी. |
| (స్వర్ణేఽపి) రాః | రాః॥ ఐ, పు॥ స్వర్ణే = బంగారు, Gold |

| | |
|---|---|
| | wealth, सोना ; (అపి) పదార్థము, Property, पदार्थ. |
| పరికరః (పర్యఙ్క-పరివారయోః)॥౩౨౧॥ | పరికరః॥ పు॥ పర్యఙ్కే = మంచము A bed, बिछावन ; పరివారయోః = పరివారము, A dependent, परिवार. |
| (ముక్తాశుద్ధౌ చ) తార (స్యాత్) | తారః॥ పు॥ ముక్తాశుద్ధౌ = ముత్యపుశుద్ధి, Elegance of a pearl, मोती की आभा ; (చ) స్త్రీ॥ నక్షత్రము, A star, नक्षत्र కనుగ్రుడ్డు, The pupil of the eye, आँख का तारा ; త్రి॥ గొప్పధ్వని, A high note ऊँची आवाज. |
| శారో వాయౌ స తు త్రిషు। (కర్బురే ఽ) | శారః॥ పు॥ వాయౌ = వాయువునకు పేరయినపుడు॥ పు॥ Air, हवा; కర్బురే = నానావర్ణములుగలదానికి పేరయినపుడు॥ త్రి॥ Variegated, रंगविरंजी. |
| (థ ప్రతిజ్ఞాఽజి సంవిదాపత్సు) సఙ్గరః॥ ౩౨౨॥ | సఙ్గరః॥ పు॥ ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞ, Promise, प्रतिज्ञा ; ఆజి = యుద్ధము, युद्ध ; సంవిత్ = క్రియానిశ్చయము, Bargain, निश्चय ; ఆపత్సు = ఆపద, Calamity, आफत. |
| (వేదభేదే గుప్తవాదే) మన్త్రో | మన్త్రః॥ పు॥ వేదభేదే = గాయత్ర్యాది వేదమంత్రములు, Prayers of the Vedas, वेदमंत्र; గుప్తవాదే = రహస్యాలోచనము, Secret consultation, रहस्य मंत्रणा. |
| మిత్రో (రవావపి)। | మిత్రః॥ పు॥ రవౌ = సూర్యునికిని, The sun, सूर्य ; (అపి) న॥ చెలికానికిని పేరు, A friend, दोस्त. |

| | |
|---|---|
| (మఖేషు యూపఖణ్డేఽపి) స్వరు | స్వరుః॥ పు॥ మఖ = యజ్ఞము, A sacrifice, यज्ञ; ఇషు = బాణము, An arrow, बाण; యూపఖణ్డే=యూపస్తంభముయొక్క తునుక, A piece of sacrificial post, यूपकाष्ठ; (అపి) వజ్రాయుధము, Thunderbolt, वज्र. |
| (గుహ్యే) ప్యవస్కరః॥ ౩౨౩॥ | అవస్కరః॥ పు॥ గుహ్యే=స్త్రీపురుషుల గుహ్యప్రదేశము, Privy part, मर्मस्थल; (అపి) మలము, Excrement, मल; కడవ యడుగు అంట్లు, Sweepings. |
| ఆడమ్బర (స్తూర్యరవే గజేన్ద్రాణాం చ గర్జితే)। | ఆడమ్బరః॥ పు॥ తూర్యరవే=వాద్యధ్వని, Noise of trumpets, वाद्य ध्वनि; గజేన్ద్రాణామ్=ఏనుఁగులయొక్క, గర్జితే=గర్జనము, Roaring of large elephants, हाथी का गर्जन; (చ) సంరంభము, Making a show, संरंभ. |
| అభిహారో (ఽభియోగే చ చౌర్యేసన్నహనేఽపి చ)॥ ౩౨౪॥ | అభిహారః॥ పు॥ అభియోగే=అపకారము చేయుట కొఱకు నెదిరించి యాక్రమించుట, A brisk assault, आक्रमण; చౌర్యే=దొంగిలించుట, Robbery, चोरी; సన్నహనే = ఆయత్తపడుట, Preparation, तैयारी. |
| (స్యా జ్జన్యే) పరీవారః (ఖడ్గకోశే పరిచ్ఛదే)। | పరీవారః॥ పు॥ జన్యే = పరిజనము, An attendant, परिवार; ఖడ్గకోశే=కత్తిఒఱ, A scabbard, म्यान; పరిచ్ఛదే=ఛత్రచామరాద్యుపకరణము, The insignia of dignity, छत्र चामर. |

కపిలే త్రిషు)। | ఘృణి; సింహ=సింహమునకును, सिंह; అంశు=కిరణమునకును, किरण; వాజిషు = గుఱ్ఱమునకును, घोडा; శుక=చిలుకకును, शुक; అహి=పామునకును, साँप; కపి=కోఁతికిని, बंदर; భేకేషు = కప్పకును, मेंढक; త్రి॥ కపిలే = బంగారుచాయగలదానికిని పేరు, Tawny, कपिल वर्ण.

శర్కరా (కర్పరాంశేఽపి) | శర్కరా॥ సీ॥ కర్పరాంశే = పెంకు, Potsherd; (అపి) మొరపనేల, Soil abounding in stony nodules, बालू; పంచదార, sugar, शक्कर.

యాత్రా (స్యాద్యాపనే గతౌ)॥ 33౦॥ | యాత్రా॥ సీ॥ యాపనే=భోజనము మొదలైన వర్తనము, Livelihood, धंधा; గతౌ=గమనము, Travelling, यात्रा.

ఇరా (భూవాక్సురాఽప్సు స్యాత్) | ఇరా॥ సీ॥ భూ = భూమి, The earth, भूमि; వాక్ = వాక్కు, Speech, वाक्; సురా = మద్యము, Ardent spirit, मद्य; అప్సు=నీళ్లు, Water, पानी.

తన్ద్రీ (నిద్రా ప్రమీలయోః)। | తన్ద్రీ (పా) తన్ద్రా॥ సీ॥ నిద్రా = నిద్ర, Drousiness, निद्रा; ప్రమీలయోః = ఒడలెఱుంగకుండుట, Lassitude, बेहोशी.

ధాత్రీ (స్యాదుపమాతాఽపి క్షితిరప్యామలక్యపి)॥ 33౧॥ | ధాత్రీ॥ సీ॥ ఉపమాతా=దాది, A nurse, दाई; క్షితిః = భూమి, The earth, भूमि; ఆమలకీ=ఉసిరికచెట్టు, An emblic myrobalan, अमलकी.

క్షుద్రా (వ్యఙ్గానటీ | క్షుద్రా॥ సీ॥ వ్యఙ్గా = అంగహీనురాలు,

| | |
|---|---|
| వేశ్యా సరఘా కణ్టకా రికా। త్రిషు క్రూరే ఽధమే ఽల్పేఽపి) క్షుద్రం | A crippled woman, अंगहीन स्त्री ; నటీ= నాట్యమాడు స్త్రీ, Dancing girl, नाचनेवाली ; వేశ్యా = వేశ్య, A whore, वेश्या ; సరఘా = తేనెటీగ, A bee, मधुमक्खी ; కణ్టకారికా = వాకుడుచెట్టు, An egg plant ; త్రి॥ క్రూరే = క్రూరుఁడు, Cruel, क्रूर ; అధమే=అధముఁడు, Low, अधम ; అల్పే= కొంచెమైనది, Trifling, अल्प; (అపి) కృపణుఁడు, Miserly, कृपण. |
| మాత్రా (పరిచ్ఛదే॥ అల్పే చ పరిమాణే చ) మాత్రం (కార్త్స్న్యేఽవధారణే)। | మాత్రా॥ సీ॥ పరిచ్ఛదే = పరివారము, Requisites, परिवार ; అల్పే = కొంచెము, A little, अल्प; పరిమాణే=కొలఁది, Quantity, परिमाण; (చ) అర్ధమాత్రావయవము॥ న॥ Half a short syllable; కార్త్స్న్యే=సకలము, The whole, पूरा; అవధారణే=నిశ్చయము, Only, मात्र. |
| (ఆలేఖ్యాఽఽశ్చర్యయోః) శ్చిత్రం | చిత్రమ్॥ న॥ ఆలేఖ్య=చిత్తరువు, Painting, चित्र ; ఆశ్చర్యయోః = అద్భుతము, Wonder, अद्भुत. |
| కలత్రం (శ్రోణిభార్యయోః)॥ 334॥ | కలత్రమ్॥ న॥ శ్రోణి=పిఱుదు, The hip and loins, कमर और जघन ; భార్యయోః= పెండ్లము, A wife, स्त्री. |
| (యోగ్య భాజనయోః) పాత్రం | పాత్రమ్॥ న॥ యోగ్య = యోగ్యుఁడు, Capable, योग्य ; భాజనయోః = భోజనపాత్రము, A vessel, भाजन ; నద్యాదుల |

| | |
|---|---|
| | రెండుదరులనడుము, The channel of a river, नाला. |
| పత్త్రం (వాహన పక్షయోః)। | పత్త్రమ్॥ న॥ వాహన = వాహనము, A vehicle, वाहन; పక్షయోః = ఱెక్క, A wing, पंख. |
| (నిదేశ గ్రన్థయోః) శాస్త్రం | శాస్త్రమ్॥ న॥ నిదేశ = ఆజ్ఞ, Command, आज्ञा; గ్రన్థయోః = వ్యాకరణాది గ్రంథములు, Institutes of a science, व्याकरण ग्रन्थ. |
| శస్త్ర (మాయుధ లోహయోః)॥ ౩౩౫॥ | శస్త్రమ్॥ న॥ ఆయుధ = ఆయుధము, A weapon, शस्त्र; లోహయోః = లోహము, Iron, लोहा. |
| (స్యా జ్జటాంశుకయోః) ర్నేత్రం | నేత్రమ్॥ న॥ జటా = చెట్టువేరు, Root of a tree, जड; అంశుకయోః = వెలిపట్టుచీర, Woven silk bleached, रेशमी साडी, ఇదిగాక కంటికిని పేరు, An eye, आँख. The rope of a churn, |
| క్షేత్రం (పత్నీశరీరయోః)। | క్షేత్రమ్॥ న॥ పత్నీ = పెండ్లము, A wife, स्त्री; శరీరయోః = దేహము, Body, शरीर; మడి, A field, खेत; సిద్ధస్థానము, A holy spot, पवित्र जगह. |
| (ముఖాగ్రే క్రోడహలయోః) పోత్రం | పోత్రమ్॥ న॥ క్రోడహలయోఃముఖాగ్రే = పందిమూతి, Snout of a hog, सुअर के मुख का अग्र भाग; నాఁగేటి కొన, Fore-part of a plough, हल का अग्र भाग. |
| గోత్రం (తు నామ్ని చ)॥ ౩౩౬॥ | గోత్రమ్॥ న॥ నామ్ని = నామధేయము, Name, नाम; (చ) కులము, Family, race, |

| | |
|---|---|
| | కుల; ద్రవ్యము, Wealth, धन; వు॥ పర్వతము, Mountain, पर्वत; స్త్రీ॥ భూమి, The earth, भूमि; గోసమూహము, A herd of kine, गायों का समूह. |
| సత్త్ర (మాచ్ఛాదనే యజ్ఞే సదాదానే వనే ఽపిచ)। | సత్త్రమ్॥ న॥ ఆచ్ఛాదనే = గృహము, A house covering, घर आच्छादन; యజ్ఞే = యజ్ఞవిశేషము, Sacrifice, यज्ञ; సదా దానే = ఎడతెగని యీవి, Liberality, महतदान; వనేచ = వనము, A forest, जंगल; (అపి) దంభము, Fraud, दंभ. |
| అజిరం (విషయే కాయే) | అజిరమ్॥ న॥ విషయే = శబ్దాదివిషయము, Object of perception, शब्दादि के विषय; కాయే = శరీరము, Body, शरीर; (అపి) ముంగిలి, A court-yard, अंगन; వాయువు, Wind, वायु. |
| వ్యమ్బరం (వ్యోమ్ని వాససి)॥ 332॥ | అమ్బరమ్॥ న॥ వ్యోమ్ని = ఆకాశము, The sky, आकाश; వాససి = వస్త్రము, Apparel, वस्त्र. |
| చక్రం (రాష్ట్రే) | చక్రమ్॥ న॥ రాష్ట్రే = దేశము, Realm, राष्ट्र; (అపి) సైన్యము, An army, सेना; బండికన్ను, Wheel, चक्र; సుడిగుండము, Whirlpool, भँवर; కమ్మరసాన, A potter's wheel, कुम्हार का पहिया; ఆయుధవిశేషము, A sharp discus, एक शस्त्र; పు॥ చక్రవాకపక్షి, A ruddy goose, चकवाह; సమూహము, Multitude, समूह. |

| | |
|---|---|
| ఉప్యక్షరం (తు మోక్షేఽపి) | అక్షరమ్॥ న॥ మోక్షే=మోక్షము, The final beatitude, मोक्ष; (అపి) అకారాది వర్ణము, A letter, एक अक्षर; పరబ్రహ్మము, The supreme soul, आत्मा. |
| క్షీర (మప్సు చ)। | క్షీరమ్॥ న॥ అప్సు=నీళ్లు, Water, पानी; (చ) పాలు, Milk, दूध. |
| (స్వర్ణేఽపి) భూరి (చన్ద్రౌ ద్వౌ) | భూరి॥ న॥ స్వర్ణే = బంగారము, Gold, सोना; (అపి) త్రి॥ బహుళము, Numerous, बहुल; చన్ద్రః॥ పు॥ బంగారము, सोना; (అపి) చంద్రుఁడు, కర్పూరము, Camphor, कर्पूर; జలము, Water, पानी. |
| (ద్వారమాత్రేఽపి) గోపురమ్॥ ౩౩౮॥ | గోపురమ్॥ న॥ ద్వారమాత్రే = వాకిలి మాత్రము, Door, दर्वाजा; (అపి) పట్టణపు వాకిలి, A town gate, शहर का मुखद्वार; తుంగముస్తలు, Cyperus grass, एक तरह का घास. |
| (గుహాదమ్భ) గహ్వరే (ద్వే) | గహ్వరమ్॥ న॥ గుహా=గుహ, A cavern, गुहा; దమ్భ = కపటము, Pride, fraud, दंभ. |
| (రహోఽన్తిక) ముపహ్వరే। | ఉపహ్వరమ్॥ న॥ రహః = ఏకాంతము, Solitude, एकांत; అన్తికమ్ = సమీపము, Near, समीप. |
| (పురోఽధిక ముప) ర్యగ్రా | అగ్రమ్॥ పురః = ముందర, Front, आगे; అధికమ్=అధికము, Much, अधिक; ఉపరి=మీఁద, Top, ऊपर; త్రి॥ ప్రధానము, |

Chief, प्रधान; ॥న॥ గ్రాసచతుష్టయప్రమాణమయిన భిక్ష, Four mouthfuls, चार कौर; కొన, Extremity, सिरा.

(ణ్యగారే నగరే) పురమ్। మన్దిరం (చాథ)

పురమ్, మన్దిరమ్॥ న॥ అగారే=ఇంటికిని, A house, घर; పట్టణమునకు, A town, शहर.

రాష్ట్రో (ఽస్త్రీవిషయే స్యాదుపద్రవే)॥ ౩౩౯॥

రాష్ట్రః॥ పు॥ విషయే = దేశమునకును, Country, राष्ट्र; ఉపద్రవే = ఉపద్రవమునకును, Calamity, उपद्रव.

దరో (ఽస్త్రీయాం భయే శ్వభ్రే)

దరః॥ పు॥ భయే = భయమునకును, Fear, भय; శ్వభ్రే = గుంటకును, A hole in the ground, गढा; ఇంచుకంత యను నర్థమునందు॥ అవ్య॥ A little, थोडा.

వజ్రో (ఽస్త్రీహీరకే పవౌ)।

వజ్రః॥ పు॥ హీరకే=వజ్రమను రత్నము, Diamond, रत्न; పవౌ = వజ్రాయుధము, Thunderbolt, वज्र.

తన్త్రం (ప్రధానే సిద్ధాన్తే సూత్రవాయే పరిచ్ఛదే)॥ ౩౪౦॥

తన్త్రమ్॥ న॥ ప్రధానే = ప్రధానుఁడు, Chief, प्रधान; సిద్ధాన్తే=సిద్ధాన్తము, Right conclusion, सिद्धान्त; సూత్రవాయే = నూలిపడుగు, A weaver's batten; పరిచ్ఛదే=పరివారము, Dependants, परिवार.

ఔశీర (శ్చామరే దణ్డే) ఽప్యౌశీరం (శయనాసనే)।

ఔశీరః॥ పు॥ చామరే = చామరము, A fan, चामर; దణ్డే=యష్టి, The handle of a fan, चामर की मूठ; ఔశీరమ్॥ న॥ శయన=శయనము, A bed, शय्या; ఆసనే=

పీఠము, A stool, पीठ; శయనమనఁగా నిద్ర యని కొందఱు. (అపి) ॥త్రి॥ వట్టివేళ్ల సంబంధమైనది, Fragrant root of grass, एक घास विशेष.

పుష్కరం (కరిహస్తాగ్రే వాద్యభాండముఖే జలే॥ ౩౮౧॥ వ్యోమ్ని ఖడ్గఫలే పద్మే తీర్థౌషధి విశేషయోః)।

పుష్కరమ్॥ న॥ కరిహస్తాగ్రే = ఏనుగు తొండము కొన, Tip of an elephant's trunk, सूँड का सिरा; వాద్యభాండముఖే = మద్దెల మొదలైన వాద్యముల ముఖము, Head of a drum, भेरी आदि का मुख; జలే=నీళ్లు, Water, पानी; వ్యోమ్ని=ఆకాశము, Sky, आसमान; ఖడ్గఫలే=కత్తివాదర, Edge of a scimitar, तलवार की धार; పద్మే=కమలము, A lotus, कमल; తీర్థే=తీర్థవిశేషము, Name of a contirent, एक तीर्थस्थान; ఓషధి విశేషయోః=ఓషధి విశేషము, A drug, औषधि.

అన్తర (మవకాశావధిపరిధానాన్తర్ధిభేదతాదర్థ్యే॥ ౩౮౨॥ ఛిద్రాత్మీయ వినా బహిరవసర మధ్యే ఽన్తరాత్మని చ)।

అన్తరమ్॥ న॥ అవకాశే=ఎడము, Intermediate time or space, अन्तर; అవధి=మర్యాద, Period, अवधि; పరిధాన=కట్టుకోక, Clothing, कपडा; అన్తర్ధి=మఱుఁగు Concealment, छिपाव; భేద = విశేషము Difference, भेद; తాదర్థ్యే=దానికొఱకు Sake, के लिये; ఛిద్ర = రంధ్రము, Hole छिद्र; ఆత్మీయ=తనసంబంధమైనది, Own अपना; వినా = అది వెలిగా, Other than के बिना; బహిః=వెలుపట, Outside, बाह्य

అవసర = అవసరము, Opportune time, अवसर; మధ్యే = మధ్యప్రదేశము, Inside, अन्दर; అన్తరాత్మని=పరమాత్మ, Supreme soul, परमात्मा; (చ) అన్యమైనది, Another, दूसरा.

(ముస్తేఽపి) పిఠరం — పిఠరమ్॥ న॥ ముస్తే = తుంగముస్తలు, Cyperus rotundus; (అపి) కుండ, A vessel, घट; కవ్వపుకోల, A churning stick, मथनी.

(రాజకశేరుణ్యపి) నాగరమ్॥ 383॥ — నాగరమ్॥ న॥ రాజకశేరుణీ= భద్రముస్తలు, Cyperus pertenuis, नागर; (అపి) శొంటి, Ginger, सोंट; ॥త్రి॥ నగరసంబంధమైనది, Belonging to a city, नगर संबंधी.

శార్వరం (త్వన్ధతమసే ఘాతుకే భేద్యలిఙ్గకమ్)। — శార్వరమ్॥ న॥ అన్ధతమసే = ఘనమయిన చీకటి, Very dark, घना अंधकार; ॥త్రి॥ ఘాతుకే= చంపుస్వభావముగలది, Destructive, घातक.

గౌరో౽(రుణే సితే పీతే) — గౌరః॥ త్రి॥ అరుణే=ఎరుపువస్తువునకును, Pale red, गौर; సితే= తెలుపువస్తువునకును, White, सफेद; పీతే = పచ్చనివస్తువునకును పేరు, Yellow, पीला.

(వ్రణకార్యప్య)రుష్కరః॥ 384॥ — అరుష్కరః॥ త్రి॥ వ్రణకారి = వ్రణమును చేయునది, Corosive, घाव करने वाला; (అపి) పు॥ జీడిచెట్టు, Semiearpus anacardium, भिलावा.

జఠరః(కఠినే౽పిస్యా) — జఠరః॥ త్రి॥ ఇది, కఠినే = కఠినమయిన

వస్తువు, Hard, कड़ी चीज़; (అపి) న॥ కడుపు, The belly, पेट.

(దధస్తాదపి) చాధరః।

అధరః॥ అధస్తాత్ = దిగువనుండువస్తువు, Low, निचली वस्तु; (అపి) త్రి॥ హీనుఁడు, Inferior, नीच; పు॥ పెదవి, The lip, ओंठ.

(అనాకులేఽపి) చైకాగ్ర్యో

ఏకాగ్రః॥ త్రి॥ అనాకులేచ = కలఁకఁబాఱని, Unperplexed, एकाग्र; (అపి) సావధానుఁడైన, Attentive, सावधान.

వ్యగ్రో (వ్యాసక్త ఆకులే)॥ ౩౮౫॥

వ్యగ్రః॥ త్రి॥ వ్యాసక్తే=ఒకదానియందు మనస్సు తగిలిన, Eagerly occupied, लगन; ఆకులే = కలఁతపడిన, Distracted, perplexed, आकुल.

(ఉపర్యుదీచ్యశ్రేష్ఠే ష్వ) ప్యుత్తర (స్స్యా)

ఉత్తరః॥ త్రి॥ ఉపరి=మీఁదికిని, Superior, high, ऊँची; ఉదీచ్య=ఉత్తరపుదిక్కునందుండుదానికిని, Northern, उत्तर का; శ్రేష్ఠేషు = శ్రేష్ఠునికి, Excellent, श्रेष्ठ; (అపి) ప్రత్యుత్తరమునకును, An answer, जवाब.

దనుత్తరః। (ఏషాం విపర్యయే శ్రేష్ఠే)

అనుత్తరః॥ త్రి॥ ఏషామ్ = వీనియొక్క, విపర్యయే = వ్యత్యాసమునందు, అనఁగా మీఁదుగానిదానికిని, Low, नीचा; ఉత్తరపు దిక్కునందుండనిదానికిని, Southern, दक्षिणी; శ్రేష్ఠముగానిదానికిని, Worse, हीन; శ్రేష్ఠే=శ్రేష్ఠునికిని, Excellent, श्रेष्ठ; ప్రత్యు

త్తరములేనిదానికిని పేరు, Silent, unable to answer, ला जवाब.

(దూరానాత్మోత్తమాః) పరాః॥ ౩౮౬॥

పరః॥ త్రి॥ దూర=దవ్వయినది, Distant, दूर; అనాత్మ = తనకంటె నన్యమయినది, Other, दूसरा; ఉత్తమాః = శ్రేష్ఠమయినది, Pre-eminent, उत्तम.

(స్వాదుప్రియా తు) మధురా

మధురః॥ త్రి॥ స్వాదు = తియ్యనైనది, Sweet, मीठा; ప్రియా = ఇష్టమయినది, Pleasing, प्रिय.

క్రూరా (కఠిన నిర్దయా)।

క్రూరః॥ త్రి॥ కఠిన = కఠినమయినది, Hard, कड़ा; నిర్దయా = దయలేనివాఁడు, Cruel, pitiless, निर्दय.

ఉదారో (దాతృ మహతోః)

ఉదారః॥ త్రి॥ దాతృ = దానముచేయువాఁడు, Generous, उदार; మహతోః = దొడ్డవాఁడు, Great, महान.

ఇతర (స్త్వన్యనీచయోః)॥ ౩౮౭॥

ఇతరః॥ త్రి॥ అన్య = పరుఁడు, Other, दूसरा; నీచయోః=నీచుడు, Low,vile, नीच.

(మన్దస్వచ్ఛన్దయోః) స్వైర

స్వైరః॥ త్రి॥ మన్ద = అలసుఁడు, Indolent, आलसी; స్వచ్ఛన్దయోః=స్వతంత్రుఁడు, Independent, uncontrolled, स्वतंत्र.

శుభ్ర (ముద్దీప్త శుక్లయోః)।

శుభ్రమ్॥ త్రి॥ ఉద్దీప్త=మిక్కిలి ప్రకాశించు, Splendid, प्रकाशमान; శుక్లయోః= తెల్లని, White, सफेद.

ఇతి రాన్తాః.

రాన్తనానార్థకశబ్దములు ముగిసెను.

| | |
|---|---|
| (చూడా కిరీటం కేశాశ్చ సంయతా) మౌలయః (స్త్రియః)॥ ౩౮౮॥ | మౌలిః॥ స్త్రీ॥ చూడా = శిఖ, Lock of hair on the head, शिखा; కిరీటమ్ = కిరీటము, A diadem, मुकुट; సంయతాః కేశాశ్చ = ముడిచిన వెండ్రుకలు, Hair tied on the head, वेणी. |
| (ద్రుమప్రభేద మాతఙ్గ కాణ్డ పుష్పాణి) పీలవః। | పీలుః॥ పు॥ ద్రుమప్రభేద = గోగుచెట్టు, మాతఙ్గ = ఏనుఁగు, An elephant, हाथी; కాణ్డ = బాణము, Arrow, बाण; పుష్పాణి = పుష్పము, Flower, फूल. |
| (కృతాన్తానేహసోః) కాలః | కాలః॥పు॥ కృతాన్త = యముఁడు, Yama, यम; అనేహసోః = కాలము, Time, समय. |
| (చతుర్థేఽపియుగే) కలిః॥ ౩౮౯॥ | కలిః॥ పు॥ చతుర్థేయుగే = నాలవయుగము, The fourth age, कलियुग; (అపి) కలహము, Quarrel, कलह. |
| (స్యాత్కురఙ్గేఽపి) కమలః | కమలః॥ పు॥ కురఙ్గే = ఇఱ్ఱి, Deer, हिरण; (అపి) న॥ తామరపువ్వు, Lotus, कमल; నీళ్లు, Water, पानी; ॥స్త్రీ॥ లక్ష్మి. |
| (ప్రావారేఽపిచ) కమ్బలః। | కమ్బలః॥ పు॥ ప్రావారే = ఉత్తరీయము, (అపి) కంబళి, A blanket, दुपट्टा; గంగడోలు, Dewlap; సర్పవిశేషము, Chief of serpents, एक साँप. |
| (కరోపహారయోః పుంసి) బలిః (ప్రాణ్యఙ్గజే స్త్రియామ్)॥ ౩౯౦॥ | బలిః॥ పు॥ కర = అప్పనము, Tax, कर; ఉపహారయోః = పూజోపకరణము, An oblation, पुजापा, ॥స్త్రీ॥ ప్రాణ్యఙ్గజే = జంతువుల యవయవములవలనఁ బుట్టినది, అనగా |

(అసూయోపగమే) ఉస్తు (చ)

టీ. అస్తు-చకారమువలనభవతు ॥అ॥ ఈ ౨ను, అసూయా= ఓర్వమిచేత, ఉపగమే=పొందుటయందు, అనఁగాఁ గోపముచే నంగీకరించుటయందు వర్తించును. ఉ॥ ధావ న్నేవ దశాననః ప్రహరతే మత్ప్రియసీ మస్తు వా, భవతు భవ త్వసుహృజ్జన స్సకామః, Be it so (implying regret in the acquiescence).

నను చ (స్యాద్విరోధోక్తౌ)

టీ. ననుచ ॥అ॥ విరోధ=ఒకఁడు పలికినందులకు విరుద్ధముగా, ఉక్తౌ=పలుకుటయందు వర్తించును, ఉ॥ నను చాత్ర తుగాగమః కథం భవతి, Indicating contradiction.

కచ్చి (త్కామప్రవేదనే)॥　　　౭౨౮॥

టీ. కచ్చిత్ ॥అ॥ కామ=ఇష్టార్థమును, ప్రవేదనే= తెలియఁజేయుటయందు, అనఁగా నిష్టార్థప్రశ్నమందు వర్తించును, ఉ॥ కచ్చి జ్జీవతి మే మాతా, I hope.

నిషమం దుషమం (గర్హ్యే)

టీ. నిషమమ్-దుషమమ్ ॥అ॥ ఈ ౨ ను, గర్హ్యే=నిందింపఁదగినదానియందు వర్తించును, ఉ॥ నిషమం వక్తి మూర్ఖః, దుషమం వర్తతే వధూః, Improperly, unseasonably.

యథాస్వం (తు) యథాయథమ్।

టీ. యథాస్వమ్-యథాయథమ్ ॥అ॥ ఈ ౨ ను, తమతమ వస్తువు లను నర్థమునందును, తాముతా మను నర్థమునందును వర్తించును, ఉ॥ యథాస్వ మాశ్రమై శ్చక్రే, యథాయథం పలాయన్తః, As thereto appertaining.

మృషా మిథ్యా (చ వితథే)

టీ. మృషా-మిథ్యా ॥అ॥ ఈ ౨ ను, వితథే=అసత్యమునందు

వర్తించును, ఉ॥ ఉచ్చాఽయసౌన్దర్యగుణా మృషోద్యాః, మిథ్యావాదిని దూతి బాన్ధవజన స్యాజ్ఞాతపీడాగమే, Falsely, मिथ्या.

యథార్థం (తు) యథాతథమ్॥ ౪౨౭॥

టీ. యథార్థమ్-యథాతథమ్ ॥అ॥ ఈ ౨ ను సత్యమునందు వర్తించును, ఉ॥ యథార్థ ముక్త్వా న్నాన్యత్, గురు ర్వక్తి యథాతథమ్, Properly, suitably.

(స్యు) రేవం తు పునర్వై వే (త్యవధారణవాచకాః)।

టీ. ఏవం-తు-పునః-వా-ఏవ ॥అ॥ ఈ ౫ ను, అవధారణవాచకాః=ఇదియ యను నియమార్థమునందు వర్తించును, ఉ॥ ఏవమేత ద్యథా ప్రాహ విష్ణు స్తు జగతాంపతిః, రావణంతు దురాత్మానమ్, భవభి ద్రాఘవః పునః, వ్యాసో వా సర్వధర్మజ్ఞః, త్వమేవ సాహో త్కరణీయ ఇత్యతః, ఇచట "స్యు రేవంతు పునర్వై చే త్యవధారణవాచకాః" అను పాఠము గలదు, Indeed.

ప్రా (గతీతార్థకం)

టీ. ప్రాక్ ॥అ॥ అతీత=జరిగినకార్యముయొక్క, అర్థకమ్=అర్థముగలది, అనఁగా పోయినకాలమందు వర్తించును, ఉ॥ ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః, Before, anterior.

నూన మవశ్యం (నిశ్చయే ద్వయమ్)॥ ౪౨౮॥

టీ. నూనమ్-అవశ్యమ్ ॥అ॥ ద్వయమ్=ఈ ౨ ను, నిశ్చయే=నిశ్చయార్థమునందు వర్తించును, ఉ॥ నూనం హ న్నాస్మి రావణమ్, అవశ్యం యాతార శ్చిరతరముషిత్వాపి విషయాః, Certainly, necessarily.

సంవ (ద్వర్షే)

టీ. సంవత్ ॥అ॥ వర్షే = సంవత్సరమందు వర్తించును, ఉ॥ రామః పఞ్చదశే సంవ దయోధ్యాం ప్రవివేశ హ, A year, संवत.

(ఉవరే) త్వర్వాక్

టీ. అర్వాక్ ॥అ॥ అవరే=మేరగాఁజెప్పు వస్తువునకుఁ గ్రిందటిదైనకాలమునందును, దేశమునందును వర్తించును, ఉ॥ యామూదర్వాజ్ఞ్నభుఞ్జీత, గ్రామా దర్వాజ్ఞ్నదీ, Former, prior.

ఆ మేవం

టీ. ఆమ్-ఏవమ్ ॥అ॥ ఈ ౨ ను, ఒకఁడు చెప్పినదాని నంగీకరించుటయందు వర్తించును, ఉ॥ ఆం కరోమి తవ ప్రియమ్, ఏవం కుర్మః, Assent, consent, promise.

స్వయ (మాత్మనా)।

టీ. స్వయమ్ ॥అ॥ ఆత్మనా=తనంత నను నర్థమునందు వర్తించును, ఉ॥ స్వయం కృత ప్రసాదస్య, Self, of himself, स्वयम्.

(అల్పే) నీచై

టీ. నీచైః ॥అ॥ అల్పే=కొంచెమందు వర్తించును, ఉ॥ తథాపి నీచై ర్వినయా దదృశ్యత, Little, low.

(ర్మహ) త్యుచ్చైః

టీ. ఉచ్చైః ॥సీ॥ మహతి=అధికమందు వర్తించును, ఉ॥ శృఙ్గముచ్చై ర్గిరే రిదమ్, Great, high, उच्च.

ప్రాయో (భూ)

టీ. ప్రాయః ॥అ॥ భూమ్ని = తఱచుగా నను నర్థమునందు వర్తించును, ఉ॥ ప్రాయో నవవధూః కాన్తమ్, Frequently, generally, प्राय.

(మ్న్యద్రుతే) శనైః॥ ౮ ౨౯॥

టీ. శనైః ॥అ॥ అద్రుతే=మెల్లఁగా నను నర్థమునందు వర్తించును, ఉ॥ అలిజ్ఞతి శనై శ్శనైః, Slowly.

సనా (నిత్యే)

టీ. సనా ॥అ॥ నిత్యే=నిత్యమునందు వర్తించును, ఉ॥ సనాతనః, Perpetually, ever.

బహి (ర్బాహ్యే)

టీ. బహిః ॥అ॥ బాహ్యే=వెలుపల నను నర్థమునందు వర్తించును, ఉ॥ దాసీకుమ్భం బహి ర్గ్రామాత్, External, out.

స్మ (తీతే)

టీ. స్మ ॥అ॥ అతీతే = కడచె నను నర్థమునందు వర్తించును, సేవతేస్మ శయనం పరాఙ్ముఖీ, Formerly.

ఉ స్త (మదర్శనే)।

టీ. అస్తమ్ ॥అ॥ అదర్శనే = కానరాకుండుటయందు వర్తించును, ఉ॥ అస్తంగతో రావణః, అస్తంగతో భాస్కర ఇతి, Disappearance.

అస్తి (సత్త్వే)

టీ. అస్తి ॥అ॥ సత్త్వే = కలదనుటయందు వర్తించును, ఉ॥ అస్తి క్షీరా గౌః, Present, now.

(రుషోక్తా) వు

టీ. ఉ ॥అ॥ రుషా = కోపముచేత, ఉక్తౌ = పలుకుటయందు వర్తించును, ఉ॥ ఉ ఆగత శ్శత్రుః, రుషోక్తౌ హుమ్ అనియు పాఠము, ఉ॥ వృద్ధా స్తేన విచారణీయచరితా స్తిష్ఠన్తు హుం వర్తతామ్, Interjection expressing wrath.

ఊం (ప్రశ్నే)

టీ. ఊమ్ ॥అ॥ ప్రశ్నమందు వర్తించును, ఉ॥ ఆగత శ్శత్రురూమ్.

(ఉనునయే) త్వయి॥ ౪౩౦॥

టీ. అయి ॥అ॥ అనునయే=ఊఱడించుటయందు వర్తించును, ఉ॥ అయి ముగ్ధే, Encouraging vocative.

(తర్కే) ను (స్యాత్)

టీ. ను ॥అ॥ తర్కే=ఊహయందు వర్తించును, ఉ॥ అస్త శైలగహనం ను వివస్వా నావివేశ జలధిం ను మహీం ను, తర్కేతు స్యాత్ అను పాఠమునందు స్యాత్ అనునది యూహయందు వర్తించునని యర్థము, ఉ॥ స్యాత్కిఞ్చి న్నోపపద్యతే, Indicating reflection.

ఉషా (రాత్రేరవసానే)

టీ. ఉషా ॥అ॥ రాత్రేః=రాత్రియొక్క, అవసానే=అంతమునందు, అనఁగా ప్రాతఃకాలమునందు వర్తించును, ఉ॥ ఉషా జనాః ప్రబుధ్యన్తే, ఉషా తనో వాయు రుపైతి మన్దం, Close of the night, morning, break of day, उषा

నమో (నతౌ)।

టీ. నమః ॥అ॥ నతౌ = నమస్కారమునందు వర్తించును, ఉ॥ నమో విష్ణవే, Hail, salutation, bow.

(పునరర్థే) ఽఙ్గ

టీ. అఙ్గ ॥అ॥ పునః=మఱియునను, అర్థే=అర్థమునందు వర్తించును, ఉ॥ మూర్ఖస్తు నావమన్తవ్యః కి మఙ్గ విద్వాన్, Again, rather.

(నిన్దాయాం) దుష్ఠు

టీ. దుష్ఠు ॥అ॥ నిన్దాయామ్ = చెడ్డది యను నర్థమునందు వర్తించును, ఉ॥ దుష్ఠువృత్తి ర్దుర్జనస్స్యాత్, Ill.

సుష్ఠు (ప్రశంసనే)॥ ౪౩౧॥

టీ. సుష్ఠు ॥అ॥ ప్రశంసనే = మంచిది యనుటయందు వర్తించును, ఉ॥ సుష్ఠు భుక్తం మయా గృహే, Well.

ఆమాం (ఉనుగుణ్యే)

టీ. ఆమ్ ॥అ॥ అనుగుణ్యే = అనుకూలార్థమునందు వ చును ఉ॥ ఆమ్ జ్ఞాతమ్, Oh; I see it now, Oh; yes.

(స్మరణే) ఉయే

టీ. అయే ॥అ॥ స్మరణే = స్మరణమునందు వర్తించు ఉ॥ అయే పూర్వం కృతం మయా, Ah (showing recollectic

ఫ (డ్విఘ్ననిరాకృతౌ)।

టీ. ఫట్ ॥అ॥ విఘ్న = విఘ్నముయొక్క, నిరాకృతౌ పోఁగొట్టుటయందు వర్తించును, ఉ॥ అస్త్రాయ ఫట్, A w used in uttering spells to ward off evil.

(అఙ్గీకృతౌ స్యా) దథకిం

టీ. అథకిమ్ ॥అ॥ అఙ్గీకృతౌ = అంగీకారమునం స్యాత్ = వర్తించును, ఉ॥ దేవదత్త కిం భోక్ష్యసి; అథకిమ్, Y quite so.

(హీనసంబోధనేతు) రే॥ ర

టీ. రే ॥అ॥ హీన = హీనునియొక్క, సంబోధనే = చుటయందు వర్తించును, ఉ॥ రే రే పాప మమాన్తికా దశ (Used in addressing menials). 'ఆమానుగుణ్యే' అన్నది వె లిదివఁటికుఁ బ్రక్షిప్తమని కొందఱు.

సాయం (సాయే)

టీ. సాయమ్ ॥అ॥ సాయే = సాయంకాలమునందు వ చును, ఉ॥ సాయంతన మల్లికాను, Evening.

ప్రగే ప్రాతః (ప్రభాతే)

టీ. ప్రగే-ప్రాతః ॥అ॥ ఈ ౨ ను, ప్రభాతే = ప్రాతఃకాల నందు వర్తించును, ఉ॥ ప్రగే నృపాణా మథ తోరణా ద్బహిః, సన్ధ్యాముపాసీత, Morning.

నికషా (ఽన్తికే)।

టీ. నికషా ॥అ॥ అన్తికే = సమీపమునందు వర్తించును, ఉ॥ విలఙ్ఘ్య లఙ్కాం నికషా హనిష్యతి, Near.

పరుత్పరార్యైషమో (ఽబ్దే పూర్వే పూర్వతరే యతి)॥

టీ. పరుత్-పరారి-ఐషమః ॥అ॥ ఈ 3 ను వరుసగా, పూర్వే అబ్దే=పోయినయేఁటియందును, Last year; పూర్వతరే అబ్దే = అంతకు మున్నేటియందును, Year before the last; యతి = నడచుచున్న యేటియందును వర్తించును, Current year; ఉ॥ పరారిసఙ్చితం విత్తం పరున్నష్టమభోగతః, ఐషమశ్చీయతే యత్నాత్తతః కింవా భవిష్యతి.

అద్యా (త్రాహ్ని)

టీ. అద్య ॥అ॥ అత్రఅహ్ని=నడచుచున్న పగటియందు వర్తించును, ఉ॥ నరలోకేఽద్య దుర్లభః, Today.

(థపూర్వేఽహ్నీత్యాదా) పూర్వోత్తరాపరాత్।
తథాఽధరాన్యాన్యత రేతరాత్పూర్వేద్యు రాదయః॥

టీ. పూర్వోత్తరాపరాత్-అధరాన్యాన్యతరేతరాత్-పూర్వ ఉత్తర అపర అధర అన్య అన్యతర ఇతర అను శబ్దములవలనఁ బుట్టిన, పూర్వేద్యురాదయః, పూర్వేద్యుః = నిన్న, Yesterday, कल; ఉత్తరేద్యుః= రేపు, To-morrow, कल; అపరేద్యుః=ఎల్లుండి, The day after to-morrow, परसों; అధరేద్యుః = మొన్న, The day before yesterday, परसों; అన్యేద్యుః - ఇతరేద్యుః = మఱియొకనాఁడు, Another day, दूसरे दिन; అన్యతరేద్యుః= రెండు దినములలో నొకనాఁడు, One of two days అను నర్థములయందు వర్తించును, ఉ॥ నిమన్త్రయత పూర్వేద్యుః, నాన్దీముఖా దుత్తరేద్యు ర్వివాహః పరికీర్తితః, ఆగతా నపరేద్యుస్తాన్, అధరేద్యుస్సమాగతాః, అన్యేద్యు రాత్మానుచరస్య భావమ్, పఞ్చమీషష్ఠ్యో

రన్యతరేద్యుః పితరం ద్రక్ష్యసి, కష్టదినా దితరేద్యుః ప్రియో ద్రష్టవ్యః.

ఉభయద్యు శ్చోభయేద్యుః

టీ. ఉభయద్యుః-ఉభయేద్యుః ॥అ॥ ఈ ౨ ను, రెండుదినములను నర్థమునందు వర్తించును, ఉ॥ ఉభయద్యు రుత్సవః, Both days, दोनो दिन.

(పరేత్వహ్ని) పరేద్యవి।

టీ. పరేద్యవి ॥అ॥ పరేత్వహ్ని = మఱునాఁటియందు వర్తించును, ఉ॥ ద్రష్టాస్మి పరేద్యవి సఖాయమ్, Next day, दूसरे दिन.

హ్యో (గతే)

టీ. హ్యః ॥అ॥ గతే = పోయిన దినమందు, అనఁగా నిన్నయను నర్థమునందు వర్తించును, ఉ॥ హ్య స్సర్వ మభవ త్కార్యమ్, Yesterday, कल.

(అనాగతేఽహ్ని) శ్వః

టీ. శ్వః ॥అ॥ అనాగతే=రానట్టి, అహ్ని=దినమందు, అనఁగా రేపను నర్థమునందు వర్తించును, ఉ॥ శ్వః కార్య మద్య కుర్వీత, To-morrow, कल.

పరశ్వ (స్తత్ప రేఽహని)॥ ౮౩౫॥

టీ. పరశ్వః ॥అ॥ తత్పరే = అవతలి, అహని = దినమందు, అనఁగా నెల్లుండి యను నర్థమందు వర్తించును, ఉ॥ పరశ్వో వా భవిష్యతి, The day after to-morrow, परसों.

తదా తదానీం

టీ. తదా-తదానీమ్ ॥అ॥ ఈ ౨ ను, అప్పుడను నర్థమునందు వర్తించును, ఉ॥ తదా చక్షుష్మతాం ప్రీతిః, యదా స్యా త్ప్రియయా సఙ్గః తదానీ మేవ మే సుఖమ్, Then, at that time, तब.

యుగప దేకదా

టీ. యుగపత్-ఏకదా ॥అ॥ ఈ ౨ ను, ఒక్కకాలమం దను నర్థమందు వర్తించును, ఉ॥ యుగప ద్వ్యాన శేదిశః, ఏకదా మిళితాః ద్విజాః, At once, at the same time, तत्क्षण.

సర్వదా సదా।

టీ. సర్వదా-సదా ॥అ॥ ఈ ౨ ను, ఎల్లప్పు డను నర్థమందు వర్తించును, ఉ॥ సర్వదా సర్వదోఽసీతి, యాచతే యాచక స్సదా, Always, At all times. सर्वदा, सदा.

ఏతర్హి సమ్ప్రతీదానీ మధునా సామ్ప్రతం (తథా)॥ ౪౩౬॥

టీ. ఏతర్హి-సమ్ప్రతి-ఇదానీమ్ - అధునా - సామ్ప్రతమ్ ॥అ॥ ఈ ౫ ను, ఇప్పుడను నర్థమునందు వర్తించును, ఉ॥ భవన్త మేతర్హి మనస్వి గర్హితే, సమ్ప్రి త్యసామ్ప్రతం వక్తుమ్, ఇదానీ మస్మి సంవృత్తః, బలావలేపా దధునాఽపి పూర్వవత్, కో న్వస్మిన్ సామ్ప్రతం లోకే, Now, at this time, अभी.

(దిగ్దేశకాలే పూర్వాద్యా) ప్రాగుద క్ప్రత్యగాదయః।

టీ. ప్రాగుద క్ప్రత్యగాదయః=ప్రాగుద క్ప్రత్య గాద్యవ్యయములు, పూర్వాద్యాః=పూర్వాదులయిన, దిగ్దేశకాలే=దిగ్దేశకాలముల యందు వర్తించును, ప్రాక్ ॥అ॥ ఇది పూర్వదిక్కునకును, East, पूर्व; పూర్వదేశమునకును, Eastern, पूर्वी; పూర్వకాలమునకును, Prior time, పేరు. ఉ॥ ప్రాఙ్ముఖోఽన్నాని భుఞ్జీత, ప్రాగ్భాగతః పతది హేద ముఃత్యకాసు, ప్రాక్సృష్టేః కేవలాత్మనే. ఉదక్ ॥అ॥ ఇది ఉత్తరదిక్కునకు, North, उत्तर; ఉత్తరదేశమునకును, Northern, उत्तरी; ఉత్తరకాలమునకును, Subsequent, పేరు. ప్రత్యక్ ॥అ॥ ఇది పడమటిదిక్కునకును, West, पश्चिम; పడమటి దేశమునకును, Western, पश्चिमी; పేరు. ఆదిశబ్దముచేత, అవాక్ =

South, दक्षिण; Southern, दक्षिणी; or former; దక్షిణాత్-దక్షిణతః-దక్షిణేన = Southward, दक्षिण की तरफ; ఉత్తరాత్-ఉత్తరతః-ఉత్తరేణ=Northward, उत्तर की तरफ; అధరాత్-అధరతః-అధరేణ-అధరస్తాత్ = Underneath, नीचे; పురస్తాత్ = Before, पहले; ఉపరి-ఉపరిష్టాత్ = Above, ऊपर; అధస్తాత్ = Behind, पीछे; మొదలయినవి గ్రహింపఁబడును.

ఇత్యవ్యయవర్గః = అవ్యయములయొక్క పదసమూహము ముగిసెను.

---

గ్రంథకర్త తాను గ్రంథాదియందుఁ జేసిన 'సంపూర్ణముచ్యతే వర్గై ర్నామలిఙ్గానుశాసనమ్' అను ప్రతిజ్ఞ చొప్పున లింగములతోడ నామముల కనుశాసనముకొఱకు వర్గాంతరమును బ్రారంభించుచున్నాడు.

సలిఙ్గశాస్త్రైః స్సన్నాదికృత్తద్ధితసమాసజైః॥ ౪౩౭॥
అనుక్తైః స్సఙ్గ్రహే లిఙ్గం సంకీర్ణవ దిహోన్నయేత్।

టీ. ఇహసఙ్గ్రహే = ఈ లింగాది సంగ్రహవర్గయందు, సలిఙ్గశాస్త్రైః = పాణిని వరరుచి మొదలైనవారిచేతఁ జెప్పఁబడిన లింగలక్షణములుగల, 'స్త్రియా మీ దూ ద్విరా మైకాచ్' అనునది మొదలయిన వాక్యములతోఁ గూడినట్టి, సన్నాదికృత్తద్ధితసమాసజైః=సనాద్యంత ధాతువులమీఁది అప్రత్యయము మొదలయిన కృత్ప్రత్యయములవలనను, కేవలధాతువులమీఁది కృత్ప్రత్యయములవలనను, తద్ధితప్రత్యయములవలనను, సమాసములవలనను బుట్టిన అనుక్తైః=పూర్వవర్గలయందుఁ జెప్పఁబడని, 'స్త్రీభావాదా వనిక్తిః' మొదలయిన కృత్ప్రత్యయములతోఁ గూడిన వాక్యములచేతను 'తల్వృన్దే యేని కద్యచ్ త్రా' ఇవి మొదలయిన తద్ధితప్రత్యయములతోఁ గూడిన వాక్యములచేతను, 'అదన్తై ర్ద్విగు రేకార్థః' ఇ

మొదలయిన సమాసములతోఁ గూడిన వాక్యములచేతను, లిఙ్గమ్= స్త్రీపుం నపుంసకలింగములను, ఉన్నయేత్ = తెలిసికోవలయును. మరియు దృష్టాంతముచేతను లింగము నెఱుగు నుపాయమును జెప్పు చున్నాఁడు. సంకీర్ణవత్ =సంకీర్ణవర్గయందువలెఁ బ్రకృతి ప్రత్యయార్థా దులచేతను లింగమును తెలిసికొనవలెను.

ఈ వర్గయందుఁ జెప్పనట్టి లింగలక్షణములకుఁ బూర్వవర్గల యందుఁ జెప్పిన విశేషవిధులతో విరోధము వచ్చినప్పు డేలక్షణము వ ర్తించు నను సందేహమును పరిహరించుచున్నాఁడు.

లిఙ్గశేషవిధి ర్వ్యాపీ విశేషైర్య ద్యబాధితః॥ ౪౩౮॥

టీ. లిఙ్గశేషవిధిః = ఈ వర్గయందుఁ జెప్పఁబడు సామాన్య మయిన లింగలక్షణము, విశేషైః=ఈ శాస్త్రమున నక్కడక్కడఁ జెప్పఁబడిన విశేషవిధులచేత, అబాధితోయది = బాధింపఁబడని దైనచో, వ్యాపీ=తాను ప్రవ ర్తించునది యగును. అనఁగా నీ వర్గ యందుఁ జెప్పు లింగలక్షణము పూర్వవర్గయందుఁ జెప్పిన విశేష విధిని విడిచిపెట్టి కడమదిక్కుననే ప్రవ ర్తించునని తాత్పర్యము. అది యెట్లన, నీ వర్గయందు స్వర్గపర్యాయములు పుంలింగములౌను అను విధి "ద్యోదివౌద్వే స్త్రియామ్" అను విశేషవిధిచోట ప్రవ ర్తింపదు.

స్త్రియామ్

టీ. స్త్రియాం అను పదము 'పుంస్త్వేనభేదానుచరాః' అను పుంలింగాధికారపర్యంత మనువ ర్తించి వచ్చును. కావున నదివఱకుఁ జెప్పు శబ్దములు స్త్రీలింగములు.

ఈ దూ ద్విరా మైకాచ్

టీ. ఏకాచ్ =ఒకయచ్చు గలిగిన, ఈదూద్విరామాం=ఈకా రాంత ఊకారాంత శబ్దములు సీ॥, (శ్రీః, ధీః, భూః, భ్రూః.

సయోని ప్రాణి నామచ।

టీ. యోని కలిగిన ప్రాణులకుఁ బేరయిన శబ్దములు స్త్రీలింగ మునందు వర్తించును, ఉ॥ మాతా, యోషిత్, సురభిః, కరేణుః.

నామ విద్యు న్నిశా వల్లీ వీణా ది గ్భూ నదీహ్రియామ్॥

టీ. విద్యుత్ = మెఱపు, నిశా = రాత్రి, వల్లీ = తీఁగె, వీణా = వీణె, దిక్ = దిక్కు, భూ = భూమి, నదీ = నది, హ్రీ = సిగ్గు, ఈ వా వస్తువులయొక్క, నామ = పేళ్లు, విశేషవిధిబాధ లేనివి సీ॥, ఇచట వీణా పర్యాయములకును, హ్రీ పర్యాయములకును, 'జ్యాబూజన్తమ్-ఈదూద్వీరామైకాచ్' అను విధులచేత స్త్రీలింగము సిద్ధించినను విస్పష్టార్థముగాఁ జెప్పినాఁడు. కొందఱు వాణీదిగ్భూనదీధియామ్ అని పాఠము గలదనిరి. మొదటి పక్షమునందు హ్రీ పర్యాయము లయిన మందాక్షవ్రీడశబ్దములు విశేషవిధిబాధ కలవి గనుక నక్కడ సీ విధి లేదు.

అదన్తై ర్ద్విగు రేకార్థః

టీ. అదన్తైః = అకారాంతము లయిన యుత్తరపదములతోఁ గూడుకొనియున్న, ఏకార్థోద్విగుః = సమాహారమునందలి ద్విగు సమాసము సీ, ద్విగుసమాస మన సంఖ్యాపూర్వపదమైన సమాసము, ఉ॥ పఞ్చానాం మూలానాం సమాహారః = పఞ్చమూలీ, దశమూలీ, త్రిలోకీ.

న స పాత్రయుగాదిభిః।

టీ. పాత్రయుగాదిభిః = ఉత్తరపదము లయిన పాత్రయుగాది శబ్దములతోఁ గూడియున్న, సః = ఆ ద్విగుసమాసము, న = స్త్రీలింగము కాదు, ఉ॥ పఞ్చపాత్రమ్, చతుర్యుగమ్, త్రిభువనమ్.

తల్

టీ. భావార్థమునందును, సమూహార్థమునందును, స్వార్థము నందును విధింపఁబడిన తల్ ప్రత్యయ మంతముగాఁ గల శబ్దములు

, ఉ॥ భావార్థమున, పురుషస్య భావః పురుషతా, అశ్వతా;
సమూహార్థమున, గ్రామాణాం సమూహః గ్రామతా; జనతా;
ఁతా; సహాయతా; స్వార్థమున, దేవఏవ దేవతా.

బృన్దే యేనికడ్యచ్ త్రా

టీ. బృన్దే = సమూహార్థమునందు విధింపఁబడిన య, ఇని,
డ్యచ్ (పా) కట్యచ్, త్ర అను ప్రత్యయము లంతముగాఁగల
ములు స్త్రీ॥, ఉ॥ య ప్రత్యయాంతమునకు, పాశానాం సమూహః
శ్యా, ఈలాగే ఇని ప్రత్యయాంతమునకు ఖలినీ, కడ్యచ్ ప్రత్య
ంతమునకు రథకడ్యా (పా) రథకట్యా, త్ర ప్రత్యయాంతమునకు
త్రా.

వైర మైథుని కాది వున్॥ ౪౪౦॥

టీ. వైర = విరోధమునందును, మైథునిక = వివాహమునందును,
శబ్దముచేత వీప్సయందును దండమునందును దానమునందును
ంపఁబడిన వున్ అను ప్రత్యయ మంతముగాఁగల శబ్దములు స్త్రీ॥,
విరోధమున, అశ్వమహిషయోర్విరోధః అశ్వమహిషికా; కాకో
ికికా; వివాహమున, అత్రిభరద్వాజయోర్వివాహః; అత్రిభర
ాజికా, వసిష్ఠకుశికికా; వీప్సయందు, ద్వౌ ద్వౌపాదౌ దదాతి ద్విప
ం దదాతి; ద్విశతికాం దదాతి; దండమునందు, ద్వౌపాదౌ
తః ద్విపదికాం దణ్డితః, ద్విశతికాం దణ్డితః; దానమునందు,
పాదౌ వ్యవసృజతి ద్విపదికాం వ్యవసృజతి, ద్విశతికాం వ్యవ
తి, వున్ ప్రత్యయము వుఞ్ ప్రత్యయమునకు నుపలక్షణము
క వుఞ్ ప్రత్యయాంతములకును కొన్నియెడల స్త్రీలింగము
ు, ఉ॥ శిష్యోపాధ్యాయయో ర్భావః శైష్యోపాధ్యాయికా,
్యాదులు.

స్త్రీభావాదావని క్తిన్ణ్వుల్ణజ్ణ్వచ్క్యబ్యుజ జే ఇఞ్ శాః।

టీ. స్త్రీభావాదౌ = స్త్ర్యధికారమందలి భావాద్యర్థముల
ందు విధింపఁబడిన అని- క్తిన్-ణ్వుల్-ణచ్-ణ్వుచ్-క్యప్-యుచ్-

అజ్-అ-ఇఞ్-ని-శ అను ప్రత్యయము లంతముగాఁగల శబ్దములు స్త్రీ॥, ఉ॥ అజననిః, అకరణిః – ఇచట నాక్రోశమునం దని ప్రత్యయము. కృతిః, భృతిః – భావార్థమునందు క్తిన్ ప్రత్యయము. ప్రవాహికా, ప్రచ్ఛర్దికా – ఇచట రోగాఖ్యయందు ణ్వుల్. కారికా, జీవికా–ఇచట ధాత్వర్థమునందు ణ్వుల్. వ్యావక్రోశీ – ఒకరినొకరు తిట్టుకొనుట, వ్యాత్యుక్షీ – ఒకరిపై నొకరు నీళ్లు చల్లుకొనుట – ఇచట కర్మ వ్యతిహారమునందు ణచ్. భవతః శాయికా, భవతః ఆసికా – ఇచట పర్యాయార్థమునందు ణ్వుచ్. భవానర్హతి ఇక్షుభక్షికామ్, పయః పాయికామ్ – ఇచట అర్హార్థమునందు ణ్వుచ్. ఇక్షుభక్షికాం మే ధారయసి, ఓదనభక్షికామ్ – ఇచట ఋణార్థమునందు ణ్వుచ్. ఇక్షుభక్షికా మే ఉదపాది ఓదనభక్షికా – ఇచట నుత్పత్తియందు ణ్వుచ్. వ్రజ్యా, ఇజ్యా–ఇచట భావార్థమునందు క్యప్. సమజ్యా, నిషద్యా–ఇచట సంజ్ఞయందు క్యప్. మణ్డనా, ఆసనా–ఇచట భావార్థమునందు యుచ్. పచా, ఛిదా, మృజా – ఇచట భావార్థమునందు అఙ్. చికీర్షా, జిహీర్షా – ఇచట సన్ ప్రత్యయముమీఁద భావార్థమునందు అప్రత్యయము. కాంకారిమకార్షీః, ఇమాంకారిమకార్షమ్ – ఇచట ప్రశ్నాఖ్యానములయందు ఇఞ్. జ్యానిః, గ్లానిః – ఇచట భావార్థమునందు నిప్రత్యయము. శప్రత్యయాంతమునకు క్రియా, ఇచ్ఛా ఇత్యాదులు.

ఊణాదిషు నిరూరీశ్చ

టీ. ఉణాదులయందలి నిః ఊః ఈః అను నీ మూఁడు ప్రత్యయములు నంతముగాఁగల శబ్దములు స్త్రీలింగమునందు వర్తించును. ఉ॥ ని ప్రత్యయమునకు శ్రేణిః, శ్రోణిః. ఊ ప్రత్యయమునకు ఖర్జూః, కణ్డూః, చమూః. ఈ ప్రత్యయమునకు తన్త్రీః, లక్ష్మీః ఇత్యాదులు. అగ్ని వహ్ని యోని పార్ష్ణిశబ్దములు నిప్రత్యయాంతము లయినను పుంలింగములను విశేషవిధి యున్నది.

ఙ్యాబూఙన్తం చలం స్థిరమ్॥ ౮౮౧॥

టీ. ఙీ–అనఁగా ఙీప్–ఙీష్–ఙీన్ అను ప్రత్యయములు. ఆప్–

అనఁగా టాప్-డాప్-చాప్ అను ప్రత్యయములు. ఈ యూరును, ఊఙ్
అను ప్రత్యయమును నంతముగాఁగల శబ్దములు, చలమ్ = విశేష్య
నిఘ్నములు అయినవియు, స్థిరమ్=నియతలింగము లయినవియు స్త్రీ॥,
ఉ॥ విశేష్యనిఘ్నములయిన జ్యంతములకు పుంసః ఇయమ్ పౌంస్నీ,
ఉపగో రియమ్ ఔపగవీ. నియతలింగములయిన జ్యంతములకు కరిణీ,
కర్త్రీ-ఇచట ఙీప్. దాక్షాయణీ, గౌరీ - ఇచట ఙీష్. శార్ఙ్గరవీ, బైదీ-
ఇచట ఙీన్. అజా, ఏడకా, రమా - ఇచట టాప్. సురాజా, బహు
సీమా - ఇచట డాప్. కారీషగన్ధ్యా, వారాహ్యా - ఇచట చాప్.
రమ్భోరూః, కరభోరూః - ఇచట ఊఙ్ ఇత్యాదులు.

తత్క్రీడాయాం ప్రహరణంచేన్మౌష్టా పాల్లవా. ణదిక్।

టీ. తత్ = ఆముష్టిపల్లవాదులు, క్రీడాయామ్ = ఈ క్రీడ
యందు, ప్రహరణంచేత్ = ఆయుధమాయెనేని, ఆ యర్థమునందు
విధింపఁబడిన ణ ప్రత్యయాంతశబ్దములు స్త్రీలింగమునందు వర్తిం
చును, ఉ॥ ముష్టిః ప్రహరణ మస్యాం క్రీడాయామ్ మౌష్టా,
ఈలాగున పాల్లవా. ణదిక్ అన్నందున దాండాదులును తెలియ
వలెను.

ఘఞో ఞః సాక్రియాఽస్యాం చే ద్దాణ్డపాతా హి ఫాల్గునీ॥
శ్యైనంపాతాహి మృగయా తైలంపాతా స్వధేతి దిక్।

టీ. సాక్రియా = ఆదండపాతాదిక్రియ, అస్యాంచేత్ = ఈ
ఫాల్గున్యాదులయందు కలిగినయెడ, ఆ యర్థమునందు, ఘఞః=ఘఞం
తముమీఁద విధింపఁబడిన, ఞః = ఞ ప్రత్యయాంతము స్త్రీ॥, ఉ॥ దణ్డ
పాతోఽస్యాంఫాల్గున్యా మితి దాణ్డపాతా ఫాల్గునీ, శ్యేనపాతోఽ
స్యాం మృగయాయా మితి శ్యైనంపాతా మృగయా, తిలపాతోఽ
స్యాం స్వధాయా మితి తైలంపాతా స్వధా, దిక్ఛబ్దమువలన
మౌసలపాతాదులు నీలాగున తెలియవలెను.

స్త్రీ స్యా త్కాచి న్మృణా ళ్యాది ర్వివక్షాఽపచయే యది॥

టీ. అల్పార్థమునందు వివక్ష కలిగినయెడ మృణాళీః మొదలయిన కొన్ని శబ్దములు స్త్రీలింగములౌను. ఉ॥ అల్పం శమ్ మృణాళీ, అల్పోఘటః ఘటీ; ఇట్లే శస్త్రీ, విషాణీ ఖర్జూరీ అనునివి మొదలయినవి తెలియవలయు. కొన్ని యన్య అల్పోవృక్షః వృక్షకః ఇత్యాదులు స్త్రీలింగములు కావు. గొందఱు స్త్రీత్వమని చెప్పి స్త్రీత్వ వివక్షయందు మృణ శబ్దములు స్త్రీలింగము లందురు.

ఈ ప్రకారముగా లక్షణముచేత లింగనిర్ణయమును యింకను కకారాంతాదిక్రమమున లింగనిర్ణయమును జెప్పుచున

లఙ్కా శేఫాలికా టీకా ధాతకీ పఞ్జికాఽఽఢకీ।
సిధ్రకా శారికా హిక్కా ప్రాచికోల్కా పిపీలికా॥
తిన్దుకీ కణికా భఙ్గిః సురఙ్గా సూచి మాఢయః।
పిచ్ఛా వితణ్డా కాకిణ్యశ్చూర్ణి శ్శాణీ ద్రుణీ దరత్॥
సాతిః కన్థా కథాఽఽగన్ధీ నాభీ రాజసభాఽపిచ।
ఝల్లరీ చర్చరీ పారీ హోరా లట్వాచ సిధ్మలా॥
లాక్షా లిక్షాచ గణ్డూషా గృధ్రసీ చమసీ మసీ।

టీ. లంకాశబ్దము మొదలు మసీశబ్దపర్యంతము గల శ స్త్రీలింగములు. ఈ శబ్దముల కర్థము, లఙ్కా = రావణపట్ట శేఫాలికా = వావిలి, టీకా = విషమపదవ్యాఖ్యానము, ధాత మ్రాను, పఞ్జికా = నిశ్శేషపదవ్యాఖ్యానము, ఆఢకీ = తువరి సిధ్రకా = బిల్లుమ్రాను, శారికా = గోరువంకపిట్ట, హిక్కా = ె ప్రాచికా = అడవియీఁగ, ఉల్కా = కొఱవి, పిపీలికా = చీమ, తుమ్మికిచెట్టు, కణికా = పరమాణువు, వ్రీహిభేదమును, గోధ యని కొందఱు, భఙ్గీ = రచనాప్రకారము, సురఙ్గా = క సూచిః = సూది, మాఢిః = చిగురాకు, పీచి యని కొందఱు, గంజియు బూరుగబంకయు, వితణ్డా = స్వపక్షస్థాపనములేని కాకిణీ = కర్ష మెత్తులో నాలవపాలు, పలములో నాల

కొందఱు, చూర్ణిః=గద్యభేదము, శాణీ=సాన, ద్రుణీ=చెవిదూరు పాము, తాఁబేలని కొందఱు, దరత్=మ్లేచ్ఛజాతి, చఱియ యని కొందఱు, సాతిః = దానము, తీవ్రవేదన యని కొందఱు, కన్థా = బొంత, కథా=చరిత్ర, ఆసన్దీ=పెండ్లిపీట, శవవాహనమని కొందఱు, నాభిః=బొడ్డు, రాజసభా=రాజుకొలువుకూటము, ఝల్లరీ=వాద్య విశేషము, చర్చరీ=నృత్తవిశేషము, పారీ=ఏనుఁగు కాలిగొలుసు, హోరా=లగ్నాంశము, లట్వా=ఊరఁబిచ్చుక, సిధ్మలా=పూతిమత్స్య క్షోదము, సిబ్బెముగలదియు, లాక్షా = లత్తుక, లిక్షా = పేనుగ్రుడ్డు, గణ్డూషా = పుక్కిలించుట, గృధ్రసీ = రొండిలోని వాతవ్యాధి, చమసీ=సోమపానపాత్రము, మసీ=మసి.

ఇతి స్త్రీలిఙ్గసఙ్గ్రహః.

---

పుంస్త్వే

టీ. ముందు నపుంసకే అనువఱకుఁ జెప్పఁబడు శబ్దములు పుంలింగమందు వర్తించుననుట.

సభేదానుచరా స్సపర్యాయా స్సురాసురాః॥ ౭౭౭॥

టీ. సపర్యాయాః = అమర నిర్జరాది పర్యాయములతోడను, దైత్యదైతేయాది పర్యాయములతోడను కూడుకొనియున్న, సురా సురాః = సురశబ్దమును, అసురశబ్దమును, సభేదానుచరాః = తమ తమలో విశేషములయిన యింద్రాగ్న్యాది దేవతలపేళ్లతోను, నముచి శంబర రావణాది రాక్షసులపేళ్లతోను, తమతమ యనుచరులయిన హాహా హూహూ మాఠరపింగళాదులపేళ్లతోను, చండముండప్రహ స్తాదులపేళ్లతోను పుంలింగములౌను. ఈ శబ్దములలో విశేషవిధిగల శబ్దములం దీ విధి ప్రవర్తింపదు.

స్వర్గయాగాద్రి మే ఘాబ్ధి ద్రు కాలాసి శ రారయః।
కర గణ్డోష్ఠ దోర్దన్త కణ్ఠ కేశ నఖ స్తనాః॥ ౭౭౮॥

టీ. స్వర్గ = స్వర్గము, యాగ = యజ్ఞము, అద్రి = పర్వతము, మేఘ = మేఘము, అబ్ధి = సముద్రము, ద్రు = వృక్షము, కాల = కాలము, అసి = ఖడ్గము, శర = బాణము, అరి = శత్రువు, కర = హస్తమును, అప్పనమును, కిరణమును, గణ్డ = కపోలము, ఓష్ఠ = అధరము, దోః = బాహువు, దన్త = దంతములు, కణ్ఠ = కంఠము, కేశ = కేశములు, నఖ = గోళ్లు, స్తన = స్తనములు, ఈ ౨౨ వస్తువుల పేళ్లు సంభవించిన దిక్కున వీని విశేషముల పేళ్లును పు॥ వీనిలో దేనికి విశేషవిధి యున్నదో యక్కడ నీ విధి ప్రవర్తింపదు. అది యేలాగన, స్వర్గ వాచకములయిన ద్యో దివ్ శబ్దములును, వృక్షవిశేషవాచకములయిన హరిచందన శింశుపాశబ్దములును, కాలవిశేషవాచకములయిన తిథిప్రతిపదాదులును, బాణవాచకమయిన ఇషుశబ్దమును, కిరణవాచకములయిన దీధిత్యాదులును, ఓష్ఠవాచకమయిన దశనవాసశ్శబ్దములును, బాహువాచకములయిన భుజబాహువులును, దంతవిశేషవాచకములయిన దంష్ట్రాశిర్విషాణశబ్దములును, కేశవిశేషవాచకములయిన జటాసటాశబ్దములును, నఖవాచకములయిన నఖనఖరశబ్దములును విశేషవిధి కలిగియున్నవి కనుక నక్కడ నీ విధి ప్రవర్తింపదు.

అహ్నాహాన్తాః

టీ. అహ్నాంతములయిన పూర్వాహ్ణాపరాహ్ణాది శబ్దములును, అహాంతములయిన ద్వ్యహత్ర్యహాది శబ్దములును పు॥, అత్యహ్నో భోజనమ్, నిరహ్నో వేళా, అను దిక్కుల నన్యపదార్థము నపుంసకమయినను స్త్రీలింగమయినను అహ్నాంతశబ్దములు పుంలింగములే యని కొందఱు.

క్ష్వేడభేదా

టీ. విషవిశేషవాచకములయిన సౌరాష్ట్రిక శౌక్లికేయాది శబ్దములు ॥పు॥, కాకోల కాలకూటాదిశబ్దములకు విశేషవిధి యున్నందున నచ్చట నీ విధి ప్రవర్తింపదు.

రాత్రాన్తాః ప్రాగసఙ్ఖ్యకాః।

టీ. ప్రాగసఙ్ఖ్యకాః=సంఖ్యాపూర్వపదములుగాని, రాత్రాన్తాః=రాత్రాంతములయిన పూర్వరాత్ర అపరరాత్ర అర్ధరాత్రాది శబ్దములు ॥పు॥ రాత్రాంతమయినను సమాహారమునందు 'అహోరాత్రమ్' అని కలదు. అతిరాత్రః అను దిక్కున నన్యపదార్థము భిన్నలింగమయినను ॥పు॥ అని కొందఱు. సఙ్ఖ్యాపూర్వపదమయినపుడు గణరాత్రమ్, పఞ్చరాత్రమ్ అని ॥న॥

(శ్రీ)వేష్టా (ద్యాశ్చ) నిర్యాసా

టీ. (శ్రీ)వేష్ట-(శ్రీ)వాస-సరళద్రవ అనునవి మొదలయినవి, నిర్యాసాః=మ్రానిబంకపేళ్లు ॥పు॥

అసన్నన్తా అబాధితాః॥ ౪౪౯॥

టీ. అబాధితాః = విశేషవిధులచేత బాధింపఁబడని, అసన్నన్తాః - అఙ్గిరస్, పురోధస్ మొదలయిన యసంతములును, సుపర్వన్, ప్లీహన్ మొదలయిన యన్నంతములును ॥పు॥, అబాధితాః అన్నందున 'యశస్, పయస్, నామన్' అను దిక్కుల నీ విధి ప్రవర్తింపదు.

కశేరు జతు వస్తూని హిత్వా తు రు విరామకాః।

టీ. కశేరుజతువస్తూని=కశేరు జతు వస్తు అను శబ్దములను, హిత్వా=విడిచి, తురువిరామకాః=తు అను వర్ణము నంతముగాఁగల హేతు సేతు మొదలైన శబ్దములును, రు అను వర్ణము నంతము గాఁగల చరు గురు మొదలైన శబ్దములును ॥పు॥, కశేరుజతువస్తు శబ్దములు ॥న॥ ఇది యుపలక్షణము గనుక దారు శ్మశ్రు కుస్తుమ్బురు మస్తు శబ్దములును ॥న॥

క ష ణ భ మ రో పాన్తా యద్య దన్తా అమీ అథ॥ ౪౫౦॥

ప థ న య స టో పాన్తా

టీ. క-ష-ణ-భ-మ-ర-ప-థ-న-య-స-ట ఈ ౧౨ వర్ణములు నుపాంతములుగాను అకారమంతముగాను గలిగిన శబ్దములు ॥పు॥, వరుసగా ఉ॥ అర్కః, స్ఫటికః, వృషః, నికషః, గణః, గుణః, కుమ్భః, కలభః, వ్యామః, గ్రామః, హారః, సారః, ధూపః, సూపః, అర్థః, శపథః, స్తనః, జనః, కులాయః, తన్తువాయః, రసః, దాసః, ఘటః, పటః ఇత్యాదులు.

గోత్రాఖ్యాశ్చరణాఽహ్వయాః।

టీ. గార్గ్యః, వాసిష్ఠః అనునవి మొదలైన గోత్రాపత్యమును జెప్పు పేళ్లును, కఠః, బహ్వృచః, ఛన్దోగః అనునవి మొదలయిన వేదశాఖాధ్యేతల పేళ్లును ॥పు॥

నామ్న్యకర్తరి భావేచ ఘ ఞ జ బ్న జ్ఞ ఘూథుచః॥ ౮౭౧॥

టీ. నామ్ని=సంజ్ఞయందును, అకర్తరి=కర్తృవ్యతిరిక్త కారకమునందును, భావేచ=ధాత్వర్థమాత్రమునందును, యథాసంభవముగా విధింపఁబడిన ఘఞ్ అచ్ అప్ నఙ్ ణ ఘ అథుచ్ అను నీయేడు ప్రత్యయము లంతముగాఁగల శబ్దములు విశేషవిధిలేనిచోట ॥పు॥, ఉ॥ సంజ్ఞయందు ఘఞ్ఞునకు పాదః, రోగః, వేశః. కర్తృవ్యతిరిక్తకారకమునందు ఘఞ్ఞునకు ప్రక్రియత ఇతిప్రాకారః, ప్రసీదన్త్యస్మిన్నితిప్రాసాదః, రజ్యతే అనే నేతి రాగః. భావార్థమునందు ఘఞ్ఞునకు త్యాగః, భోగః. అచ్ప్రత్యయమునకు నయః, జయః, చయః. అప్ప్రత్యయమునకు కరః, గరః, లవః. నఙ్ ప్రత్యయమునకు యజ్ఞః, యత్నః. ణ ప్రత్యయమునకు న్యాదః. ఘ ప్రత్యయమునకు ఉరశ్ఛదః, దన్తచ్ఛదః. అథుచ్ప్రత్యయమునకు వమథుః, వేపథుః ఇత్యాదులు.

ల్యుః కర్తరి

టీ. కర్తరి=కర్త్రర్థమునందు విధింపఁబడిన, ల్యుః=ల్యు ప్రత్యయాంతములైన, నన్దనః-రమణః-దహనః అనునవి మొదలయిన శబ్దములు ॥పు॥

ఇమని జ్భావే

టీ. భావే=భావార్థమునందు విధింపఁబడిన, ఇమనిచ్=ఇమని చ్ప్రత్యయాంతములయిన ప్రథిమన్ అనునివి మొదలయిన శబ్దములు ॥పు॥

ణో ఘో కిః ప్రాదితోఽన్యతః।

టీ. కః=భావార్థమునందు విధింపఁబడిన క ప్రత్యయాంతములయిన, ప్రస్థః-విఘ్నః-ఆఖూత్థః-శ్యేనోత్థః అనునవి మొదలయిన శబ్దములును, ప్రాదితః-ప్ర, పరా అనునవి మొదలయిన యుపసర్గలకంటె, అన్యతః = వేఱయిన సుబంతమును కర్మపదముగాఁగల, ఘోః = ఘు సంజ్ఞక ధాతువుమీఁద నధికరణార్థమునందు విధింపఁబడిన, కిః = కి ప్రత్యయాంతములయిన అమ్బుధిః-ఇషుధిః అనునివి మొదలయిన శబ్దములు ॥పు॥

ద్వన్ద్వేఽశ్వబడబా వశ్వబడబానసమాహృతే॥ ౭౫౨॥

టీ. సమాహారవ్యతిరిక్తమయిన అశ్వబడబా అను ద్వంద్వసమాసరూపమయిన శబ్దము ॥పు॥, ఇచట "పూర్వవదశ్వబడబౌ" అను సూత్రమునందు ద్వివచనము వివక్షితము గాదని తెలియఁజేయుటకై అశ్వబడబాః అని బహువచనమును ప్రయోగించినాఁడు. సమాహారమునందు ॥న॥

కాన్తస్సూర్యేన్దుపర్యాయ పూర్వోఽయః పూర్వకోఽపిచ।

టీ. సూర్యపర్యాయశబ్దములును చంద్రపర్యాయశబ్దములును అయశ్శబ్దమును పూర్వములుగాఁగల కాంతశబ్దము ॥పు॥, ఉ॥ సూర్యకాన్తః, రవికాన్తః, ఇన్దుకాన్తః, చన్ద్రకాన్తః, అయస్కాన్తః. అపిచ అన్నందున లోహకాన్తశబ్దమును ॥పు॥ అని కొందఱు.

వటక శ్చానువాకశ్చ రల్లకశ్చ కుడఙ్గకః॥ ౭౫౩॥

పుఙ్ఖో న్యూఙ్ఖస్సముద్గశ్చ విటపట్టఘటాః ఖటః।

కోట్టాఽరఘట్ట హట్టాశ్చ పిణ్డ గోణ్డ పిచణ్డవత్॥ ౨౫౨॥
గడుః కరణ్డో లగుడో వరణ్డ శ్చ కిణో ఘుణః।
దృతి సీమన్త హరితో రోమ న్థోద్గీథ బుద్బుదాః॥ ౨౫౩॥
కాసమర్దోఽర్బుదః కున్దః ఫేన స్తూపౌ సయూపకౌ।
ఆతపః క్షత్త్రియే నాభిః కణప క్షుర కేదరాః॥ ౨౫౪॥
పూర క్షురప్ర చుక్రాశ్చ గోల హిఙ్గుల పుద్గలాః।
వేతాళ మల్లభల్లాశ్చ పురోడాశోఽపి పట్టిసః॥ ౨౫౫॥
కుల్మాషో రభస శ్చైవ సకటాహః పతద్గ్రహః।

టీ. వటకశబ్దము మొదలుకొని పతద్గ్రహశబ్దపర్యంతము లయిన శబ్దములన్నియు ॥పు॥, ఈ శబ్దములలోఁ గొన్నిటికి నర్థము— కుడఙ్గకః=పొద, న్యూఙ్ఖః=ఎడతెగక యుచ్చరించిన యాఱు ఓంకారములు, ఘటః=తక్కెడ, ఖటః=తృణవిశేషము, కోట్టః=దుర్గవిశేషము, ఆరఘట్టః=దొడ్డబావి, హట్టః=అంగడివీథి, గోణ్డః=దేశవిశేషము, వరణ్డః=ముఖరోగము, దృతిః=తోలుతిత్తి, ఉద్గీథః=సామవేదప్రణవము, కాసమర్దః=కసింద, స్తూపః=మన్ను మొదలయినవాని దిన్నె, కణపః=ఆయుధవిశేషము, కేదరః=వృక్షవిశేషము, పశువిశేషమును, పూరః=ప్రవాహము, క్షురప్రః=శరవిశేషము, చుక్రః=పుల్లప్రబ్బలి, గోళః = వర్తులాకారమైన మృత్పిండము మొదలగునవి, ఇంద్రియాధారావయవ విశేషమును, విధవాపుత్త్రుఁడును, హిఙ్గులః= ఇంగిలీకము, పుద్గలః=జీవుఁడు, పరమాణువును, కుల్మాషః=అర్ధపక్వములైన ముద్గగోధూమాదులు, రభసః = త్వర, కటాహః=బహుద్రవ్యాధారమైన మృణ్మయాది భాండవిశేషము, పతద్గ్రహః=తమ్మపడిగ. తక్కినవానియర్థంబు లూహ్యంబులు.

ఇతి పుంలిఙ్గశేషః.

నపుంసకేఽన్యత్

టీ. అన్యత్ = స్త్రీలింగ పుంలింగములకంటె వేఱయిన, ముందు స్ప శబ్దరూపమంతయు, నపుంసకే = నపుంసకమున వర్తించును, హీనేఽన్యచ్చ అను పాఠమున నిదియ యర్థము.

ఖారణ్య పర్ణశ్వభ్రహిమోదకమ్॥ ౪౫౮॥
శీతోష్ణ మాంస రుధిర ముఖాక్షి ద్రవిణం బలమ్।
ఫలహేమశుల్బలోహం సుఖదుఃఖ శుభాశుభమ్॥ ౪౫౯॥
జలపుష్పాణి లవణం వ్యఞ్జనా న్యనులేపనమ్।

టీ. ఖ = ఆకాశమును, ఇంద్రియమును. తక్కిన శబ్దముల ర్థము సుబోధ్యము. ఈ యాకాశాదివస్తువుల పేళ్లును సంభవించిన క్కన వీని విశేషముల పేళ్లును విశేషవిధి బాధితములు కానివి ॥న॥

[భయామృత శకృద్వస్త్ర చాపాభరణ లాఞ్ఛనమ్॥ ౪౬౦॥
దార్వోషధమృధాపత్య హ్రద యోదర కాకుదమ్।
పత్తనాజిర శృఙ్గార్మ ద్వారబర్హోడు మానసమ్॥ ౪౬౧॥
ధ్వాన్తంచా

టీ. ఈ ౨ శ్లోకము లధికములని కొందఱు చెప్పిరి. ఇందు ము-భయము మొదలైన ౨౩ వస్తువుల పేళ్లు విశేషవిధిచే బాధిం ౦డనివి ॥న॥

ఽవ్యక్తలిఙ్గస్య భణితౌ యత్ప్రయుజ్యతే।]

టీ. అవ్యక్తలిఙ్గస్య = స్త్రీయనిగాని పురుషుఁడనిగాని యెఱుఁగఁ ని వస్తువుయొక్క, భణితౌ = చెప్పుటయందు, యత్ప్రయుజ్యతే = బ్దము ప్రయోగింపఁబడుచున్నదో అది ॥న॥ ఇందుకు "స్త్రీవా ంనాన్వాకింతస్య జాతం తదబ్ర్వీహిపణ్డిత" అని ॥ఉ॥

కోట్యాః శతాదిసఙ్ఖ్యాఽన్యా ...

టీ. కోట్యాః = కోటిశబ్దముకంటె, అన్యా = వేరైన, శతాది సఙ్ఖ్యా = శతసహస్రాది సంఖ్యావాచకములు ॥న॥, కోటిశబ్దము ॥సీ॥

వా లక్షా నియుతం చ తత్ ॥ ౪౬౨॥

టీ. లక్షా = లక్షశబ్దము, వా = వికల్పముగా ॥న॥, పక్షమునందు సీ॥, తత్ = ఆ లక్షయే, నియుతమ్ = నియుత మనిపించుకొనును.

ద్వ్యచ్కం మసిసుసన్నన్తం

టీ. ద్వ్యచ్కమ్ = రెండచ్చులుగలిగిన, అసిసుసన్నన్తమ్-అస్, ఇస్, ఉస్, అన్ అనునివి యంతముగాఁగల శబ్దములు ॥న॥, ఉ॥ అసంతమునకు యశః, పయః. ఇసంతమునకు సర్పిః, హవిః. ఉసంతమునకు వపుః, ధనుః. అన్నంతమునకు నామ, రోమ ఇత్యాదులు.

య దనాన్త మకర్తరి।

టీ. అకర్తరి = కర్త్రర్థ వ్యతిరిక్తము లయిన కరణాధికరణ భావాద్యర్థములయందు విధింపఁబడిన ల్యుట్ప్రత్యయము మొదలయిన ప్రత్యయములకు నాదేశమగు, అనాన్తంయత్ = అన అనునది యంతముగాఁగల శబ్దములు ॥న॥, కరణార్థమునందు, సాధ్యతే అనేనేతి సాధనమ్, అధికరణార్థమునందు, అధిక్రియతే అస్మిన్నితి అధికరణమ్, భావార్థమునందు, పచనమ్ ఇత్యాదులు.

త్రాన్తం సలోపధం శిష్టం

టీ. త్రాన్తమ్ = త్ర అను నక్షరము అంతముగాఁగల పత్ర గాత్ర కళత్రాదిశబ్దములును, సలోపధమ్ = లకారోపధములైన కుల ఫల జలాదిశబ్దములును, శిష్టమ్ = విశేషవిధిబాధితములు గానివి ॥న॥, కొందఱు సలోపధమను దానికి సకారోపధములును లకారోపధములును నని యర్థము చెప్పి యవస బిసాదులును ॥న॥ అందురు. కొందఱు 'త్రాన్తంసనోపధం' అని పాఠముచెప్పి కేవలత్రాంతములైన పాత్ర శత్రాదులును సకారోపధములై త్రాంతములైన వస్త్రశస్త్రాదులును నకారోపధములై త్రాంతములైన ఆన్త్రతన్త్రాదులును ॥న॥ అందురు.

రాత్రం ప్రాక్సఙ్ఖ్యయాఽన్వితమ్॥ ४६३॥

టీ॥ సఙ్ఖ్యయాప్రాక్ = సంఖ్యావాచక మయిన పూర్వపద ముతో, అన్వితమ్=కూడిన, రాత్రమ్ = రాత్రశబ్దము, ॥న॥ ఉ॥ గణ రాత్రమ్, త్రిరాత్రమ్ ఇత్యాదులు.

పాత్రాద్యదన్తై రేకార్థో ద్విగు ర్లక్ష్యానుసారతః।

టీ॥ పాత్రాద్యదన్తైః = పాత్రశబ్దము మొదలుగాఁగల అకారాంతములయిన యుత్తరపదములతోఁ గూడినదై, ఏకార్థః = సమాహారార్థమునందు వర్తించిన, ద్విగుః = ద్విగుసమాసము, లక్ష్యానుసారతః = ప్రయోగానుసారమువలన, ॥న॥ ఉ॥ పఞ్చపాత్రమ్, త్రిభువనమ్, చతుర్యుగమ్ ఇత్యాదులు.

ద్వన్ద్వైక త్వావ్యయీభావౌ

టీ. ద్వన్ద్వైకత్వ = సమాహారార్థమునందు వర్తించిన ద్వంద్వ సమాసమును, అవ్యయీభావౌ = అవ్యయీభావసమాసమును, ॥న॥ ఉ॥ సమాహారద్వంద్వమునకు పాణిపాదమ్, అశ్వబలీవర్దమ్. అవ్యయీభావమునకు ఉపకుమ్భమ్, యథావిధి.

పథ స్సఙ్ఖ్యాఽవ్యయా త్పరః॥ ४६४॥

టీ. సఙ్ఖ్యా=సంఖ్యనుజెప్పు శబ్దములు, అవ్యయాత్ =అవ్యయ పదములు వీనికంటె, పరః = పరమై కృతసమాసాంతమయిన, పథః= పథశబ్దము విశేషవిధిబాధితము గానిది, ॥న॥ ఉ॥ సంఖ్యాపూర్వకమునకు త్రిపథమ్, చతుష్పథమ్. అవ్యయపూర్వకమునకు విపథమ్, సుపథమ్.

షష్ఠ్యా శ్ఛాయా బహూనాంచే ద్విచ్ఛాయం

టీ. షష్ఠ్యాః అను నీపదము 'కన్థోశీనరనామసు' అనుపర్యంత మనువర్తించును. షష్ఠ్యాః=షష్ఠ్యంతముకంటెఁ బరమైన, ఛాయా= ఛాయా శబ్దమంతముగాగల తత్పురుషసమాసము, బహూనాం

చేత్ = ఆఛాయ బహువస్తువుల సంబంధియైన ॥న॥, విచ్ఛాయమ్ అనునది యుదాహరణము. వీనాం పక్షిణాం ఛాయా విచ్ఛాయమ్ అని విగ్రహము.

సంహతౌ సభా ।

శాలార్థాఽపిపరా రాజాఽమనుష్యార్థా దరాజకాత్ ॥ ౪౬౫॥

దాసీసభం నృపసభం రక్షస్సభ మిమాదిశః ।

టీ. షష్ఠ్యంతముకంటెఁ బరమయిన, సంహతౌ = సమూహార్థమునందు వర్తించిన, సభా=సభాశబ్ద మంతముగాఁగల తత్పురుష సమాసము ॥న॥, షష్ఠ్యంతములయి, అరాజకాత్ = రాజశబ్దవ్యతిరిక్తములైన, రాజాఽమనుష్యార్థాత్ = రాజపర్యాయములకంటెను రక్షఃపిశాచాది వాచకముల కంటెను, పరా=పరమై, శాలార్థాఽపి= శాలార్థకమునైన, సభా = సభా శబ్దమంతముగాఁగల తత్పురుష సమాసమును ॥న॥, దాసీసభ మనునది మొదలు 3 ను క్రమముగా నుదాహరణములు. ఇమాదిశః అన్నందున నీలాగే యుదాహరణాంతరములు తెలియవలెను.

ఉపజ్ఞోపక్రమాన్తశ్చ తదాదిత్వ ప్రకాశనే॥ ౪౬౬॥

కోపజ్ఞ కోపక్రమాఽది

టీ. ఉపజ్ఞోపక్రమాన్తః = ఒకరుచెప్పకయే తనచేత నెఱుఁగబడిన వస్తువు ఉపజ్ఞా అనఁబడును. ఒకరు చెప్పకయే తనచేత నారంభింపఁబడిన వస్తువు ఉపక్రమః అనఁబడును. ఇట్టి యుపజ్ఞోపక్రమ శబ్దము లంతములుగాఁగల షష్ఠీతత్పురుషసమాసములు, తదాదిత్వ ప్రకాశనే=ఆయుపజ్ఞోపక్రమములకు మొదలు తోఁచునపుడు ॥న॥, ఉ॥ కోపజ్ఞమ్, కోపక్రమమ్. ఇచట కస్య ఉపజ్ఞా కోపజ్ఞమ్, కస్య ఉపక్రమః కోపక్రమమ్ అని విగ్రహములు. ఇందుకు క అనఁగా బ్రహ్మ - అతనిచేత నొకరుచెప్పకయే మొదట నెఱుఁగఁబడినది యనియు, నతనిచేతనే యొకరుచెప్పకయే మొదట నారంభింపఁబడినది యనియు నర్థము. ఆ రెంటికిని వరుసగా వేదమును సర్గమును

విశేష్యములు. ఆదిశబ్దముచేత ప్రాచేతసోపజ్ఞం రామాయణమ్ ఇత్యాదులు తెలియవలెను.

కన్థోశీనర నామసు।

టీ. ఉశీనర = ఉశీనరదేశమునందలి, నామసు = సంజ్ఞవిషయమ్మయినపుడు, కన్థా=కన్థాశబ్ద మంతముగాఁగల షష్ఠీతత్పురుషసమాసము ॥న॥, సౌశమీనాం కన్థా సౌశమికన్థమ్, ఆహ్వరకన్థమ్ ఇత్యాదు లుదాహరణములు.

భావే న ణ క చిద్భ్యోఽన్యే సమాహే భావకర్మణోః॥
అద న్తప్రత్యయాః

టీ. నణకచిద్భ్యః = నప్రత్యయ ణప్రత్యయ కప్రత్యయ చకారేత్ప్రత్యయములకంటె, అన్యే=ఇతరములైన, భావే=ధాత్వర్థమునందు విధింపఁబడిన కృత్ప్రత్యయములు, సమాహే = సమాహార్థమునందును, భావ కర్మణోః = భావకర్మార్థములయందును విధింపఁబడిన, అద న్తప్రత్యయాః = అకారాంత తద్ధితప్రత్యయములును నంతముగాఁగల శబ్దములు ॥న॥, ఉ॥ కృత్ప్రత్యయములకు భావార్థమునందు వ స్తవ్యమ్, ఇచట తవ్యప్రత్యయము. జేయమ్, ఇచట యత్. బ్రహ్మభూయమ్, ఇచట క్యప్. సాంరావిణంవ ర్తతే, ఇచట ఇనుణ్, అకారాంత తద్ధితములకు సమాహార్థమునందు, భిక్షాణాం సమాహారో భైక్షమ్. గార్భిణమ్, యౌవతమ్, ఇచట అణ్. భావ కర్మార్థములయందు శుక్లస్య భావః కర్మవా శౌక్ల్యమ్, బ్రాహ్మణ్యమ్, ఇచట ష్యఞ్, యత్నః, నాద్యః, ఆఖూత్థః, జయః, ఇవి మొదలయిన నణకచిత్ప్రత్యయాంతములు ॥పు॥

పుణ్యసుదినాభ్యాం త్వహః పరః।

టీ. పుణ్యసుదినాభ్యామ్=పుణ్యసుదినశబ్దములకంటె, పరః= పరమైయుండు కృతసమాసాంతమైన, అహః = అహశ్శబ్దము ॥న॥, ఉ॥ పుణ్యాహమ్, సుదినాహమ్. ఇచట సుదినశబ్దము శోభనమాత్ర వాచకము.

క్రియాఽవ్యయానాం భేదకా న్యేకత్వే

టీ. క్రియాఽవ్యయానామ్=క్రియలకును అవ్యయములకును, భేదకాని=విశేషములయిన శబ్దములు ॥న॥, అవి ఏకత్వేఽపి అన్నందున నేకవచనాంతములును, ఉ॥ క్రియావిశేషణములకు మన్దం పచతి, మృదుపచతి. అవ్యయవిశేషణములకు శ్వశ్శోభనం, శ్వోరమణీయమ్.

ఇకను గొన్ని నపుంసకములను స్వరూపముచేఁ జెప్పుచున్నాఁడు.

ఉప్యుక్థతోటకే॥ ౪౬౮॥
చోచం బర్హం గృహస్థూణాం తిరీటం మర్మయోజనమ్।
రాజసూయం వాజపేయం గద్యపద్యే కవేః కృతౌ॥ ౪౬౯॥
మాణిక్య భాష్య సిన్దూర చీర చీవర పఞ్జరమ్।
లోకాయతం హారీతాలం విదలం స్థాల బాహ్లికమ్॥ ౪౭౦॥

టీ. ఉక్థశబ్దము మొదలు బాహ్లికశబ్దపర్యంతమైన శబ్దములు ॥న॥, వీనిలోఁ గొన్నిటి కర్థములు—ఉక్థమ్=సామవిశేషము, తోటకమ్=వృత్తవిశేషము, చోచమ్=తాటిపండు, తిరీటమ్=చుట్టుట, లోకాయతమ్ = చార్వాకశాస్త్రము, విదలమ్ = దాడిమవిత్తులు, పెసలు మొదలైనవాని బేడలని కొందఱు, స్థాలమ్=భోజనపాత్రము.

ఇతి నపుంసకలిఙ్గశేషః.

---

పున్నపుంసకయోః శేషోఽ

టీ. ఇది స్త్రీపుంసాధికారమువలె కనువర్తించును, శేషః= పున్నపుంసక వివరణములయందుఁ జెప్పబడు అర్ధర్చాదిశబ్దములు॥పు్న॥

ఽర్ధర్చ పిణ్యాక కణ్టకాః।
మోదక స్తణ్డక టఙ్క శాటకః ఖర్వటోఽర్బుదః॥ ౪౭౧॥
పాతకోద్యోగచరక తమాలామలకా నడః।

కుష్ఠం ముణ్డం శీధు పుస్తం క్ష్వేడితం క్షేమ కుట్టిమమ్॥ ౮౭౨॥
సజ్ఞమం శతమానార్మ శమ్బ లావ్యయ తాణ్డవమ్।
కవికం కన్దకార్పాసం పారావారం యుగన్ధరమ్॥ ౮౭౩॥
పూయం ప్రగ్రీవ పాత్రీవే యూషం చమస చిక్కసే।

టీ. ఇందులోఁ గొన్నిటి కర్థము-అర్ధర్చః=ఋక్కులోసగము, తణ్డకః=భూషణము (పా) దణ్డకః, శాటకః=అల్పవస్త్రము, ఖర్వటః=గ్రామశతమధ్యమునందుండు ప్రధానగ్రామము (వ) ఉపగ్రామము (వ) కంటకావృత గ్రామము (పా) కర్పటః = చిన్నపంచ, చరకః = వైద్యగ్రంథము, పుస్తమ్ = పూయుట మొదలయినక్రియ, పుస్తకము (పా) బుస్తమ్ = మాంసవిశేషము, శతమానమ్ = పలిమోఁడు వెండి, తూమోఁడు ధాన్యము మొదలయినవి యని కొందఱు, అర్మ = నేత్రరోగము, నకారాంతము, అకారాంతమని కొందఱు, శమ్బలమ్=సంబళము, అవ్యయమ్=అవ్యయశబ్దములు, కవికమ్ (పా) కవియమ్ (పా) కవీయమ్ = కళ్లెము, యుగన్ధరమ్ = రథము నొగలు, పర్వత విశేషమని కొందఱు, పూయమ్ = చీము, ప్రగ్రీవమ్ = కిటికి, మడన చేతులని కొందఱు, పాత్రీవమ్=యజ్ఞోపకరణము, యూషమ్=పెసలు మొదలయినదానికట్టు, చమసమ్ = యజ్ఞపాత్రము, చిక్కసమ్ = యవాదుల పిష్టము.

అర్ధర్చాదౌ ఘృతాదీనాం పుంస్త్వం యద్వైదికం ధ్రువమ్॥
తన్నోక్త మిహ లోకేఽపి తచ్చేద స్త్యస్తు శేషవత్।

టీ. అర్ధర్చాదౌ = అర్ధర్చాదిగణమునందు, ఘృతాదీనామ్ = ఘృతక్షీరాదిశబ్దములకు, యత్ పుంస్త్వమ్ = ఏ లింగము చెప్పఁబడెనో, అది ధ్రువమ్=నిశ్చయముగా, వైదికమ్=వేదసిద్ధము, తత్ = కనుక, ఇహ = ఇక్కడ, నోక్తమ్ = చెప్పఁబడలేదు, లోకేఽపి = లోకమునందును, తత్ =ఆ పుంలింగప్రయోగము, అస్తిచేత్ =కలిగిన యెడ, శేషవదస్తు=శేషమువలె నగును. అనగా 'శేషం తు జ్ఞేయం శిష్టప్రయోగతః' అని ముందు జెప్పుచున్నాఁడు; అక్కడ శేష మనఁగా నీశాస్త్రమునందుఁ దాను జెప్పని నామలింగనిర్ణయములు

ఏలాగున శిష్టప్రయోగమువలనఁ దెలియఁదగినవో యాలాగున నిక్క డను తెలియవలెనని యర్థము.

ఇతి పున్నపుంసకలిఙ్గశేషః

---

స్త్రీపుంసయోః

టీ. ఇది స్త్రీనపుంసకాధికారమువర కనువర్తించును.

అపత్యాన్తాః

టీ. అపత్య=అపత్యార్థమునందు విధింపఁబడిన అణ్ ఇఞ్ యఞ్ మొదలయిన ప్రత్యయములు, అన్తాః = అంతముగాఁగల శబ్దములు ప్స॥ ఉ॥ ఔపగవః, ఔపగవీ; దాక్షిః, దాక్షీ; గార్గ్యః, గార్గీ.

ద్విచతుష్షట్పదోరగాః॥ ४२१॥

జాతిభేదాః

టీ. ద్విచతుష్షట్పద = ద్విచతుష్షట్పదజాతులఁజెప్పు శబ్దములును, ఉరగాః = సర్పవాచకశబ్దములును ప్స॥ ఉ॥ ద్విపదజాతికి-పురుషః, పురుషీ; కుక్కుటః, కుక్కుటీ, చతుష్పదజాతికి-మృగః, మృగీ, షట్పదజాతికి-భ్రమరః, భ్రమరీ, సర్పవాచకములకు-ఉరగః, ఉరగీ, ద్విపదజాతు లుపలక్షణము కనుక, మత్స్యః, మత్సీ ఇత్యాదులును ప్స॥

పుమాఖ్యాశ్చ స్త్రీయోగైస్సహ

టీ. పుమాఖ్యాః=పురుషవాచకము లయిన ప్రష్ఠగోపాలగణకాది శబ్దములు, స్త్రీయోగైస్సహ=పురుషసంబంధమువలన స్త్రీలను జెప్పు ప్రష్ఠీ గోపాలీ గణకీ ఇత్యాదిశబ్దములతోఁడ ప్స॥ ఇచట మరియొక వ్యాఖ్యానము స్త్రీ=స్త్రీవ్యక్తి, యోగైః = పురుష సంబంధములచేత, పుమాఖ్యాః=ప్రష్ఠగోపాలాది పురుషనామములను పొందునని. ఈ ౨ వ్యాఖ్యానములయందును ప్రష్ఠగోపాలాది ప్రాతిపదికములు పురుషులను స్త్రీలను జెప్పి ద్విలింగము లౌనసుట. రెండవ వ్యాఖ్యానమునందు 'సహ' అను పదము ముందటి మల్లకపథముతోఁ జేరుచున్నది.

మల్లకః ।
యోని ర్వరాటక స్స్వాతిర్వర్ణకో ఝూటలో మనుః॥
మూషా సృపాటీ కర్కన్ధూ ర్యష్టి శ్శాటిః కటీ కుటీ।

టీ. మల్లకశబ్దము మొదలు కుటీశబ్దము పర్యంతము లయిన
ములు ప్న॥ ఇందులోఁ గొన్నిటికి నర్థము - మల్లకః = ప్రమిద,
కః=నీలి మొదలయిన వన్నెలు. (పా) వల్లకః=వీణె, ఝూటలః=
క్కపుచెట్టు, ఇయంమనుః = మనువు పెండ్లాము (పా) ఇయం
ిః = తపస్విని, సృపాటీ = పరిమాణ విశేషము, నదీవిశేషమును,
= గుడిసె.

ఇతి స్త్రీపుంలిఙ్గశేషః

---

స్త్రీనపుంసకయోః
టీ. ఈపదము త్రిలింగాధికారమువర కనువర్తించును.
భావక్రియయోష్ష్యఞ్ క్వచిచ్చవుఞ్॥    ౪౭౭॥
ఔచిత్య మాచితీ మైత్ర్యం మైత్రీ వుఞ్ ప్రాగుదాహృతః।

టీ. భావక్రియయోః = భావార్థకర్మార్థములయందు విధింపఁ
ష్యఞ్=ష్యఞ్ప్రత్యయాంతములును, వుఞ్=వుఞ్ప్రత్యయాం
లును, క్వచిత్=ఒకానొకదిక్కున స్న॥. ష్యఞ్ప్రత్యయాంతము
ఉదాహరణములు. ఔచిత్యమ్, ఔచితీ; మైత్ర్యమ్, మైత్రీ,
ఇది దిక్ప్రదర్శనము కనుక వైదగ్ధ్యమ్, వైదగ్ధీ; అను
మ్, అనుపూర్వీ ఇవి మొదలయినవి తెలియవలెను. క్వచిచ్చ
నన బ్రాహ్మ్యమ్, దార్ఢ్యమ్, శౌక్ల్యమ్, మొదలయినవి నపుం
లేను. వుఞ్ = వుఞ్ప్రత్యయాంతములు, ప్రాక్=మునుపే,
మనుష్యవర్గాదులయందు, ఉదాహృతః=చెప్పఁబడియున్నవి.
ట్లన, చోరికా ఆహోపురుషికా వార్ధకమ్ అని క్వచిచ్చ
ఁన వుఞ్ ప్రత్యయాంతములు కొన్ని స్త్రీలింగములే కొన్ని
లింగములే కొన్ని రెండులింగములును కాఁబట్టి ప్రయోగ
న తెలిసికొనఁ దగినది.

షష్ఠ్యన్తప్రాక్పదా స్సేనా ఛాయా శాలా సురా నిశాః॥
స్యుర్వా నృసేనం శ్వనిశం గోశాల మితరేచదిక్।

టీ. షష్ఠ్యంతపూర్వపదముగాఁ గల సేనా ఛాయా సురా నిశా శబ్దములు స్న॥, స్యుః = ఔను, నృసేనమిత్యాదు హరణములు. ఇతరేచ అన్నందున వృక్షచ్ఛాయమ్, యవ అనునవియుఁ దెలియవలెను. ఇచట వా అన్నందున నృసేనా, చ్ఛాయా, గోశాలా-యవసురా-శ్వనిశా అని స్త్రీలింగోదా ములును తెలియవలెను. శ్వనిశ మనఁగా కృష్ణచతుర్దశి.

ఆబన్నన్తోత్తరపదో ద్విగు శ్చాపుంసినశ్చ లుప్॥
త్రిఖట్వంచ త్రిఖట్వీచ త్రితక్షంచ త్రితక్ష్యపి।

టీ. ఆబన్నన్తం=ఆబంతమును అన్నంతమును, ఉత్త ఉత్తరపదముగాఁగల, ద్విగుశ్చ=ద్విగుసమాసము, అపుంసినశ్చ అనఁగా అన్నంతనకారములకు లోపము వచ్చునని యర్థము త్రిఖట్వమ్, త్రిఖట్వీ మొదలయినవి.

ఇతి స్త్రీనపుంసకశేషః.

---

త్రిషు పాత్రీ పుటీ పేటీ వాటీ కువల దాడిమాః॥

టీ. పాత్రీశబ్దము మొద లాఱుశబ్దములు మూఁడు లి యందు వర్తించును.

ఇతి త్రిలిఙ్గశేషః.

---

పరలిఙ్గం స్వప్రధానే ద్వన్ద్వే తత్పురుషేఽపిచ।

టీ. స్వప్రధానే ద్వన్ద్వే=ఇతరేతర యోగద్వంద్వముః తత్పురుషేఽపిచ=తత్పురుష సమాసమునందును, పరలిఙ్గ పదముయొక్క లింగము వచ్చును, ॥ఉ॥ ఇతరేతర యోగద్వ నకు ఉ॥ కుక్కుటమయూర్యౌ, మయూరీకుక్కుటౌ; తత్పురుష అర్ధపిప్పలీ, కరకిసలయమ్.

ఇతి పరవల్లిఙ్గశేషః.

---

అర్థాన్తాః ప్రాద్యలం ప్రాప్తాఽపన్న పూర్వాః పరోపగాః॥

టీ. అర్థాన్తాః = అర్థశబ్దమంతముగాఁగల సమాసములును, ప్రాద్యలం ప్రాప్తాఽపన్నపూర్వాః = ప్రాద్యుపసర్గలును అలంశబ్దమును ప్రాప్తశబ్దమును ఆపన్నశబ్దమును పూర్వముగాఁగల సమాసములును, తత్పురుషము లయినను, పరోపగాః = విశేష్యలింగము గలవి, అర్థాంతములకు॥ఉ॥ బ్రాహ్మణాయాయమ్, బ్రాహ్మణార్థస్సూపః, బ్రాహ్మణార్థా యవాగూః, బ్రాహ్మణార్థం పయః. ప్రాదులకు ॥ఉ॥ అతిక్రాన్తః ఖట్వామ్ = అతిఖట్వః పురుషః, అతిఖట్వా స్త్రీ, అతిఖట్వం కులమ్ ఇత్యాదులు. అలంపూర్వమునకు ॥ఉ॥ అలంజీవికాయై అలంజీవికః, అలంజీవికా, అలంజీవికమ్; ఈలాగున ప్రాప్తజీవికః, ఆపన్నజీవికః అనునవియు.

తద్ధితార్థే ద్విగుః

టీ. తద్ధితార్థే = తద్ధితార్థమునందు విధింపఁబడిన, ద్విగుః = ద్విగు సమాసము విశేష్యలింగముగలది. ॥ఉ॥ పఞ్చసుకపాలేషు సంస్కృతః పఞ్చకపాలః పురోడాశః, పఞ్చకపాలా యవాగూః, పఞ్చకపాలం హవిః.

సఙ్ఖ్యా సర్వనామ తదన్తకాః।

టీ. సఙ్ఖ్యా = సంఖ్యావాచకశబ్దములు, సర్వనామ = సర్వనామ శబ్దములును, తదన్తకాః = అవి యంతముగాఁగల శబ్దములును, విశేష విధిలేనివి విశేష్యలింగముగలవి, ॥ఉ॥ సంఖ్యావాచకములకు - ఏకః పురుషః, ఏకా స్త్రీ, ఏకం కులమ్ ఇత్యాదులు. సర్వనామములకు - సర్వః, సర్వా, సర్వమ్ ఇత్యాదులు. సంఖ్యాంతములకు - పరమైకః, పరమైకా, పరమైకమ్ ఇత్యాదులు. సర్వనామాంతములకు - పరమ సర్వః, పరమసర్వా, పరమసర్వమ్ ఇత్యాదులు.

బహువ్రీహి రదిఙ్నామ్నా మున్నేయం త దుదాహృతమ్॥

టీ. అదిఙ్నామ్నామ్ = దిగ్వాచకశబ్దములకంటె వేఱయినశబ్ద ములకు వచ్చిన, బహువ్రీహిః = బహువ్రీహిసమాసము విశేష్య

లింగము గలదియౌను, తదుదాహృతమ్ = దానికి నుదాహరణ:
ఉన్నేయమ్=ఊహింపఁదగినది. ఎట్లనఁగా, చిత్రా పటా యస్య చ
పటః పురుషః, చిత్రపటా స్త్రీ, చిత్రపటం కులమ్ ఇత్యాదులు.

గుణ ద్రవ్య క్రియా యోగోపాధయః పరగామినః।

టీ. గుణ=గుణమును, ద్రవ్య=ద్రవ్యమును, క్రియా=క్రి
యును, యోగోపాధయః = ప్రవృత్తినిమిత్తముగాఁగల శబ్దము
పరగామినః=విశేష్యలింగము గలవి, ॥ఉ॥ గుణోపాధులకు - శ
శాటిః, శుక్లః పటః, శుక్లం వస్త్రమ్; ద్రవ్యోపాధులకు-దణ్డీ పుర
దణ్డినీ స్త్రీ, దణ్డికులమ్. క్రియోపాధులకు-పాచకః పురుషః, పాచ
స్త్రీ, పాచకం కులమ్ ఇత్యాదులు.

కృతః కర్తర్యసంజ్ఞాయాం

టీ. అసంజ్ఞాయామ్=సంజ్ఞావ్యతిరిక్తమయిన, కర్తరి=కర్తృ
నందు విధింపఁబడిన, కృతః=కృత్ప్రత్యయాంతశబ్దములు విశేష్య
ములు గలవి. ఉ॥ కర్తా, కర్త్రీ, కర్తృ; కుమ్భకారః, కుమ్భకారీ, కు
కారమ్ ఇత్యాదులు. సంజ్ఞయందు సింహః, వ్యాఘ్రః అని ॥ప

కృత్యాః కర్తరి కర్మణి॥ ర

టీ. కర్తరి=కర్త్రర్థమునందును, కర్మణి = కర్మార్థమునం
విధింపఁబడిన, కృత్యాః=కృత్యప్రత్యయము లంతముగాఁగల శబ్ద
విశేష్యలింగములు గలవి, ॥ఉ॥ కర్త్రర్థమునందు - భవ్యస్తరుః, భ
లతా, భవ్యం ఫలమ్; కర్మార్థమునందు - వక్తవ్యః, వక్త
వక్తవ్యమ్; భావార్థమునందు - స్థాతవ్యమ్ అని ॥న॥

అణాద్యన్తా స్తేనరక్తాద్యర్థే నానార్థభేదకాః।

టీ. తేనరక్తాద్యర్థే=దానిచేత నిది చాయవేయఁబడినది
నది మొదలైన యర్థములయందు విధింపఁబడిన, అణాద్యన్తాః=అ
త్యయము మొదలైన తద్ధితప్రత్యయము లంతముగాఁగల శబ్ద
నానార్థభేదకాః=నానార్థములకు విశేషణములై విశేష్యలింగము
యౌను. ఉ॥ కుసుమ్భేనరక్తః కౌసుమ్భః పటః, కౌసుమ్భా శ

కౌసుమ్భం వస్త్రమ్, ఇన్ద్రో దేవతాఽస్య ఐన్ద్రః పురోడాశః, ఐన్ద్రీ ఋక్, ఐన్ద్రం హవిః. కొందఱు "నానార్థభేదకాః" అనునది ప్రత్యేకముచేసి నానార్థవాచకములైన శబ్దములు విశేష్యలింగములు గలవి యౌనని యర్థముచెప్పి యందులకు నుదాహరణములుగ శివో రుద్రః, శివా గౌరీ, శివం భద్రమ్ అని చెప్పుదురు.

ఇతి వాచ్యలిఙ్గశేషః.

---

షట్సంజ్ఞకా స్త్రిషు సమా యుష్మ దస్మ త్తి జవ్యయమ్॥

టీ. షట్సంజ్ఞకాః=షట్సంజ్ఞ శబ్దములును, యుష్మత్ =యుష్మచ్ఛబ్దమును, అస్మత్ =అస్మచ్ఛబ్దమును, తిజ్ =తిజంతములును, అవ్యయమ్=అవ్యయమును, త్రిషుసమాః=మూఁడులింగములయందు నేకరూపములై యుండును. షట్సంజ్ఞము లనఁగా షకారాంత నకారాంత సంఖ్యావాచకములును, కతిశబ్దములును. ॥ఉ॥ షకారాంతసంఖ్యకు - షడిమే, షడిమాః, షడిమాని; నకారాన్తసంఖ్యకు - పఞ్చప్రాణాః, పఞ్చస్త్రియః, పఞ్చఇన్ద్రియాణి; కతిశబ్దమునకు - కతిపురుషాః, కతిస్త్రియః, కతికులాని; యుష్మచ్ఛబ్దమునకు - త్వంపుమాన్, త్వంస్త్రీ, త్వంనపుంసకమ్; అస్మచ్ఛబ్దమునకు - అహంపుమాన్, అహంస్త్రీ, అహంనపుంసకమ్; తిజన్తమునకు - పచతిపుమాన్, పచతిస్త్రీ, పచతి నపుంసకమ్; అవ్యయమునకు - ఉచ్చైర్గిరిః, ఉచ్చైశ్శాలా, ఉచ్చైర్గృహమ్.

ఇత్యలిఙ్గప్రకరణమ్.

---

పరం విరోధే

టీ. విరోధే=విరోధమనఁగా నన్యత్ర చరితార్థములైన రెండు లక్షణము లొక యుదాహరణమందు ప్రాప్తించుట. అట్టి విరోధము ఈ లింగాదిసంగ్రహవర్గయందుఁ జెప్పిన లక్షణములకు సంభవించిన దిక్కున, పరమ్=పరమైన లక్షణముచేత విధింపఁబడు లింగమే నిర్ణయింపఁదగినది. అది యెట్లన, అసురపర్యాయములు పుంలింగము

లని పుంలింగశేషమునందుఁ జెప్పిన లక్షణము రాక్షసాదిశబ్ద
యందుఁ జరితార్థము. అసంతములు నపుంసకము లని నపుంసక
శేషమందుఁ జెప్పిన లక్షణము యశశ్శబ్దాదులయందుఁ జరితార్థ
ఈ రెండులక్షణములును రక్షశ్శబ్దమందు ప్రాప్తములయ్యెను 
నిచట పరమై ద్వ్యచ్కమసిసుసన్నంత మను లక్షణముచే విధి
బడిన నపుంసకలింగమే నిర్ణయింపఁదగినది. ఈలాగున నక్కడక
నూహించునది.

శేషంతు జ్ఞేయం శిష్టప్రయోగతః।

టీ. శేషమ్ = ఈ శాస్త్రమునందుఁ జెప్పబడని నామము
లింగములును, శిష్టప్రయోగతః = మహాకవి ప్రయోగముఁ
జ్ఞేయమ్ = తెలియఁదగినది.

ఇతి లిఙ్గాదిసఙ్గ్రహవర్గః.

---

ఇ త్యమరసింహకృతౌ నామలిఙ్గానుశాసనే।
తృతీయకాణ్డ స్సామాన్య స్సాఙ్గఏవ సమర్థితః॥

టీ. ఇతి = పూర్వోక్తమైన, నామలిఙ్గానుశాసనే = నామలిం
శాసన మను, అమరసింహకృతౌ = అమరసింహునియొక్క గ్రం
నందు, తృతీయః = మూఁడవదయిన, సామాన్యకాణ్డః = సామ
కాండము, సాఙ్గఏవ = సమగ్రముగానే, సమర్థితః = నెఱ
బడియెను.

సటీకమగు నామలింగానుశాసనమునందు
తృతీయకాండము సంపూర్ణము.
శ్రీకృష్ణార్పణమస్తు.



THE JUPITER PRESS, LTD., 16, SEMBUDOSS STREET, MADRAS—1.